# విషయానుక్రమణిక

## జనవరి 1988

# స్వవిషయం

***భారతి అభిమానులు అందరికీ నమస్కారాలు***

భారతి మాసతికగా వెలువడకపోవటం మాకే కాకుండా చదివేవారికి ఎందరికో చాలా బాధ కలిగించింది. ఎలాగయినా రతిని ప్రతి నెలా బయటికి తీసుకువచ్చే ఏర్పాట్లు చెయ్యమని అంతమంది కోరటంతో మాకు కొత్త ఉత్సాహం, ర్యం కలిగాయి ! శ్రేయోభిలాషులని సంప్రదించి కొన్ని చిన్న మార్పులతో కొద్దిగా పెరిగిన వెలతో భతిని వెలువరించటానికి వీలవుతుందని తెలుసుకుని ఆ పనికి ఉపక్రమించాము. అనుకున్న తేదీకి జనవరి 1988 భారసంచికని బయటికి తీసుకురాలేకపోయాము కాని ఈ లోపం త్వరలోనే సర్దుకోగలదని ఆశిస్తున్నాము.

భారతిలో ఎటువంటి మార్పులు వస్తున్నాయో భారతిని చదివేవారే నిర్ణయించగలరు. కొన్ని "కోతలు" పడినా మొత్తంమీద భారతీఒక సాహిత్య మాసపత్రికగానే వెలువడుతుందని వేరే చెప్పనక్కరలేదు. అభిమానంతో, ఆసక్తితో భారతిని చదివేవారికే కాకుండా భారతికి రాసేవారికి కూడా వస్తున్న మార్పులు అసంతృప్తిని కలిగించవని మేము నమ్ముతున్నాము. భారతి తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండాలని మా ఆశయం. రచయిత్రులూ, రచయితలూ, పఠితలూ, ప్రకటనలు ఇచ్చేవారూ - వీరందరి ఆదరాభిమానాలే మా ఆశయం నెరవేరటానికి తోడ్పడగలవు ఎప్పటిలాగే తమ సహకారాన్ని అందచెయ్యాలని వారందరినీ కోరుకుంటున్నాము. తక్కిన మార్పులతోబాటు 'సంపాదకీయ బాధ్యతల" విషయంలో కొన్ని మార్పులు తీసుకు రావాలని మేము అనుకుంటున్నాము. ఈ మార్పులు రావటానికి కొన్ని నెలలు పట్టవచ్చు. అవి ఎటువంటివి అయివుండగలవో రాబోయే సంచికలలో సూచించగలము.

ఈ నెల భారతిలో సుపరిచితమయిన (సుప్రసిద్ధమయిన) పేర్లు చాలానే కనపడుతాయి ! ఇటువంటివారి రచనలు భారతిలో తరుచు పడటం అందరికీ సంతోషం కలిగించదగిన విషయమే కాని భారతిలో పాఠకలోకానికి అంతగా తెలియని కొత్త రచయిత్రుల రచయితల పేరులు సయితం తరుచు కనపడాలని మా కోరిక! భారతి మొదటి సంచిక వెలువడి ఇప్పటికి అరవదినాలుగు సంవత్సరాలు దాటుతోంది. ఈ ఆరున్నర దశాబ్దాల కాలంలో తెలుగు సాహిత్యానికి వన్నె తెచ్చినూరి రచనలు లెక్కలేనన్ని భారతిలో పడ్డాయి. వీరిలో చాలామంది భారతిద్వారానే చదివేవారికి పరిచయం అయ్యారు. ఇకముందు కూడా, ఇదేవిధంగా భారతి కొత్తవారికి ఎందరికో ఒక వేదికగా నిలబడగలదని మేము ఆశిస్తున్నాము.

ప్రతి సంవత్సరమూ భారతి జనవరి సంచికలో "స్వవిషయం"లో తక్కిన విషయాలతోబాటు రాజకీయాలని గురించి కూడా కొంత రాయటం అలవాటుగా ఉండేది. ఈ అలవాటుని కొనసాగించటం అనవసరం అని ఇప్పుడు అనిపిస్తోంది! లోపలి పేజీలలో మాత్రమే అవసరాన్ని, అవకాశాన్నిబట్టి రాజకీయాలని గురించి రచనలు చేస్తే చాలునని మేము అనుకుంటున్నాము!

అందరికీ 1988 సంవత్సరం శుభాకాంక్షలు తెలుపుకుంటున్నాము.

# మూగబాస

## శ్రీ వజ్ఝల కాళిదాసు

బరువు బ్రతుకు మూగ బాస
మహతి వేయి తీగల ఘోష!

ఆకలి కేకలు,
ఆగ్రహ హుంకారాలు,
భీతార్తనాదాలు!

వినోద సంగీతాలు
కరుణానుకంప స్వరాలు
తరుణానంద కంఠాలు!

అమృనిష్యం ద్యాలాపాలు
అనృత నిందా ప్రలాపాలు
ఎదలోన కదలాడు
కోరికల కెరటాలు
కోపాలూ తాపాలూ!
వినిపించని సవ్వడులు
వెలితి బ్రతుకు మూగ నుడులు!

ఆమనిలో విరిసిన పూలు
ఆమడల దూరాలకు పంపించే
ఆమోద సుశాలు
ఆమెతల పాతాలు!

పరిసరపు ఉకులలో
తెరువు గానని పేద
గొంతుకలోట్లాడే
చింతలోని వతలో
వినబడు గుకరుణ నిండు
వీనులకున్ పగుల రొద!

ఝంఝానిలవేగంలో
అంభోనిధి కుల్లో
భీకర జలపాంలో
భీషణ నిర్ఘాతలో
ఆలించుట కదని ధ్వని
ఆకలి తీరని బతుకుల
నీరవ హాహాకారముల్!

మూగ బ్రతు బరువు బాస
మున్నీరై వంచెత్తును భువి!

# శకుంతల

## శ్రీమతి రెంటాల సావిత్రి

ఎవ్వరది? ఎవ్వరది??
తిలకించిన కనుగిన్నెల
ఒలికించును సిరివెన్నెల
ఆలించిన శ్రుతి పుటముల
కీలించును 'పద' రవళుల
కుప్పలు వోసిన సౌందర్యమ్మా! - లేకున్న రూపు
గొని విలసిల్లిన మాధుర్యమ్మా!!
ఎవ్వరది? ఎవ్వరది??
నడకలు గని 'రాజహంస'
తడబడి కేలకులకు చేర
పలుకులు విని 'ద్విజ సమూహ'
ములకున్ సాత్వికత మీర
వచ్చిన దొరక రాజన్య తనూభవా? లేక రేక
విచ్చిన బ్రాహ్మణ్య సుమ మధూలకా?
ఎవ్వరది? ఎవ్వరది??
హస్తాంచల ఘటిత ఘట
ప్రస్తామల జలధారా
న్యస్త స్నేహార్ద్ర హృదయ
గురు దేవార్చన క్రియా
వర లక్షిత పుష్పనిచయ
ఓహో తెలిసినది ఈమె
మహర్షి ఆ కణ్వబాల
కాళిదాస రస కవితా
కాశపు చంద్రమశ్శకల
భావి 'భరత' భాగ్యమ్ముల
తళతళల తనలోపల
దాచుకొన్న కన్నెతల్లి.

కీ.శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ

యశోమూర్తి

# చిలుకూరి వీరభద్రరావుగారు

**ఆంధ్రజాతి వికాసానికి ఆయన పడిన ఆవేదనా, అందుకోసం ఆయన ఉద్యమించిన ఉద్యమాలూ.**

వీరభద్రరావుగారు నేటివారు కారు; వీరేశలింగ ప్రభృతులతో కలసి పనిచేసినవారు. కడువృద్ధులయినారు. వృద్ధులయ్యునుకూడా దార్ఢ్యముగా ఉన్నవారు లేకపోలేదు. కాని చిన్ననాటినుంచీ అనుభవించిన కష్టాల కాపుకు ఈపాటి వృద్ధత్వముకూడా అతి ముదిరి, పండబారి ఈ పరిణతి తెచ్చిపెట్టినది.

వీరభద్రరావుగారిది ఎప్పుడూ నెమ్మదియెరుగని ఝుంఝూమారుత ప్రకృతి, కుదిరిక, స్తిమితము అన్నవి ఆయన యెరుగరు. ఏదో పనిచేస్తుండాలి; అది కూడా మామూలు ఫక్కీని ఉండకూడదు. అంతా కొత్తతోవే. అహర్నిశాలు అలసట యెరుగని దీక్షతో పాటుపడడమే. ఆయన జీవితమంతా ఎప్పుడూ రాత్రీ పగలూ నిరంతరమూ గర్జిస్తూ, బోర్లపడుతూ, లేస్తూ, మళ్లుతూ, సుళ్లు తిరుగుతూ ఉండే మహాసముద్రపు కెరటంలా గడచిపోయింది.



కీ॥శే॥ చిలుకూరి వీరభద్రరావు

మొట్టమొదట కాలిమీద కాలు వేసుకు కూర్చుంటే, ఇంటి నీడ పట్టున, కడుపులో చల్ల కదలకుండా జీవితం గడచిపోవడాని కనుకూలమైన స్థితి. తండ్రిగారు సంపాదనపరులు. మంచి ఆస్తి. బాల్యమంతా తణుకులో గడచిపోయింది. విద్యార్థిదశ ముగియవచ్చేసరికి శ్రీ వీరేశలింగముపంతులుగారి యుపన్యాస ప్రబోధములతో, పత్రికా ప్రచారముతో దేశంలో నూతన చైతన్యమందుకొని ఆంధ్రజాతీ కన్ను విప్పినది; ఆయనా కన్ను తెరచినారు. కొత్తయుగమే ఆరంభమైనది. యుగశక్తి మహోత్తుంగ తరంగంలా దేశమంతటా అలముకొన్నది నూతనయుగ ఆదర్శాలు, లక్ష్యాలు ఆయనలో అంతర్నిహితములై ఉన్న అగ్నికణాలను రగులజేశాయి.

ఈ కాలంలోనే తండ్రి గతించారు. దేశోపకారి పత్రిక పెట్టారు. రాజమహేంద్రవరం కాపురమయింది. వీరేశలింగంపంతులుగారి సంస్కరణోద్యమంలో ఆయనకు చేదోడు వాదోడయి నీడలా మెలిగారు. ఆ రోజుల్లో ఆయన నడిపిన పత్రికాయుద్ధాలు అనేకాలు. వీరేశలింగంపంతులుగారి ప్రత్యర్థులు చేసిన వాదాలలో ఒకవేళ ఎక్కడయినా సహేతుకత ఉన్నా దానిని పంతులుగారిమీది విశ్వాస బలం కనిపింపజేసేదికాదు. ఆ విధంగా గడచింది శ్రీ వీరభద్రరావు పంతులుగారి జీవితంలోని ప్రథమాధ్యాయం. అటు తరువాత ఆయన పెద్దకూతురు వితంతువగుట తటస్థించినప్పుడు తిరిగి వితంతు వివాహం చేయుటా, మానుటా అని వచ్చింది పెద్ద సంఘర్షణ. జీవితప్రవాహంలో పడ్డారు. సాధక బాధకాలాలోచించుకోవలసి వచ్చింది. పరిస్థితులు విషమంగా ఉన్నాయి. అందువల్ల అంతవరకు సంఘసంస్కార ప్రచారం చేస్తూవచ్చిన వీరభద్రరావుగారికి పెద్దకూతురికి మరల వివాహం చేయడానికి సాహసం లేకపోయింది తన హృదయదౌర్బల్యాన్ని ఆయన గుర్తించారు. అంతవరకు పత్రికలలో జరుపుతూవచ్చిన యుద్ధాలవల్ల తనకు వ్రాతలో కొంత శక్తీ, నిపుణతా కలదనే సంగతిని ఆయన గమనించారు. పత్రికా సంపాదకత్వానికి, గ్రంథరచనకు పూనుకోవాలనుకొన్నారు.

సరిగా ఈ సమయంలోనే వచ్చింది వందేమాతరం ఉద్యమం. ఆయన తన కడిపరకు సంఘసంస్కార ప్రచారములో గల శక్తి నంతా రాజకీయ ప్రచారానికి వినియోగించారు. 'ఆంధ్రకేసరి'కి సంపాదకులైనారు. దేశాభిమానము, భారతజాతీయాభిమానము ఉద్దీప్తమయిన రోజులవి. కలకత్తా డాన్ మేగజీన్‌లో మన భారతీయుల ప్రతిభ, ప్రాచీనౌన్నత్యము మొదలైనవాటిని గురించి తవ్వి యెత్తుతున్నారు. పండితులు పరిశోధనలుచేసి 'భారతీయులు పనికిమాలినవారు కారు. చేతకానివారు కారు. వారికి సంస్కృతిపాత్రమయిన నాగరికత ఉంది; వారికి మహాసంస్కృతి ఉంది' అని పరిశోధన పండితులు వ్యాసరూపకంగా డాన్, మోడరన్ రివ్యూ మొదలైన పత్రికలలో ప్రకటిస్తున్నారు. మన తెలుగుదేశంలో కూడా శ్రీ వీరేశలింగంపంతులు గారు కూడా ఆంధ్రకేసరి అచ్చయే శ్రీ చింతామణీ ముద్రాక్షరశాల లోనే ప్రాచీనాంధ్రకవి విరచితములైన ప్రబంధాలను అచ్చువేస్తూ ఆంధ్రకవుల చరిత్ర బొద్దికూరపాటివారు, గురజాడవారు రచించిన ఫక్కిని రచించడం మొదలుపెట్టారు. అవుసి అందుకొని శ్రీ వీరభద్రరావుగారు ప్రాచీనాంధ్ర దేశచరిత్రలోని కొన్ని కొన్ని విషయాలను కృషిచేసి ఆంధ్రకేసరిలో ప్రకటిస్తూ వచ్చారు దేశాభిమానం, ఆంధ్రాభిమానం హెచ్చింది. 'ఆంధ్రులు చాలా గొప్పవారు. ఆంధ్రులకు గొప్ప చారిత్రమున్నది. దానినెట్లయినా బయటపడవేయా'లని దీక్ష పట్టారు. ఆంధ్రకేసరి సంపాదకత్వం వహించి ఉన్నప్పుడే మాయెల్‌గారు వ్రాసిన 'విస్మృత సామ్రాజ్యము' అనేదానిననుసరించి 'జీర్ణకర్ణాట సామ్రాజ్యము' వ్రాసినారు. అంతకంటె ఎక్కువ పని చేదామని ఉబలాట మున్నప్పటికీ ధనమేమీ లేదు. ఉన్నదంతా ఈ చిన్నతనపు ఉత్సాహదశలోనే అంతరించిపోయినది. అయితే, ఆంధ్ర చరిత్ర రచిద్దామనే దీక్ష, ఆకాంక్ష గాఢంగా ఉండడంవల్ల తద్రచనకు తగిన సాధన సామగ్రి లభ్యమయ్యే చెన్నపట్టణానికి ఎట్లాగో చేరుకొన్నారు. కృషి సాగించారు. అంతటితో ఆయన జీవితంలో మరో అధ్యాయం ముగిసింది.

చెన్నపట్టణం వచ్చిన పిదప వారికి శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు గారితో పరిచయం గలిగింది. శ్రీ లక్ష్మణరావుగారి సహకార ప్రోత్సాహం ఫలితంగానే ఆంధ్రుల చరిత్ర మొదటి రెండు భాగములు విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో ప్రకటితమయినవి. వీరభద్రరావుగారు చెన్నపట్టణంలో ఉండి పనిచేసిన కాలమే వారి జీవితంలో చాలా గొప్పది. ఆంధ్రుల చరిత్ర దేశానికి మహోపకారం చేసింది. 'ఆంధ్రులకు గర్వించదగ్గ ఒక చరిత్ర ఉంది, వారికి ఒక సంస్కృతి ఉందని మొట్టమొదట తెలిపింది శ్రీ వీరభద్రరావుగారే. వారు ప్రకటించిన చరిత్రకు ఫలితంగా ఆంధ్రులకు ఆత్మవిశ్వాసమూ, ఆత్మవికాసమూ కలిగి ఆంధ్రజాతీయాభిమానం ప్రబలింది. ఆంధ్రోద్యమానికి ఈ చరిత్రమూలంగా కారకులయినవారిలో వీరభద్రరావు గారొకరంటే అది సత్యదూరం కాదు. అసలు ఆంధ్రజాతి కళ్ళు తెరచినది వారన్నా బాధలేదు.

తరువాత వీరభద్రరావుగారు మద్రాసు కాపరం ఎత్తికట్టారు. కొవ్వూరులో తమ రెండవ కూతురి భర్తగారు శ్రీ మామిడన్న వెంకట సుబ్బారావుగారి ఇంటనే ఉంటూ వచ్చారు. మద్రాసును విడచిన పిదప కూడా అనేక గ్రంథాలు రచించారు. అన్ని ఆంధ్రచరిత్రకు సంబంధించినవే; ఆంధ్రాభిమానాన్ని ప్రోదిచేసేవే. తిమ్మరుసు, తిక్కన, రామరాయలు, శ్రీనాథుడు, ఆంధ్రుల చరిత్ర (మూడవ భాగము) - చాలా ఉన్నవి ఆయన వ్రాసినవి. శివాజీచరిత్రము ఆయన వందేమాతరం రోజులలో వ్రాసినది. శ్రీ వీరభద్రరావుగారు ఒక్క చరిత్రకారులే కాదు, నవలాకారులు కూడాను కర్ణసామ్రాజ్యమన్నది ఒక నవల. శాతవాహనులనబడు ఆంధ్రరాజులు రాజ్యం చేసిననాటి గాథ అది. పల్నాటి వీరచరిత్ర గాథను నవలారూపమున 'నాయకురా'లను పేర ప్రకటించినారు. చిన్నతనంలో ఆయన పద్యాలు కూడా వ్రాసేవారు. కాని సంస్కారోద్యమాభిలాష, చారిత్రకకృషి ఎక్కువయినకొద్దీ కవితాధార శుష్కించిపోయింది. ఆయన చిన్ననాడు వ్రాసిన పద్యాలకు మచ్చు కావాలంటే జీర్ణకర్ణాట సామ్రాజ్యం అవతారిక పద్యాలు చూడవచ్చు.

మొత్తంమీద ఆయనది స్తిమిత ప్రకృతి కాదు. అతి చురుకయినది రచనలో కూడ చురుకుపాలు హెచ్చే; ఆయనవద్ద అభావోద్వేగము ఎంత హెచ్చో కార్యాభినిరతి అంత హెచ్చే. విపరీతమయిన పట్టుదల. వ్రాయనారంభించారంటే ఉపవాసాలు చేసి కూడా వ్రాసేవారు. ఎప్పుడూ ఆయన బుద్ధి ఆలోచించకుండాను, ఆయన మెదడు పనిచేయకుండాను ఉండేదికాదు. అరముగ్గినపండులా ఉన్న దశలో కూడా కాకతీయసామ్రాజ్యాన్ని పునః సవరించి పెంచి ప్రకటించారు.

ఆయన తత్వంలోనే సూరేకారపుపాలు సహజసిద్ధంగా ఎక్కువగా ఉండడంవల్ల ఆయన జీవితం మొదటినుంచి వాదాలతో, ప్రతివాదాలతో నడచింది. అన్ని వాదాలూ, ప్రతివాదాలూ గ్రంథాలలోనే. అనేక మహాసమరాలలో పాల్గొన్న మహాయోధుడాయన. ఏమాత్రము మొగమాటము లేకుండా విమర్శించేవాడు; చీల్చిచెండాడేవాడు. ఆయన శైలికికూడా మహావాడి ఉన్నది. అంతేకాదు, దానికి తూగూ ఉన్నది. ఆయన ఉద్ధతరచనలను చదువుతూంటే కొండప్రదేశాలలో ప్రవహించే వర్షాకాలంనాటి పెద్దవాగు స్ఫురణకు వస్తుంది.

వీరభద్రరావు ఆంధ్రజాతీయ నిర్మాతలలో ఒక్కరనడానికి సందేహం ఏమీలేదు ఆయన దేశానికి చేసిన సేవకు ఆంధ్రమహాసభ ఆయనకు 'చరిత్రచతురానన' ఇచ్చి గౌరవించింది. కాని మొట్టమొదట

ఆయన నాయకత్వంక్రింద ఆవిర్భవించి పెరిగిన ఆంధ్రదేశీయేతిహాస మండలి (రాజమహేంద్రవరము) మాత్రం రచియించి యిచ్చి, అనర్ఘ సేవచేసిన ఆ మహామహుని గౌరవించలేకపోయింది. ఆయన సేవను కొనియాడలేకపోయింది. తెనుగుదేశంలో ఎవరు గౌరవించినా ఎవరు గౌరవింపకపోయినా శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు చేసిన చారిత్రకసేవకు ఏ విధమయిన లోపమూ రాలేదు. ఆంధ్రదేశచారిత్రకసౌధం క్రమంగా పెరిగి పెంపొందుతూ ఉంటే దానికి మూలకారణం శ్రీ వీరభద్రరావుగారనీ, శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారనీ దేశమూ, జాతీ మరచిపోలేదు – ఒకవేళ కొందరు వ్యక్తులెవరయినా మరచిపోవడం తటస్థించినప్పటికీని.

వీరభద్రరావుగారిలో లోపాలు లేకపోలేదు; ఆ మాటకువస్తే పుట్టి పెరిగినవారిలో లోపాలు లేనివారంటూ నాకింతవరకు కన బడరు. ఒకవేళ కొందరిలో అవి చిన్నవిగా ఉండవచ్చు; మరి కొందరిలో గొప్పగా ఉండవచ్చు. అయినప్పటికీ చేసిన సేవనే గణించి, వారిలో ఉండే గొప్ప గుణాలను, గొప్ప, భావాలను, గొప్ప లక్ష్యాలను గ్రహించగలగడంలోనే మన గొప్పదనం ఉన్నది. వీరభద్రరావుగారిలో ఎన్ని లోపాలున్నప్పటికీ ఆయన మహాపురుష డనీ, మహా దేశాభిమాని అనీ, మహాగ్రంథరచయిత అనీ అంగీకరింపక తీరదు.

ఆ మహామహుడు పోయినాడన్న వార్త వినేటప్పటికి నాకు దుఃఖము పొర్లివచ్చినది. మొట్టమొదటిమారు నేను ఆయన దర్శనము చేసినది 1912 లో. చూచిననాటినుంచి నేనంటే ఆయనకు అవ్యాజాను రాగం కలిగినది. నన్ను ఈ చరిత్రరంగానికి ఆకట్టియుంచినది మొదట శ్రీ వీరభద్రరావుగారు. పిదప శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు గారున్ను, క్రమక్రమంగా మా యిరువురికి అనుబంధ మెక్కుడయి నది. ఆయన నన్ను కొడుకులా ప్రేమించాడు; మిత్రుడిలా ఆద రించాడు; హితునిలా ఉపదేశించాడు. నేడు నాకు చరిత్రలో ఓనమా లేవైనా వచ్చునంటే ఇదంతా శ్రీ వీరభద్రరావుగారి, శ్రీ లక్ష్మణ రావుగారి చలవ. అటువంటి శ్రీ వీరభద్రరావుగారు నేడు లేరంటే, కడుపు తరుక్కొనిపోతున్నది. అయినప్పటికీ నేను విచారింపబనిలేదు. మృతజీవి; యశోధనుడు.

(24-5-1939 ఆంధ్రపత్రికనుంచి పునర్ముద్రితం)

---

# అతడే.. అతడే.. అతడే...!

ముద్దబంతి పువ్వులా అల్లారుముద్దయినవాడు
కల్లకపటా లెరుగనివాడు
కలువరేకుల కన్నులవాడు
సన్నజాజి నవ్వులవాడు
దానిమ్మపువ్వు వన్నెలవాడు
గులాబీల ఘుమఘుమలవాడు
మల్లెలా పరిశుద్ధమయినవాడు
దిరిసెన పువ్వులా పేశలమయిన హృదయం గలవాడు
గన్నేరురెక్కల్లా స్నిగ్ధమయిన సాధుస్వభావం గలవాడు
తెల్లుపువ్వుల డాలుని మించిన కీర్తి గలవాడు
పూచిన లేతమామిడి కొమ్మలా నడచివచ్చువాడు.
వాడి వత్తలయిన "నిన్నలను"
మొగ్గా పిందెలయిన "నేడులను"
చక్కగా చిగురింపజేయువాడు
మొగలి పువ్వుల వాసనల్లా
గొనబయిన ఆశల్ని రేకెత్తిస్తూ
మత్తు గొలుపువాడు
తంగేటి జున్నుల్లాంటి
మందార మకరంద మాధుర్యాల్లాంటి
మధుర లాలసల్ని రుచి చూపువాడు
జగతిపై
మోదుగ పువ్వుల శోభల్లా
అభినవమయిన వెలుగుల్ని చిలకరింపజేయువాడు
పేదలకు శ్రమజీవులకు
గటిక పువ్వుల్లా ప్రియమైనవాడు
పూలరంగడిలా సకలజనులకూ
ప్రీతి కలిగించువాడు
అతడే అతడే అతడే "రేపు"!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

---

# ఆధునికత - అనంతవిచారణలో*

లెస్‌జెక్ కొలకోవ్‌స్కీ పోలాండు దేశీయుడు. 1968 లో పోలాండునుండి దేశబహిష్కృతుడయ్యేవరకు వార్సా విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర చరిత్రాచార్యుడు తర్వాత ఏల్, మక్‌గిల్, కాలిఫోర్నియా (బెర్కిలీ), చికాగో విశ్వవిద్యాలయాలలో అభ్యాగతాచార్యుడు. ఆక్సుఫర్డు “ఆల్ సోల్సు” కళాశాలలో సీనియరు ఫెలో. ప్రస్తుతవ్యాసం కొలకోవ్‌స్కీ 1981 లో ఇచ్చిన ఒక ఉపన్యాసాధారంగా ఈయనే సుప్రసిద్ధ ఇంగ్లీషు మాసపత్రిక “ఎన్‌కౌంటర్”లో ప్రకటించినాడు. కొలకోవ్‌స్కీ పూర్వపు కమ్యూనిస్టు. మార్క్సిజం చరిత్ర వ్రాసినాడు. కమ్యూనిస్టు దేశమైన పోలాండునుండి వెడలగొట్టబడడమూ, అమెరికా బ్రిటన్‌దేశాలలో ఆచార్యపదవులు పొందడమూ, “ఎన్‌కౌంటర్”లాంటి పత్రికల్లో వ్రాయడమూ వంటి సంఘటనలవల్ల కొలకోవ్‌స్కీ ప్రస్తుత మనోధర్మం స్పష్టం కాగలదు. ఫ్రాన్సులోని మాల్‌రాక్స్, సార్త్రి, యుగోస్లావియాలోని మిలోవన్ డిజిలాస్, హంగరీకి చెందిన ఆర్థర్ కెస్లర్, ఇంగ్లండులోని స్టీఫెన్ స్పెండర్‌ల వలె అధికారిక కమ్యూనిజం వ్యతిరేకి. సోవియట్ రష్యానుండి వెడలిపోయిన పాస్టర్‌నాక్, సోల్జెనిత్ సిన్, అమాల్రిక్ లవలెకొలకోవ్‌స్కీ కూడ స్వదేశం వీడినాడు. దాదాపు 35 సంవత్సరాల్కితం ఆర్గురు పూర్వకమ్యూనిస్టులు “వరమీయని వేలుపు” అనే సంకలన వ్యాస సంపుటిని ప్రచురించినారు. ఇది ఆనాడు అంతర్జాతీయంగా గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఇందులో వారు స్టాలిన్‌బ్రాండు కమ్యూనిజం మీద నిరాశ వెలిబుచ్చి, దాని నభిశంసించినారు. మన దేశంలో కూడ నాటి యం. ఎన్. రాయి, నేటి యం. ఆర్. మసానీలు ఈ కోవకు చెందుతారు. ఇట్టివారిలో-మన కొలకోవ్‌స్కీ అట్టివాడు—వెనుకచూపు మొదలవుతుంది. కమ్యూనిజం ఎడల వీరికి ప్రేమ-ద్వేష భావాలూగిసలాడుతుంటాయి. కొలకోవ్‌స్కీ చెప్పేది ప్రతిదానినీ మనం ఒప్పుకొన అవసరంలేదు. కానీ ఈయన చెప్పేది శ్రద్ధగా ఆలోచించదగింది. ఆధునికత, అభివృద్ధి అనే ఝుంఝూమారుతంలో ధ్యేయరహిత విహాయస వీధుల్లో ఎగిరిపోతున్న పాశ్చాత్యుల సంకటాలు, సమస్యలు సంప్రదాయకతా నిర్వాతకూపంలో కూరుకొని వున్న మనకు చప్పున అర్థంకావు. అర్థమయ్యేటట్టు కోలకోవ్‌స్కీ వ్రాసినాడు. అందుకే ఈయన మూల ఇంగ్లీషు వ్యాసాన్ని తెలుగులోనికి వాక్యం వాక్యం అనువదించినాను. ప్రతీ అర్థచ్ఛాయ వచ్చేటట్లు ప్రయత్నించినాను. అక్కడక్కడ కొంత వింతగా కనపడినా, మూలంలోని పాశ్చాత్య వాతావరణం, రుచి, వాసన వచ్చేటట్లు వ్రాసినాను. నాకు వచ్చీరాని ఇంగ్లీషు జ్ఞానంతో, కొలకోవస్కీ తనకు వచ్చీరాని తెలుగులో వ్రాసినట్లుంటుందీ వ్యాసం. వ్యాసంలోని ఉత్తమపురుషం (“నేను”) కొలకోవ్‌స్కీయే కాని నేను కాను. ఆయన వ్యాసంలో మనకు తెలియని చాలా పదాలు, ఆకరాలు విషయాలుంటాయి. అవి ప్రత్యేకంగా వివరిస్తే కాని ఆయన ఏమి చెబుతున్నాడో తెలియకపోవచ్చును. అందుకే వ్యాసాంతాన “అర్థ వివరణలు” అని పెద్ద పట్టికనే ఇచ్చినాను. వ్యాసంలో వీటికి సంఖ్యలు వేసినాను. అర్థవివరణలు మాత్రమేనావి. వ్యాసం కొలకోవ్‌స్కీదే. ఇక చదవండి...

తి.

1. హెగెల్[1]నుకాని, కోలింగ్‌వుడ్[2]నుకాని నమ్మవలసి వస్తే, యే యుగం, యే నాగరికత తనను తాను గుర్తించుకోజాలదు. అవి అంతరించిన తర్వాతనే వానిని గుర్తుపట్టవచ్చును. అప్పుడయినా ఆ గుర్తింపు సరిగా లేకపోవచ్చు, అందరు ఒప్పుకోకపోవచ్చు. నాగరికతల స్వరూపం, అంగాంగ వివరణ రెండూ విపరీతంగా వివాదాస్పదాలు: ఇవి ఆదర్శతా పక్షపాతభారాన్ని మోస్తుంటాయి. గతంతో పోల్చినప్పుడు ఆత్మోత్కర్షనైనా కలిగిస్తాయి. సంస్కృతీ వాతావరణంలోని కాలుష్య ఫలితంగా ప్రాత, మంచిదినాలకై తపననైనా కలిగిస్తాయి. ప్రతి చారిత్రకయుగం, అది స్పష్టంగా అభివ్యక్తం చేయలేని మౌలిక (“పరమ”) పూర్వభావనలనెన్నో కల్గివుంటుందని కోలింగ్‌వుడ్ ఇట్లా సూచిస్తాడు. ఆ యుగ మూల్యాలకు ప్రయోజనాలకూ, సహజ ప్రతిక్రియలకూ, ఆదర్శాలకూ, ఇవి (పూర్వభావనలు) అగోచరోత్తేజాన్ని కలుగచేస్తాయి. అట్లైఅయితే, పురాతన, మధ్యయుగ పూర్వికుల జీవితాలలోని పూర్వభావనలను గుర్తించి వాని ఆధారంగా “భావచరిత్ర” కు మారుగ “స్వభావచరిత్ర” నిర్మించవచ్చును. మనకుండే మినెర్వా ఇచ్చిన కొంచెపు మతీ వుడాయించి వుంటే తప్ప[3] - వీనిని మన తరంలోనే బహిర్గతం చేసేందుకు సూత్రరీత్యా మనం అడ్డగించబడినాము. మనం ఒకానొక సంధ్యలో బ్రతుకుతున్నామా? ఒక యుగాంతంలో వున్నామా అనిపిస్తుంది.

---

* “మాడర్నిటీ ఆన్ ఎన్‌డ్‌లెస్ ట్రయల్”
ఇంగ్లీషుమూలం : లెస్‌జెక్ కొలకోవ్‌స్కీ

2. మన ఆధ్యాత్మిక తాబునాదులు మనకే ఏమీ తెలియవని ఒప్పుకొందాము. "ఆధునికతా" (ఆశబ్దార్థం ఏదైనా కానివ్వండి) స్థూల సమీక్ష చేతనే తృప్తిపడదాము. ఆధునికత[4] లో, ఆధునికతపైని దాడులవలెనే, ఆధునికత చాలా తక్కువ.

నిస్పృహతోకూడిన "అయ్యో ఏమి రోజులివి"...
"ఇప్పుడటువంటిదేమీ... " "ఆకాలంలో...."

వంటి గొణుగులతో నేటి హైన్యతను ప్రాచీనౌన్నత్యంతో పోల్చడం మానవజాతియంత ప్రాతదే బైబిలు[5] లోనూ ఒడిస్సే[6] లోనూ, ఈ ధోరణులు చూడగలము. ప్రాతరాతియుగపు సంచారజాతులు, స్థిర నివాసాలేర్పరచుకోవలెననే తెలివితక్కువ ఆలోచనను తీవ్రంగా వ్యతిరేకించి వుండడాన్ని, పాపిష్టిచక్రం[7] ను కనుగొన్నందువల్ల మానవాళికి శ్రీఘ్రనాశం వస్తుందని హెచ్చరించి వుండడాన్ని నేను బాగా వూహించుకోగలను. మానవచరిత్ర అంటే క్షీణత అనే నిశ్చయం ప్రాచీన గాథలలోని ఇతివృత్తాలలో వస్తుంటుందని అందరికీ తెలుసును బహిష్కారం[8] అనే ప్రతీక, హీసియోదు వర్ణించిన "పంచయుగాలు"[9] వీటిలో చేర్చుకోవచ్చును. ఈ పురాణ గాథలకు సాంఘిక, వైజ్ఞానిక విధులున్నా, అవి మార్పుమీద మానవ సహజ సంప్రదాయకమైన అవిశ్వాసాన్ని చాటుతాయి. రెండవ సారియోచిస్తే, "అభివృద్ధి" నిజానికభివృద్ధి కాదనేదా అవిశ్వాసం. బాగా స్థాపించుకపోయిన వ్యవస్థాగత మార్పులను, అవి ఎంత మంచివైనా జీర్ణించుకొనేందుకు విముఖత అది.

3. అయినా, మార్పు తప్పదు. దీనిని బలపరచే ఉత్సాహవంతులూ వుంటారు...."ప్రాచీనత"కు ఆధునికత"కు గల సంఘర్షణ యెడతెగనిది.[10] దీనిని వదల్చుకోలేము. ఇది స్థితి-గతులమధ్య సహజ సంఘర్షణ. ఇటువంటి సంఘర్షణ జీవమూలకం. మనం నమ్మగలిగితే, జీవిత లక్షణంకూడ ప్రతి సంఘానికి యథాతథ పరిస్థితి, పరిణామం రెండింటి యవసరం వుంటుంది. ఈ పరస్పర విరుద్ధశక్తుల కొలిచే సాధనాలను రూపొందించే సిద్ధాంతం వుంటుందా అనేది సందేహాస్పదం. ఏ యే అంశాలను కూడవలెనో తీసివేయవలెనో, ఆ ప్రాతిపదికపై భవిష్యత్తును సూచించగల బృహదభివృద్ధి ప్రణాళికను నిర్మించగలుగుటా, మిక్కిలి సందేహాస్పదం. శీఘ్రపరిణామాలను, ఛిన్నాభిన్నం కాకుండా తమలో లీనం చేసుకొనే శక్తి కొన్ని సంఘాలకెట్లబ్బుతుందో కేవలమూహించుకోగలం మాత్రమే. ఇతర సంఘాలు మందగతితోనే ఎందుకు తృప్తిపడతాయి? ఏ యే స్పష్టపరిస్థితులలో అభివృద్ధి గతిరాహిత్యాలు హింసపూరిత వైషమ్యానికీ స్వనాశానికీ దారితీస్తాయి?

4 జీవపరిణామ శాస్త్రం చదివినవారు చెప్పేదిది: భయ ప్రోద్బలం, శారీరికాసంతృప్తుల వల్ల కాక, నిస్స్వార్థంతో ప్రపంచాన్ని పరిశోధించవలెననే ప్రత్యేక ఉత్సాహం మానవజాతి నైజాలలో ప్రవేశ్ళు పాతుకొనిపోయింది. మానవజాతి ఆది ఆదిగానే వుండేవరకు దీనిని మనస్సునుండి తొలగించలేము-పండోరా[11] పాల్పడిన శోచనీయాపఘాతం, స్వర్గం [12]లో మన పితరులు చేసిన సాహసాలు సాక్ష్యమిస్తున్నట్లు, ఉత్సుకతాపరాధమే మానవాళికి వాటిల్లిన విపత్తులకు, దురదృష్టాలకు ప్రధానకారణం. అయినా, సాధించిన పరమార్థాలకూ ఇదే నిస్సందేహంగా మూలం.

5. వివిధ నాగరికతలలో ఈ అన్వేషణోత్సుకత సమపాళంగా వ్యాపించలేదు. తరతరాలుగా పండితులడిగే ప్రశ్నయిది. గ్రీకు, లాటిను, యూదు, క్రైస్తవ మూలాలనుండి వచ్చిన నాగరికత, శాస్త్రం, సాంకేతికవిద్య, కళ, సాంఘిక న్యాయాలను పెంపొందించి, వ్యాపించజేయడంలో ఎందుకంత శీఘ్రంగా సఫలమయింది? ఇతర సంస్కృతులు శతాబ్దాల తరబడి ఎందుకు జడస్థితిలో వున్నాయి? అవి అడపాదడపా సృజనోల్బణాన్ని కనబరచి, తర్వాత ఆలస్య నిద్రలో ఎందుకు మునిగిపోయినాయి?

6. దీనికి సదుత్తరంలేదు. ప్రతి నాగరికత, సాంఘికశాస్త్ర జనసంఖ్యాశాస్త్ర, వాతావరణ, భాషావిషయక మానసిక పరిస్థితుల సమయానుకూలంగా ఏర్పడ్డ ముద్ర. వీటి పుట్టుక, గిట్టుటల అంతిమ కారణం వెదుకుట ఆశాజనకంకాదు. ఉదాహరణకు, వంటకు సీసపు పాత్రలుపయోగించడంచేత ఉన్నత వర్గాల మెదడులు విషపూరితాలై చెడిపోవుటవల్ల రోమక సామ్రాజ్యం పతనమయిందనికాని, క్రైస్తవ మత సంస్కరణోద్య[13] మానికి కారణం యూరపులో ఉపదంశ[14] రోగవ్యాప్తి అని కాని చెప్పే వివరణాలు చదివితే వాటిపట్ల గట్టి అపనమ్మకం కలుగకమానదు. "కారణాల"కోసం చూచే లోలుపతనుండి తప్పించుకోవడం కష్టమే. ఒకదానితో ఇంకొకదానికి సంబంధంలేని అనేకాంశాల ప్రభావంవల్ల లేస్తాయి, కూలుతాయి. నవ్యజంతు వృక్షజాత్యుద్భవం గురించీ మహానగరాల స్థాపనగురించీ, భూమిమీది పర్వతాల వ్యాప్తిగురించీ, ఒక నిర్దిష్టజనజాతి భాషానిర్మాణం గురించీ, ఇదే చెప్పవలసివస్తుంది. మన నాగరికతను గుర్తించడమంటే మనలను మనమే గుర్తించడం. సాటిలేని సమష్టి "అహం"ను గ్రహించుటకు ప్రయత్నిస్తున్నాము ఇదికావలసిందే, ఇదిలేకుంటేనేనులేను అనుకొనుట. అందుకే "మన సంస్కృతి ఇట్లెందుకుంది?" అనే ప్రశ్నకుత్తరం లేకున్నా, ఈ ప్రశ్న మన మనస్సులనుండి తొలగుట సాధ్యంకాదు.

7. "ఆధునికత" మాత్రమాధునికంకాదు. ఆధునికతను గూర్చిన వాదోపవాదాలు కొన్ని నాగరికతలలో ఎక్కువగాను, కొన్నిట తక్కువగాను వున్నాయి. కాని ఎప్పుడుకూడా మనకాలంలో కంటే తీవ్రంగా ఉండలేదు.

8. గ్రీకులు సహజంగా నవ్యతాప్రియులు అనీ బార్బేరియను[15]ల వలె కాక వారు ఆ పదాయాన్ని తిరస్కరిస్తారనీ, అయాంబ్లికోస్[16] 4వ శతాబ్దారంభంలో అన్నాడు. ఆ కారణంచేత ఆయన గ్రీకులను పొగడలేదు. దానికి వ్యతిరేకమేచేసినాడు. మనమీ గ్రీకు ప్రవృత్తికింకా వారసులమా? మన నాగరికత కొత్త, మంచిది (అంతలేసి మాటలలో చెప్పకపోయినా) అనే విశ్వాసంమీద ఆధారపడివుందా? మన "పరమపూర్వభావన"లలో ఇదొకటా? దీనిని "అభివృద్ధి నిరోధక" అనే విశేషణంతో ముడివెట్టి వెలకట్టవచ్చును. ఈ పదం స్పష్టంగా నీచార్థకం. ఎవరు తమనావిధంగా వర్ణించుకోవడానికిష్టపడరు. అభివృద్ధి నిరోధకంగా ఉండడమంటే, వర్తమానంకంటే గతమే మేలని నమ్మడమే. అభివృద్ధి నిరోధకునిగా ఉండేది చెప్పకనే తప్పయితే, గతం మంచిదిగా ఉండివుండవచ్చుననే విశ్వాసం ఎప్పుడూ తప్పుకావలసివస్తుంది. అంటే ఏది ఎక్కువగా కొత్తయో, అదే ఎక్కువగా మేలని చెప్పినట్లయింది. కానీ మన "అభివృద్ధిత్వాన్ని" అంతధైర్యంగా చెప్పము.

9. ఇదే అస్పష్టత "ఆధునిక" అనేమాటనూ, వెన్నాడుతూ వుంది దీనికి జర్మన్ భాషలో "ఆధునిక," కాలీన "అభిమానితరీతి[17] అనే పర్యాయపదాలున్నాయి. ఇంగ్లీషు, ఇతర యూరోపియన్ భాషలలో ఈ రెండర్థాలు వేర్వేరుగా ఉంటాయి. జర్మన్ భాషే సరిగా గ్రహించివుండవచ్చు, ఈ రెండు విశేషణాలను వుపయోగించే రంగాలలో అర్థభిన్నతను ఎట్లు నిర్వచించేది? కొన్ని సందర్భాలలో ఆ మాటలు అదలాబదలాకావు. "ఆధునిక సాంకేతిత పరిజ్ఞానం," "ఆధునికశాస్త్రం", "ఆధునిక పారిశ్రామిక యాజమాన్యం వంటి సమాసాలలో "కాలీనాభిమానితరీతి" అనేపదం సరిపోదు. ఐనప్పటికీ, ఆధునిక భావాలు", కాలీనాభిమానితభావాలు" "ఆధునిక చిత్రకళ" "కాలీనాభిమానిత చిత్రకళ", "ఆధునిక వస్త్రాలు," "కాలీనాభిమానిత వస్త్రాలు" మధ్యకలభేదం చెప్పడం కష్టం

10. "ఆధునికతా" భావం "కాలీనాభిమానితరీతి" వలెకాక' మూల్యతావిముక్తం. తటస్థం. మనకాలంలో జరుగుతూవుండేదీ, ఉండిపోయిందీ "ఆధునికం." ఈ పదాన్ని వ్యంగ్యంగా (చాప్లిన్ సినిమా "ఆధునికకాలం"లోవలె) వాడడమూ విరివిగాఉంది, ఇంకొకపట్టున ఆధునికశాస్త్రం, "ఆధునిక సాంకేతికశాస్త్రంవంటి ప్రయోగాలు "ఆధునికత" మంచిదే అని గట్టిగా సూచిస్తాయి. అర్థంలోని సందిగ్ధత, మార్పుగురించిన మన సందిగ్ధతనే ప్రతిబింబిస్తుంది. ఇది హర్షణీయం, భయావహం, ఆపేక్షణీయం శాపార్హం. గృహోపకరణాల అమ్మకాన్ని పెంపొందించడంలో నిపుణులైన ప్రకటనకర్తలు "చక్కని పురాతన కాలీనాభిమానితరీతి కర్రసామాను" అనో "అవ్వగారి పద్ధతిలో సాంబారు" అనో వాడుతూనే "సరికొత్తసబ్బు," వస్త్రశుద్ధి చూర్ణపరిశ్రమలో ఉత్తేజకరనవ్యత" అనే పదాలూ ఉపయోగిస్తారు. రెండు ప్రచార కిటుకులూ పనిచేసేటట్లున్నాయి. ప్రకటనా సాంఘికశాస్త్రం ఈ పరస్పర విరుద్ధ నినాదాలూ, విజ్ఞప్తులూ ఎట్లు, ఎక్కడ, ఎందుకు సఫలమైనాయి అనే విశ్లేషణ చేసిందోలేదో నాకు తెలియదు.

11 "ఆధునికతా" భావం మనకు స్పష్టంగా తెలియదు కనుకనే "అనంతరాధునికత" (వెనుకటి ప్రయోగాలయిన "అనంతర పారిశ్రామిక సమాజం," "అనంతర మూలధనస్వామ్య విధానం" వంటి వానికనుకరణ) గురించి మాట్లాడడంనుండి తప్పించుకొనేందుకు ఇటీవల ప్రయత్నించినాము. "అనంతరాధునికత" అంటేయేమో, అది పూర్వాధునికతనుండి ఎట్లు వేరో నాకు తెలియదు. తెలుసుకోవాలనిలేదు. "అనంతరాధునికత" తర్వాత యేమిరావచ్చు? అనంతర-అనంతర-ఆధునికత, నవ-అనంతర-ఆధునికత, నవ-విరోధ-ఆధునికత? ఇట్టి గురుపట్టీలు వదలివేస్తే, అసలు ప్రశ్న నిలుస్తుంది ఆధునికతా భద్రతకు పట్టిన జబ్బు అంతగా ఎందుకు పీడిస్తున్నది? ఆధునికతా దుగ్మతను బాధాకరంగా చేసే అంశాలమూలాలేవి?

12. ఆధునికత నెంత వెనుకకు తీసుకపోవచ్చు? ఇది, తత్‌భావాంతర్యంమీద ఆధారపడుతుంది. పెద్ద వ్యాపారం, నియమబద్ధ అర్థికప్రణాళిక, శ్రేయోరాజ్యం, తన్మూలకంగా కలిగిన సాంఘిక సంబంధాల అధికారీకరణే అయితే, ఆధునికతాయుస్సును శతాబ్దాలలో కంటే దశాబ్దాలలో లెక్కించవచ్చును. ఆధునికతకు శాస్త్రంబునాది అని అనుకొంటే, దానిని పదిహేడవ శతాబ్దపూర్వభాగంనుండి పరిగణించవచ్చును. అప్పుడే శాస్త్ర పరిశీలనా ప్రాథమికసూత్రాలు విశదీకరింపబడినాయి. అప్పుడే శాస్త్రజ్ఞులు (గెలీలియో, అతని అనుచరుల పుణ్యమా అని) పదార్థవిజ్ఞానశాస్త్రమంటే అనుభవాల నమోదనికాక, ప్రాయోగిక పరిస్థితులలో ఇముడని అదృశ్య నమూనాల విస్తరణ అనే విషయాన్ని గ్రహించినారు.

13. గతంను లోతుగా శోధించేదానిలో మనకేది అడ్డురాదు. దివ్యజ్ఞానంనుండి వివృతియహేతువును విడిపించిన ఉద్యమం ఆధునిక శాస్త్రకాలకదళ. మధ్యయుగములోని విశ్వవిద్యాలయాలలో[18] కళా విభాగాన్ని మతవిభాగంనుండి వేరుచేయవలెననే పోరాట మీ ఉద్యమంలో ముఖ్యభాగం. ప్రాకృతిక పరిజ్ఞానానికి దైవప్రేరిత జ్ఞానానికీ, పదకొండవ శతాబ్దంనుండి క్రైస్తవతత్వంలో తేల్చినట్లున్న బేధమే ఈ పోరాటానికి భావాత్మకపు బునాది. ఈ రెండు జ్ఞానరంగాల తాత్విక విభజన, నగరమేధావిసర్గం తన స్వతంత్ర ప్రతిపత్తిని కోరుకొనే సాంఘిక పరిణామం, ఈ రెండిటిలో ఏది ముందు వచ్చిందని చెప్పడం కష్టం.

14. అట్లయితే, ఆధునికతను వెనుకకు 11వ శతాబ్దానికి తీసుకవెళ్ళి అన్‌సెల్మ్[19]ను ఇష్టంలేనీ, అబిలార్డ్[20]ను ఇష్టమున్న

అధినాయకులనుగా చేస్తామా? అట్లా వెనుకకు మళ్ళడం ఆలోచనరీత్యా తప్పేమీకాదు. అంత సహాయకారికూడాకాదు. నాగరికతా మూలాలను వెదుకుతూ ఎంత వెనుకకైనాపోవచ్చును. మనమంతా సతమతమవుతుండేది "ఆధునికత యెప్పుడు మొదలయింది" అనికాక మనకాలంలో మిక్కిలిగా వ్యాపించిన "నాగరికతా అసంతృప్తికి" (దీనిని స్పష్టంగా చెప్పకపోయినా) మూలకందమేది? అనేదే. ఎట్టి తరుణంలోనైనాసరే, "ఆధునికత" అనే పదం వుపయోగకరంగా వుండవలెననుకొంటే, మొదటి ప్రశ్నార్థం, రెండవ ప్రశ్నోత్తరంపై నాధారపడవలసి వుంటుంది.

15. సహజంగా మనస్సుకు తట్టే మొదటి ఉత్తరం మాక్సు వీబరు[21] ప్రతిపాదించిన "భ్రమవిముక్తి" అనే ఆలోచనాసరణే లేదా ఇట్టి సంఘటనను సూచించే యే పదమయినాసరే.

16. పాశ్చాత్య నాగరికతను విమతీకరణం చేయుటవల్ల కలిగిన వినాశకరఫలితాలను క్రమేణా మన కన్నుల యెదుటే అంతరించిపోతున్న మతభాగధేయాన్ని, దైవరహితదుఃఖ భాజన ప్రపంచ దృశ్యాన్ని గురించిన చర్చలలో పాల్గొనేటప్పుడు, అనుసరించేటప్పుడు మనం ఆపరాని, అవమానకరమైన మతిభ్రమను తల దిమ్మును అనుభవిస్తాము. వినమ్రులు, అంతగా విద్యావంతులు కాని మతబోధకులు గత మూడు శతాబ్దాలనుండి గమనిస్తూ మనలను హెచ్చరిస్తూ, తమ ఆదివారపు బోధలలో ఖండిస్తూ వచ్చిన విషయాలను హఠాత్తుగ నిద్రనుండిలేచి కనుగొన్నామనిపిస్తుంది. వారు తమ మంద[22]కు చెప్పుతూ వచ్చినారు-ప్రపంచం దేవుని మరచిందని, మంచి చెడ్డల భేదాన్ని మరచిందని, మనిషి బ్రదుకునర్థరహితంగా చేసిందని. తర్వాత అది శూన్యవాదంలో మునిగిపోయిందని. ఇప్పుడు మనం మానవసాంఘిక శాస్త్రీయ, చారిత్రక, మానవ విజ్ఞాన, తాత్విక పరిజ్ఞానాన్ని గర్వంతో కూరుకొని, ఇదే సరళసత్యాన్ని, ఇంకాకొంచెం ఎక్కువ పటాటోప పరిభాషలో చెప్పేందుకు యత్నిస్తున్నాము.

17. ప్రాతది. సరళం అయినంతమాత్రాన ఈ వివేకం సత్యకాకపోదని నేనొప్పుకొంటాను. నిజమే (కొన్ని సవరణలతో) అనికూడా నమ్ముతాను. డెకార్టే[23] ప్రథమప్రధానదోషియా? బహుశా కావచ్చు కేవలం తన సాంస్కృతిక ధోరణులను తాత్వికంగా క్రోడీకరించినాడనుకొన్నా, ద్రవ్యాన్ని విస్తరణతో సమీకరించి, భౌతిక విశ్వంలో పైవిద్యాన్ని బహిష్కరించి, విశ్వాన్ని కొన్ని సరళ, స్పష్టయాంత్రిక సూత్రాలననుసరించునట్లుచేసి, పర్యవసానంగా, దేవుని దాని తార్కికస్రష్టగా. ఆధారునిగా దిగజార్చి, విశ్వభావనను, ప్రకృతిగతచేతనా నియతినీ తీసివేసినాడు.ప్రపంచం ఆత్మహీనమైంది. ఈ పూర్వభావనమీదనే ఆధునికశాస్త్రం వృద్ధిచెందవలసి వచ్చింది. మహిమలుకాని, మాయలుకాని, దేవుళ్ళు. దయ్యాల జోక్యం కాని అనుకోవడానికిక వీలులేదు. ఈ చిన్న కారణంచేతనే, పురాతన క్రైస్తవ వివేకానికి, శాస్త్రీయ విశ్వదృష్టికి మధ్యకల సంఘర్షణాన్ని రాజీపరచేందుకు చేసిన తర్వాతి యత్నాలంత ఆమోదయోగ్యాలు కాలేకపోతున్నవి.

18. ఈ నవ్యవిశ్వపరిణామాలు బయటపడేందుకు కాలం పట్టింది. విస్తారంగా, తానుగా తారసిల్లిన విమత తత్వం ఇటీవలి సంఘటన. విద్యావంతులలో కఠోరంగా వ్యాపిస్తున్న విశ్వాసక్షీణత, సమకాలీన దృష్టికోణంలో చూస్తే, అనివార్యమే అనిపిస్తుంది. తార్కిక సాధనాలద్వారా, హేతువాద ధాటినుండి అస్పష్టంగా రక్షించబడి, మతవిశ్వాసం మూలకునెట్టబడి, నిరపాయిగ, అప్రముఖంగా మనగలిగివుండివుండవచ్చును. తరతరాలుగ చాలామంది విశ్వాసం ఇచ్చే ఉపశమనాన్ని పలుచటి ఆవరణంతో కాపాడుకొంటూ, అభివృద్ధినీ, శాస్త్రసతాన్నీ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్నీ నమ్ముకొంటూ, తాము రెండు పొత్తుకుదురని లోకాల నివాసులమనే విషయాన్ని గ్రహించకుండానే బ్రతుకగలిగిరి. ఆ ఆవరణం తర్వాత భగ్నం కావలసివుండింది. తుదకు గడబిడమని చప్పుడుచేసే తన తత్వమనే సమ్మెటతో నీట్షే[24] ఇది చేసినాడు. అతని విధ్వంసకావేశం మధ్యమ తరగతుల ఆధ్యాత్మికతా భద్రతలో బీభత్సం తెచ్చింది. "దేవుని చావు"కు సాక్ష్యాలుగా వుండటానికిష్టపడని వారి చెడ్డ విశ్వాసాన్ని (ఇది ఆయన దృష్టిలో) నేలమట్టంచేసింది. నిజంగా యేమి జరిగిందో గ్రహించని వారి డొల్లు మనోభద్రతను ఆవేశంతో ఎదిరించి కృతకృత్యుడాయెను. ఈ లోకంలో మంచి, చెడులకు అర్థంలేదు. వ్యత్యాసంలేదు. వాస్తవికత అర్థరహితం, దాని వెనుక దాగిఉండే వాస్తవికత అంటూ వేరేలేదు[25]. మనకు కనపడే ప్రపంచమే అంతిమం. ఇది మనకేమీ సందేశమీయడానికి యత్నించదు. ఇది మరి దేనినీ సూచించదు. ఇది తనకు తానే నవసిపోతున్నది. చెవిటిది, మూగది.

19. ఇదంతా చెప్పవలసివచ్చింది. ఈ నైరాశ్యానికి నీట్షే ఒక పరిష్కారాన్ని, ఒక మందును కనిపెట్టినాడు. అదే ఉన్మాదం. అతని తర్వాత, అతని మార్గాన అంతకంటే ఎక్కువ చెప్పేదేదీలేదు. అధునికతా ప్రవక్త కావటమాయన ప్రారబ్ధం అనిపిస్తుంది.

20. నిజానికి పనికిదొరకొనేందుకాయన మిక్కిలి సంశయాత్ముడు. ఆధునికతవల్ల కలిగే తిరుగులేని మానసిక, నైతిక పరిణామాలను-ఒత్తిడివల్లనే, అయినా-ఒకచేత దృఢీకరించినాడు. ప్రాతపద్ధతులనుండి యేమైనా రాబట్టుకొనేందుకు ఒతుకు బితుకుమని ఆశించేవారిపై ఆయన ధిక్కారాన్ని కురిపించినాడు. ఇంకొకచేత, అభివృద్ధి చేదుఫలసాయమైన బీభత్సపూర్వకాధునికతను అభిశంసించినాడు. తనకు తెలిసింది భయంకరమని ఒప్పుకొన్నాడు. అట్లా చెప్పినాడు.

"క్రైస్తవాబద్ధాల"కు వ్యతిరేకమైన శాస్త్రసంబుద్ధిని మెచ్చుకొన్నాడు. ఆదే సమయంలో ప్రజాస్వామ్యసమతలీకరణ విపత్తునుండి తప్పించుకో గోరినాడు. అనాగరిక మేధుడు అనే ఆదర్శంలో ఆశ్రయంగోరినాడు. అయినా సంశయ నిరాశలచే చీల్చివేయబడకుండా. తన ఆధిక్యంలో దృఢం కావలెనని ఆధునికత కోరుకొంటున్నది.

21. అందుకే నీషే మనకాలపు విస్పష్ట సంప్రదాయంకాలేదు రాజీయే యింకను విస్పష్టసంప్రదాయంగా ఉంటున్నది. ఆధునికత నొప్పుకొంటూనే, అనేక బుద్ధి చమత్కారాలద్వారా దాని పర్యవసానాల నుండి తప్పించుకొంటాము. మానవాళి సంప్రదాయక మతభాగ ధేయాన్నటుంచి, ఆధునికత తెచ్చిపెట్టిన వినాశమున్నా, అర్థాన్ని పునస్థాపితం చేయవచ్చుననీ, రాబట్టుకోవచ్చుననీ మనలనుమనమే ఒప్పించుకొనేందుకిట్లా చేస్తున్నాము. ఈ పనికి కొన్ని విధాల జన రంజక మత సిద్ధాంతాలు దోహదం చేస్తాయి. కొన్ని విధాలయిన మార్క్సిజాలు అట్లే చేసినాయి. ఈ సముదాయించడాలు ఎంతకాలం, ఎంతవరకు విజయవంతాలవుతాయో ఎవరూ ముందుగానే చెప్పలేరు. మత రాహిత్యం వలని ప్రమాదాలగురించిన మానసిక జాగరణ, మానవాళి యిప్పుడెదుర్కొంటున్న సంకట పరిస్థితిని తప్పించే ఆశా జనకమార్గంగా కనపడదు. ఇట్టి చింతనలు తప్పనికాదు. కాని అవి నిజాకరలేని, ఎట్లుకావలిస్తే అట్లు మారే ప్రవృత్తినుండి వచ్చినట్టివి. మతాభిమానంకాని, విశ్వాసంకాని, నిష్ఠకాని లేకుండానే, మతానికి విద్యలో, నీతిలో భర్తీచేయలేని పాత్రవుందని పట్టుపడుతూ, దాని పెకుసుదనానికి వాపోయే మేధావులలో భయంకలిగించే హతాశ కన బడుతుంది, దీనికి వారే చక్కని సాక్ష్యాలుగా కనిపిస్తారు. మతవ్యతి రేకులుగా వున్నందునకాని, మతానుభవం కీలకమని అనినందువల్లకాని వారిని నేను ఆక్షేపించను. వారు చేసే పని వారిష్టపడే మార్పులను తేగలదని నన్నునేనొప్పించుకోలేను. విశ్వాసాన్ని వ్యాపింపజేసేందుకు విశ్వాసమేకావలెను. విశ్వాసం సాంఘికప్రయోజనం కలది అనే మనో నిశ్చయంకాదు. "మానవజీవితంలో పావిత్ర్యస్థానం" మీది నేటి ఆలోచన మాకియవెల్లీ[26] అర్థంలో. మనకిష్టం వచ్చినట్లు మార్చ బడేదిగా వుండరాదు. పదిహేడవ శతాబ్దపు స్వేచ్ఛాచారులు అమాయ కులకు దైవభక్తి యవసరమేకాని, విద్యావంతులకు విచికిత్సాపూర్వక విశ్వాసరాహిత్యం తగినది అన్నట్లునుకాదు. అటువంటి పద్ధతి ఎంత అర్థవంతమయినా, మనమింతకుముందున్నచోటనే మనలను విడిచి వేయడమేకాక,ఏ ఆధునికత నరికట్టేందుకు తాను ప్రయత్నిస్తున్నదో, దాని ఉత్పన్నఫలమవుతున్నది: అది ఆధునికతకు దాసిపై దానికేకల విషాదమైన అసంతృప్తిని వెల్లడిచేస్తున్నది.

22. మన సంస్కృతిలో ఏది ఆధునికతను వ్యక్తంచేస్తుంది, ఏది ఆధునిక వ్యతిరేకతా ప్రతిఘటనా లక్షణాలను వివరిస్తుంది అనే వాటిమీద తీర్మానించేటప్పుడు జాగ్రత్తగ వుండవలెను. సాంస్కృతిక ప్రక్రియలలో క్రొత్తది ప్రాతవేషాలలో కనపడేది చారిత్రానుభవం వల్ల మనకు తెలుసు.... దీనికి వ్యతిరేకమూవుంది. ప్రాతది క్రొత్త సొగసు వస్త్రాలు ధరించవచ్చు. సంస్కరణోద్యమం[27] అందరికీ తెలిసినట్లు, స్వయాన చెప్పుకొన్న ప్రతిక్రియ. దాని స్వప్నం, శతాబ్దాల తరబడి మతసిద్ధాంతంలో, లౌకిక హేతువృద్ధిలో, క్రైస్తవ వ్యవస్థారూపాలలో పెరిగిపోయిన భ్రష్టాచారఫలితాలను తిరుగగొట్టడం, ఏసుక్రీస్తు శిష్యవర్గకాలంనాటి నిర్మలస్వచ్ఛ విశ్వాసాన్ని మరలా సంపాదించడం. మానసిక, నైతిక ప్రమాణానికి మూలమయిన సంచితసంప్రదాయాన్ని తొలగించి నిజానికిది తన వుద్దేశానికే సూటిగ విరుద్ధమయిన ఉద్యమాన్ని ప్రోత్సహించింది, మత విషయాలపై తార్కికపరిశీలనాసక్తిని పురికొల్పింది. ఎట్లంటే తీవ్రఖండనలకు పాలవుతున్న హేతువును క్రైస్తవపీఠంనుండి, సంప్రదాయంనుండి స్వతంత్రంచేసి వేరుపరచింది.

23. యాంత్రిక ప్రపంచానికి ముందుండి, తర్వాత అంత రించిపోయిన సౌందర్యంకొరకు బాల్యకాలాభిమానంతో చేసే అన్వేష ణగా కాల్పనిక జాతీయత అభివ్యక్తమయింది. గతాన్ని మెచ్చుకొని ప్రసిద్ధంగా ఆధునిక సంఘటన అయిన జాతి-రాష్ట్రభావాన్ని ప్రోత్స హించింది. ఎంతో విశిష్టమై, ఆధునిక పరిణామమైన నాజీజం ఈ కాల్ప నిక దివాస్వప్నాల రాక్షసీయ పునరుద్ధరణే. దీన్నిబట్టి ఆధునికతను "సంప్రదాయం హేతుకత" అనే అక్షరంమీద స్వక్రమంగా కొలువ గలమనే అభిప్రాయం వమ్మయింది. ఆధునికత హేతుబద్ధవ్యవస్థ, సాంకేతికాభివృద్ధుల అసందిగ్ధోత్సాహాల మిశ్రమం. మార్క్సిజం-ఆదిమసమాజం కోసం అదే ప్రాతతపన. అది ఈ రెండు మూల్యాలు సమరసించి మిశ్రమలోహమై భవిష్యత్తులోని ఆదర్శ ప్రపంచం గురించిన ఆతలీయ[28] నిరీక్షణగా పర్యవసించింది. ఇందు ఆధునిక కర్మాగారం, ఆథెన్స్ అగోరా[29] ఏదోవిధంగా కలిసిపోతాయి. అస్తిత్వ తత్వం[30] చాలా ఆధునిక పరిణామంగా కనపడివుండవచ్చు-పరిభాష లోనూ భావచట్రంలోనూ అట్లానేవుండించి కాని నేటి దృక్కోణంలో, ఇది ప్రపంచ పరిస్థితిలో వ్యక్తి బాధ్యతభావాన్ని పునస్సమర్థించే బరితెగిన ప్రయత్నంగా కనిపిస్తుంది. ఆ ప్రపంచ పరిస్థితి యెట్టి దంటే. జనులు, తమ అంగీకారంతోనే, అనామక సాంఘిక, ఆధికారిక సాంకేతిక శక్తులు తమను వ్యక్తంచేసుకొనే కేవలసాధ నాలుగా అయిపోయినారు. వ్యక్తుల ప్రమేయంలేని "సంఘ" కృత్యా లకు బాధ్యతారహితోపకరణాలుగ దిగజార్చబడేందుకొప్పుకున్నవారై, తమ మానవతనే పోగొట్టుకొన్నారన్న సంగతి జనులకు తెలియదు.

24. అంటే చరిత్రగత "కపటహేతువు" పని చేయడమాగ లేదు. సమష్టి జీవితానికి దత్తమయ్యే తమ పంతును ఆధునికతా సర ణిలో చూడవలెనో, ప్రతిక్రియాప్రతిఘటనా సరణిలో చూడవలెనో

ప్రతిక్రియా ఘటనా సరళిలో చూడవలెనో స్పష్టంగా భావించలేక పోవడమటుంచి - ఎవరూ వూహించుకొననూ లేరయిరి. ఆ మాటకు వస్తే వాటిలో ఏది సమర్థనీయం?

25. నాగరికతలు చాలామట్టుకు తమనుతాము రక్షించుకో గల్గినవనే భావంతో వూరటచెందవచ్చును. తమ తప్పులను తామే సరిదిద్దుకోగల సాధనాలను సమకూర్చుకోగలుగుతున్నాయి తమ అభివృద్ధి వలన పుట్టే ప్రమాద ఫలితాలను ప్రతిఘటించే రసాయనాలను సృష్టించుకొంటున్నాయి. ఈ భావాలకు దారితీసిన అనుభవం మాత్రం అంత ఆత్మవిశ్వాసాన్నివ్వదు. రోగలక్షణాలు, జీవి, తననుతాను, స్వాస్థ్యపరచుకొనుటకు చేసే ప్రయత్నాలే అనేది మనకు తెలుసు. బాహ్యాపాయాల నెదుర్కొనుటకు మన దేహాలు ప్రయోగించే ఆత్మరక్షణ సాధనాలవలనే మనం చాలమంది చస్తాము. ప్రతిఘటనా రసాయనాలు చంపగలవు. అటులనే ఆపేక్షిత సుస్థిరత నెలకొనుటకుపూర్వమే, ఊహాతీత స్వయం నియతి ఒక నాగరికతను చంపగలదు. పరిశ్రమీకరణతో సంబంధంకల- లేక దానితో చేతనపొందినట్టి- యాధునికత మొదలైనప్పుడే ఆధునికతపై విమర్శ కూడ ఆరంభమైంది. అప్పటి నుండి వ్యాపిస్తూవుంది. పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దాలలో ఆధునికతా విమర్శకులైన వైకో[31], రూసో[32], టోక్విల్[33] వంటి కాల్పనికతావాదులను అటుంచుదాము. మన కాలంలోనే ఉంటున్న ఆలోచనాపరులు ఎట్లా కావలిస్తే అట్లా మారేందుకనువైన "మాసెన్ గెసెల్‌షాఫ్ట్"[34]లో రానురాను నశించిపోతున్న సారస్యాన్ని అనేక విధాల సూచించి వాపోయినారు. తన ధ్యేయాలను అర్థవంతంగా గుర్తించుకోజాలని ఆధునిక శాస్త్రీశక్తతను తాత్విక పరిభాషలో ఎడ్మండ్ హస్సెర్ల్[35] విస్మరించినాడు. కనపడేది సరిగావుంటే చాలు ననే తృప్తిని ఎదిరించినాడు. దృశ్యమాన విస్పష్టత అనేది వస్తువుల మీది మన యదుపును, భవిష్యశక్తిని పెంపొందించవచ్చును కానీ ఇది అవగాహనకు మారుగ సంపాదించబడింది. హైడెగ్గర్[36] మనం వ్యక్తిత్వహీనతలో మునిగిపోవడానికి మూలాన్ని ఆధ్యాత్మ విజ్ఞాన విస్మృతిలో గుర్తించినాడు: జస్పర్స్[37] పైకి విముక్తులుగా కనపడే మూకల నైతిక, మానసిక అలసత్వాన్ని చారిత్రకస్పృహ ఒరసికొని పోవడంలో ముడిపెట్టెను. దీని పర్యవసానం బాధ్యతాయుత వ్యక్తిత్వం, వైయక్తిక సంబంధాలు నమ్మకంమీద నడవుకోవడం నశించుటలు. అట్లెగా ఈ గసెట్[38] మూకల అధమాభిరుచులతో మేధావులు బలవంతాన సరిపెట్టుకొనునట్లు చేసినందువల్లనే కళలోను, మానవీయ శాస్త్రీలలోను ఉన్నత ప్రమాణాలు పతనమైనాయని గుర్తించినాడు. ఫ్రాంక్‌ఫర్ట్ సంప్రదాయ విమర్శకులూ, కృతక మార్క్సిస్టు పరిభాషలోనైనా, ఇట్లే చేసినారు.

26. ఆధునికతా విమర్శను - అది సాహిత్యపరమయినా, తత్వపరమయినా దాని వైవిధ్యంలో, నాగరికతకాత్మ రక్షణ సాధనంగా జూడడం మంచిది. అయితే అది ఇంతకుముందెన్నడూ లేనంత వడిగా సాగిపోతున్న ఆధునికతను ఆపలేక విఫలమయింది. ఈ గోడు ఎచట చూచినా వినబడుతుంది. ఏ జీవితరంగం గురించి ఆలోచించినా "ఇందులో ఏమి తప్పున్నది" అని అడిగేది మన నైజం. నిజంగానే మనం అడుగుతూనే ఉన్నాం. "దేవునిలో, ప్రజాస్వామ్యంలో, సమ సమాజంలో, కళలో, లైంగిక సంబంధాలలో, కుటుంబంలో, ఆర్థికాభివృద్ధిలో ఏమి తప్పున్నది" అంతటినీ చుట్టుముట్టిన క్లిష్ట పరిస్థితీ భావనలో బ్రతుకుతున్నామేమో అనిపిస్తుంది. దీని కారణాలు గుర్తించుటలో సులభమైన ఏకపద పరిష్కారాభాసాలతో ("ధన స్వామ్యం", "దేవరాహిత్యం" ఇత్యాది) తప్పించుకొనేటే తప్ప-వివలు రయినాము. కొందరాశావాదులు తరచు ప్రసిద్ధులవుతారు. వారు చెప్పేది జనులు శ్రద్ధగా వింటారు. కానీ మేధావివర్గాలలో వారపహాస్య భాజనులవుతారు. విషణ్ణులుగా ఉండటానికే మనమిష్టపడతాము.

27. మార్పులోని విషయంకంటే, తల తిరిగించే మార్పు వేగమే మనలను భయభ్రాంతుల చేస్తుందనీ, అంతులేని భద్రతా రాహిత్యంలో వదలివేస్తుందనీ అప్పుడప్పుడనిపిస్తుంది. ఇంకేదీ స్పష్టం కాదు. సుస్థిరం కాదు. క్రొత్తది త్వరలో కాలదోషం పట్టిపోతుందని తలుస్తాము. స్వయంచాలక వాహనాలుకానీ, దూరశ్రవణయంత్రాలు కానీ లేనప్పుడు విద్యుద్దీపం వింత గొలిపే నవ్యతగా వున్నప్పుడు మన భూగ్రహంమీద పుట్టిన కొందరు వ్యక్తులు మనమధ్య జీవించియున్నారు. వారి హయాంలో ఎన్ని సాహిత్య, కళాసంప్రదాయాలు, పుట్టి గిట్టినాయో? ఎన్ని తాత్విక, ఆదర్శవాద పద్ధతులు లేచినాయో, పడిపోయినాయో! ఎన్ని రాజ్యాలు నిర్మించబడినాయో, కుప్పకూలినాయో మనమంతా యీ మార్పులలో పాల్గొన్నాము. వాటిని గురించి వాపోయినాము. ఎందుకంటే మన జీవితం క్షేమంగా ఆధారపడే ఏ సత్తానూ ఇవి లేకుండా చేసినాయి.

28. ఒకసారి నాకు చెప్పినారు. అసంఖ్యాక బంధితుల దగ్ధ శరీర చితాభస్మంచేత సారవంతమయిన ఒక నాజీకేంద్ర శిబిరం[39]

దగ్గర కోసుగడ్డలెంత త్వరగా పెరిగినపంటే, అవి తలలు వేసేందుకు వ్యవధిలేక, కొమ్మలు వేర్వేరు ఆకులు చిగిర్చినవట. అట్టివి తినుటకు యోగ్యం కావు. అభివృద్ధి పోతున్న అస్వాభావిక వేగంను ఆలోచించ డానికిది దృష్టాంతగాథగా పనికివస్తుంది.

29. ఇటీవలి అభివృద్ధి రేఖలను - ఇందులో కొన్ని వర్గ మానాలు[40] - వివిధ నాగరికతారంగాలకు పొడిగించరాదనేది మనకు తెలుసు. ఈ రేఖలు ఏదో ఒకపై పుకు వంగిపోతాయి లేదా బహుశా S - రేఖలు[41]గా మారవచ్చు. మార్పు ఆలస్యంగా రావచ్చు. లేక విపత్తుల ఫలితంగా వచ్చి, నాగరికతను నయం చేయడంద్వారా దానిని నాశనం చేయవచ్చునని మన భయం.

30. కూర్పులు, తీసివేతలులేని ఆధునికతకు "అనుకూలం"గా కాని, "ప్రతికూలం"గా కాని ఉండేది తప్పిదారి అవుతుంది. సాంకేతిక విజ్ఞానాన్ని, శాస్త్రాన్ని, ఆర్థిక న్యాయాన్ని నిరోధించుట అర్థరహితం. ఆధునికతనైనా, ఆధునికతా వ్యతిరేకాన్నయినా, రెండింటినీ, అనాగరిక, అమానుషరూపాలతో వివరించవచ్చును. అయతొల్లా[42] ఇరానులో తెచ్చిన మతాధిపత్య విప్లవం స్పష్టంగా ఆధునికతకు వ్యతిరేకం, అఫ్ఘనిస్తాన్‌లో, పురాతన గణాల జాతీయత, మతాభిమానంతో కూడిన ప్రతిఘటనపై దాడి సలిపినవారే పలువిధాలుగా ఆధునికతా ధృతి కలవారు[43]. అభివృద్ధి వలని వరప్రసాదాలు, శాపార్థాలు ఒక దానితో ఒకటి ముడిపడియున్నాయనడం ఒక చిన్న సత్యం. అటువంటివే సంప్రదాయ సుగుణాలు, సంకటాలు కూడ.

31. ఆధునికతలో ఏకైక, అత్యంత, అపాయకరాంశాన్ని చూపించేందుకు నేను ప్రయత్నిస్తే, నా భయాన్ని ఒక సమాసంలో క్లుప్తీకరిస్తాను: నిషిద్ధాచారాల యంతర్ధానం[44]. "మంచి" నిషిద్ధాచారాలనీ, "చెడ్డ" నిషిద్ధాచారాలనీ వేరుపరచే మార్గం అంటూ లేదు. మొదటిదానిని కృతకంగా బలపరచేందుకు, రెండవదానిని తీసివేయుటకు గాదు. ఒకదానిని తీసివేస్తే, ఆ దెబ్బతో మిగతావీ పోతాయి. లైంగికమైన నిషిద్ధాచారాలు చాలా తొలగించబడినాయి - మిగిలిన కొన్ని, సగోత్ర గమన నిషేధం, శిశుకామ నిషేధం వంటివి తీవ్రంగా ప్రతిఘటించబడుతున్నాయి. అనేక దేశాలలో కొన్ని వర్గాలవారు తమకు శిశువులతో సంగమించడానికి (అంటే మానభంగం చేయడానికి) "హక్కు" ఉందని బహిరంగంగా వాదిస్తూ, దానిమీద చట్టరీత్యా గల ఆంక్షను తొలగించవలెనని అభ్యర్థిస్తూ, ఇంకా కృతకృత్యులు కాలేదని తెలిసికొంటే అదే చాలు. చనిపోయినవారి కళేబరాల విషయమై వుండే నిషేధం ఇప్పుడు అంతరించిపోయేందుకు ఉబలాటపడే, అభ్యర్థిలాగు కనిపిస్తుంది. అవయవాల అమరిక చాలా జీవితాలను కాపాడింది. నిస్సందేహంగా ఇంకా చాలావాటిని కాపాడగలదు. అయినా మృత దేహాలు బ్రతికినవారికి విడిభాగాల భండారంగాను, పారిశ్రామికోపయోగాలకు ముడిసరుకుగాను వుండే ప్రపంచం వస్తుందని భయపడే వారిపట్ల సానుభూతి చూపించకుండా వుండలేకపోతున్నాను.

32. మృతులపట్ల, జీవులపట్ల, జీవితంపట్లనే ఉండవలసిన గౌరవం అవిభాజ్యం. సాంఘిక జీవితాన్ని సుసంపన్నంచేసే సాంప్రదాయక, మానవీయ బంధాలు నిషిద్ధాచారపద్ధతి లేకుంటే మనజాలవు. అది లేనప్పుడు దురాశా భయాలే మన ఉనికికి మార్గదర్శకాలవుతాయి. నిషిద్ధాచారాలన్నింటినీ అడుగంటనీయడంకంటే, మూర్ఖంగా కనపడే నిషిద్ధాచారాల చెల్లుబడిని కూడ నమ్మడం బహుశా మేలు. హేతుకత, హేత్వీకరణాలు నాగరికతలోని నిషిద్ధాచారాల ఉనికిని బెదిరిస్తూ, దాని మనుగడనే ఒరసివేస్తున్నాయి. సహజనైజంవల్ల ఏర్పడిన అవరోధాలు నిషిద్ధాచారాలు, ప్రణాళికాబద్ధంగా వచ్చినట్టివి కావు. ఇట్టి వీటిని హేతుపూర్వకంగా సంరక్షించేందుకుగానీ, ఏవో కొన్నింటిని ఏరి కొనసాగించేందుకుగానీ, సాధ్యంకాదు. నిషిద్ధాచారాల అంతర్ధానానికి విరుద్ధంగా, సంఘంలోని స్వీయరక్షణాసక్తి తగిన ప్రతిక్రియాబలం చూపించగలదనీ, ఆ ప్రతిక్రియ అనాగరిక రూపంలో రాదనే అనిశ్చితాశపై మన మాధారపడవలసి వస్తుంది.

33. నేననేదిది: యూదులు పందిమాంసం తినరాదు, క్రైస్తవులు శుక్రవారం మాంసం తినరాదు. ముస్లిములు సారాయి త్రాగరాదని నివారించుటకంటే - ఇవన్నీ "అహేతుక" నిషిద్ధాచారాలు కావా మరి? మానవజీవితాన్ని మనిషి వ్యక్తిగతహక్కులనూ గౌరవించదగ్గ హేతుపూర్వకాధారాలు, "హేతుకత"కుండే సామాన్యార్థంలో, గొప్పవి కావు. జనులను రాష్ట్ర ప్రయోజనార్థం ఉపయోగించడానికి, తీసివేయడానికి, నాశనం చేయడానికి, మార్పిడిభాగాలుగా జమకట్టే సర్వాధికార వ్యవస్థ, ఒకవిధంగా హేతుకతా విజయంకాదా? అప్పటికీ, ఆ వ్యవస్థకు కూడా, తన మనుగడ కోసం, ఇష్టం లేకున్నా, కొన్ని "అహేతుక" మూల్యాలను పునరుద్ధరించడం తప్పలేదు. ఇది ఇట్లు తన హేతుకతను నిరాకరించి, సంపూర్ణ హేతుకత స్వయం పరాజయ ధ్యేయమని నిరూపించింది.

(ఇంకా ఉంది)

# నీ కనులు

## శ్రీ సామవేదం షణ్ముఖశర్మ

నల్లని కలువరేకుల్లాంటి కనుదోయి....
కానీ—
తెల్లని వెన్నెల వెలుగుల తళుకుల్ని
గుండెనిండా ఒలికిస్తుంది....
ఎన్నో—ఎన్నెన్నో భావాలు—
మూగమనసు పలుకలేని రాగాలు—
తూగులాడుతాయి ఆ
సోగకనుల కదలికల
తూగుటుయ్యాలలలో....
అనంత మధుర సంగీతాన్ని
తనలో నిక్షిప్తం చేసుకొని,
వాటిని వెలికితీసే
శ్యామలాంగుని కోసం
వేచిచూసే వంశనాళంలా—
అసంఖ్యాక తారకల్ని
దాచుకున్న నింగినీడల్లా—
ఏవో భావాల్ని ఒదిగించుకున్నట్టు....
....నీ కళ్ళు....
ఒక మహాకావ్య నిర్మాణానికి
కావలసిన మధురానుభూతులు
ప్రవేలుతుంటాయి ఆ
కనుచూపులలో....
ఇవి గత జన్మలో
ఏ మహాకవులకో
హృదయ నేత్రాలై,
మిలమిలలాడే
నీరెండ నిగనిగలలోనో—
ఆషాఢ పయోదమాలికా
పక్ష్మాంచలాలపైనో—
పున్నమిరేయి చందురునవ్వుల
వెన్నెలలలోనో—
తారల తళుకులలోనో
హరితసస్యలక్ష్మి
సౌందర్యాలలోనో—
వికసిత కుసుమకేసర
పరాగాలలోనో—
వనలక్ష్మి చేలాంచల
చంచల చలనాల
సమీరాలతోనో—
విచ్చలవిడిగా విహరించి,
అనంత సౌందర్యాన్ని
ఆకళింపు చేసుకున్నాయేమో?

* *

మదికొలనులో
కవితల కలువలు
వికసింప జేసి,
భావ పరిమళాల
గుబాళింపులు
ప్రసరింపజేసే
జ్యోత్స్నామయూఖాల్లా
నీ కంటి కాంతులు
నీ కనుచూపులు
మాటాడే మాటలు నాలో
ఏ భావాలు రేపాయో
చెబుదామంటే,
అవి పాటలై పోతున్నాయి....
ఆ పాటలన్నీ కోటలౌతున్నాయి....
ఆ కోటలో రాణిగా వుండిపోతావా?
నీ కనుబొమల కదలికలో
ఏవో కలలు కదలాడుతూంటాయి....
ఆ కళ్ళలో రాగాలేవో
వినిపిస్తూంటాయి....
భౌతిక చర్మ చక్షువులకందని
ఆనంద సుధావార్నిధీ తరంగ విన్యాసాలు
నర్తిస్తూంటాయి....
ఆ కనురెప్పలలో ఎన్నెన్నో
విన్యాసలాస్య విలాసాలు
విహరిస్తూంటాయి....
కళలన్నింటినీ కళ్ళలో దాచుకొని—
స్పృష్టాస్పృష్ట విలాసాలతో
దర్శింప జేస్తూంటావు....

* *

మనసు దాచిన మాటకన్నుల
వెలుగులైనను పలకరిస్తే—
పలకరింతకు పులకరిస్తే
పులకరింతలు పాటలైనాయి....

# మేడిపండు..

గోళ్ళమూడి లలిత



'ప్రభు, రాజమాత మందిరంనుండి దూతిక తమ దర్శనం కోసం వచ్చి వుంది.'

'తక్షణం ప్రవేశపెట్టు వెంకటా'

'రాచవేమ ప్రభువులకు వందనాలు.'

'ఎవరు? రాజమ్మా...అంతాకుశలమా? తల్లిగారు క్షేమమే కదా? ఏదేని పనిపై తల్లిగారు పంపిరా రాజమ్మా?'

'అందరూ కుశలమే ప్రభూ. రాజమాత సూరమాంబాదేవి ప్రభువులను చూడగోరుతున్నారు.'

'అటులనా. అవశ్యం రాగలమని మనవి చేయుము.'

'శలవు ప్రభు. అటులే మనవి చేస్తాను.'

*    *    *

'అమ్మా ప్రణామములు. మమ్ముల రానాదేశించినారట కదా. తమకు కుశలమే కదా?'

'చిరంజీవీ కూర్చొనవయ్యా. క్షేమమా నాయనా రాచవేమా?'

'క్షేమమే తల్లీ. ఏదైన ప్రజాహిత కార్యమారంభించ దలచి పిలిపించినారా? నోములు, వ్రతములు, దానములేమైన చేయ సంకల్పించారా తల్లీ?'

'లేదు వేమా. నీతోనే ప్రసంగించవలసి వుండి రాబలిచానయ్యా.'

'చెప్పండి తల్లి'

'.........'

'ఏమైంది తల్లీ చిన్నబోయినారు. ఖిన్నలై వున్నారు?'

'ఏమీ లేదు, రాచవేమా, మనసెందుకో కీడు శంకిస్తున్నది. దుస్స్వప్నాలు కలుగుతున్నవి తండ్రీ...'

'ఏ విషయంగా మీరు ఖేదపడుతున్నారు తల్లీ?'

'నా చిరంజీవి క్షేమం గురించే అని వేరె చెప్పాలా వేమా?'

'మీ చిరంజీవిని నేను క్షేమంగానే వున్నా కదమ్మా... యింకా మీకి దిగులెందుకు?'

'నిజమే వేమా. కాని అనేక విషయాలు నా చెవి సోకుతున్నవి. వాటి పూర్వాపరాలు పర్యవసానం గురించే నాకు వ్యధ.'

'అదేమిటి తల్లీ...తమరు తవ్వించిన సంతానవారధి కాలువ యేర్పరిచానే. దానిలో యేదైన లొసగాచ్చినదా?'

'లేదు వేమా. ఆ విషయమై కాదు ..'

'మరికనేమిటి తల్లీ...సందేహించక చెప్పండి తల్లీ.'

'ప్రజల ఘోష బైటికి వినపడుతున్నదయ్యా రాచవేమా'

'ఏదో ఒక వర్గం ప్రజాఘోష యెప్పుడులేదు చెప్పండమ్మా?'

'నిజమే తండ్రీ. ఇప్పుడది బలీయమౌతున్నది. సెలయేటి జలజలలుపోయి, నదీమతల్లి రొద మించి అది సముద్రఘోష ఔతున్నది వేమయ్యా!'

'నావల్ల యే అపచారం జరిగిందో, యేమి చేయమంటారో శలవీయండి తల్లీ.'

'నీవు గద్దె యెక్కిన యీ నాలుగు సంవత్సరాలలోను అనేక కొత్త పన్నుల భారం ప్రజలపై వేస్తున్నావంటున్నారు. బ్రతుకు భారమైందని అఘోరిస్తున్నారు...'

'ఇపుడు కొత్తగా మోపిన భారమేమిటమ్మా?'

'ప్రజలు పన్నులభారంతో అణగారిపోతున్నారు. పందిరివేస్తే పన్ను. పెళ్ళిచేస్తే పన్ను, ఆఖరికి నీవు పురిటిపన్ను కూడా విధించావుట కద వేమయ్యా?'

నిజమేనమ్మా. వేసినమాట నిజమే. అది కొత్తగానే విధించిందే. కాని యింతకుముందు వారందరూ యెన్నెన్ని పన్నులు వేయలేదు చెప్పండి తల్లీ. ఖుణసుంకం, పుట్టుపేరు సుంకం, దర్శన సుంకం, పెళ్ళి సుంకం, బండి సుంకం, రేవు సుంకం, మంగలి సుంకం, ముద్ర సుంకం, వృత్తి సుంకం, బంటు సుంకం, జంతువుల పైన, యింకా యిట్లా చెప్పుకుంటూపోతే యెన్నో, యెన్నెన్నో...

'నిజమే వేమా. వీటివల్లనే మరి ప్రజల్లో అసంతృప్తి రాజుకొనేది. అది రాజి రాజి ఒక్కసారిగా ఆకాశంఅంటే మంటలు ఉవ్వెత్తున లేస్తవి. విజృంభించి, దావానలమై అన్నిటిని చుట్టేసి బూడిద చేస్తుంది బాబూ. అప్పుడు ప్రభువైన నువ్వు, రాజమాతనైన నేనూ శలభాలై మాడిపోతామే కాని యేమి చెయ్యలేము వేమా.'

'తల్లీ మీరు ప్రజాపక్షంగా యోచిస్తున్నారేకాని నా పరంగా చూడటంలేదు...

'రాచవేమా...నేను ఆలోచించేది నీ పరంగా అని కాని ప్రజాపరంగా అని కాని కాదు కన్నయ్యా. కలగబోయే పరిణామాల గురించే. ఈ సుళ్ళు తిరుగుతూ తిరుగుతూ యెంతటి సుడిగుండాన్ని సృష్టిస్తయ్యో అనే. మా నాయనగారు గన్నభూపాలురు ధరణికోట నేలుతూ నాకు రాజనీతులు అలవరించుచేశారు. పన్నులవల్ల కోశాగారానికి నిధులు చేరటమే ప్రధాన ప్రయోజనం కాదు వేమా. దానివల్ల కలిగే సాధక బాధకాలు, కష్ట నష్టాలు కూడా పరిగణనలోకి తీసుకోవాలి బాబు...

'ఐతే తల్లిగారేమంటారు?'

'నీవే ఆలోచించు వేమయ్యా. ఇదివరకటి రాజులు కొంత మంది పెళ్ళిసుంకం వేశారు. దానివల్ల కొన్ని పెళ్ళిళ్ళే ఆగిపోయినై. అది గ్రహించిన తరువాతి పాలకులు దాన్ని తీసివేశారు. పెళ్ళిపన్నుతో పెళ్ళిళ్ళు నిలిచిపోయి వుండవచ్చుకాని పురిటి పన్నుతో పురుడు అగదు కదా?'

'నిజమే తల్లీ. కాని యేమౌతుందిట?'

'ఏమౌతుంది అంటే యేమని చెప్పగలను వేమయ్యా. నీకు అప్రతిష్ట వస్తుంది. ప్రజలకు నీపై ద్వేషం కలగవచ్చు. తులువ ఎవడైనా నీపై తిరగపడవచ్చు. హాని చేయవచ్చు...

'రాచపుటలుకలకివి తప్పనిసరి కదా తల్లీ?'

'నిజమే రాచవేమా. కాని యివి నివార్యము.'

'సరే తల్లీ. నా మనసులోని వ్యధనూ కొంచెం చెప్పుకో నివ్వండి తల్లీ...'

'అవశ్యం చెప్పు నాయనా...'

'తల్లీ యీ కొండవీడు రాజ్యం ఒకనాడు చాలా ఘనమైనదే. ముఫ్ఫైరు రాజులకు మోహం పుట్టించినదీ కొండవీడు. మీకూ తెలుసు. కానీ ఈనాడు నాకు మిగిలింది యెంతమ్మా? చెప్పండి? అందులో చాలా స్వల్పం. నా పూర్వీకులు యేలినదానితో పోల్చిచూస్తే యిది యేపాటిది? తాతగారు కుమరగిరిరెడ్డి ప్రభువులు తమ రాజ్యాన్ని విభజించి, రాజమహేంద్రవరప్రాంతాన్ని విడదీసి తమకు అండగా నిలుస్తారనే ఆశతో కాటయవేములకు ధారపోశారు. అదేతీరున తండ్రిగారు ఆ మిగిలిన రాజ్యాన్ని మరలా చీల్చి తమ సోదరులైన మాచారెడ్లకు కృష్ణవేణి నదికి ఉత్తరపుదిక్కు భూభాగాన్ని ధారాదత్తం చేశారు. ఈ పంపిణీలతో కొండవీటిరాజ్యం చిక్కిశల్యావసిష్టమై క్షీణదశకొచ్చింది. క్రమేపి అర్ధబలం అంగబలం అన్నీ తగ్గుతూ వస్తున్నై. ఔనా తల్లీ?...

'నిజమే వేమా. కాని...'

'వినండి తల్లీ! నన్ను చెప్పనివ్వండి. ఈ పరిస్థితులు చూసిన గజపతులు, కాళింగులు, అశ్వపతులు, సుల్తానులు. నరపతులు విజయనగరంవారు రేచులవలె అన్ని దిక్కులనుండి చుట్టుముట్టి కండ కండలుగా రాజ్యాన్ని పీక్కుతిన్నారు.

'ఇంతేకాదు. వెలమలకూ మనకూ మధ్య వున్న వైరం మీకు తెలిసిందే కదా. అది రావణాసురుని కాష్టంగా రాజుతునే వుంది. మాచారెడ్డి ప్రభువులను చంపి వారి ప్రతిమను కుమార వేదగిరి తమ తమ్మ పడగపై నిలపటం మీకు తెలుసు. దానికి ప్రతీకారంగా పెద కోమటి వేమప్రభువులు కుమార వేదగిరిని చంపి అతని ప్రతిమను తమ తమ్మ పడగపై నిలిపి తృప్తిపడ్డ వైనం అందరికి తెలిసిందే కదా. ఇది చూసి రెట్టించిన పగతో వెలమప్రభువు లింగమనేడు దండెత్తివచ్చి పెదకోమటి వేమప్రభువులను చంపి ఆయన ప్రతిమను తమ తమ్మ పడగపై నిలపటమే కాక వారి సింహలాంఛనాన్ని, నందకన్త పోతరాజు కఠారిని కూడా కైవశం చేసుకు తరలిపోయి నాడు. ఈ రేచర్లవారితో తలపడటానికి మనవారు సుల్తానుల సహాయం తీసుకున్నారని విజయనగరంవారు మనపై కినుక పూనారు కదా తల్లీ? ఆ కచ్చతోనే మన దుర్గాలను వశపరచుకుంటున్నారు. ఈ తీరున వీరంతా మన రాజ్యంనుంచి తలా ఒక చక్కా కొట్టుకుపోతుండే మనకు మిగిలిందేమిటి? అతి స్వల్పమే కదమ్మా?'

నిట్టూరుస్తూ 'యెవరు కాదనగలరు వేమా?' అని తల్లి.

'ఇదేకాదు. మన పూర్వుల సంగతి మీకు తెలియనిదేముంది? పెరవారితోనేకాక పెదకోమటి వేమారెడ్లతోను కూడా యెడతెగని యుద్ధాలు చేశారు. పరాజయాన్నే పొందారు. ఈ అంతులేని యుద్ధాలతో బొక్కసం పూజ్యం ఆయింది. శక్తి క్షీణించింది.

'ఇంతకు సరితూగే, లేక యెక్కువగానో జరిగింది వీరి విలాసాలకు, దానాలకు చేసిన ఖర్చు. పుణ్యం పురుషార్థం అంటూ కీర్తి కండూతులై దానఖండాన్ని తు.చ. తప్పకుండగా పాటించారు. సర్వదానాలు, షోడశ మహాదానాలు - తులాపురుషదానం, కనకధరా ధానం, గో సహస్రదానం, కల్పతరు, బ్రహ్మాండ, హిరణ్యమేరు___ ఒకటేమిటి అన్ని దానాలు చేశారు...

'ఐతే యేమిటి వేమయ్యా?'

'ఏమిటంటారా తల్లీ? వీటన్నిటికి నిరంతరం రాజకోశాగారాన్నించి నిధులు తీస్తూనే వున్నారు కదా. వీటికితోడు అగ్రహారాలు దానాలు చేశారు. వెలలేని పారితోషికాలు పంచిపెట్టారు. ఇవన్నీ వూరికే పౌతాయా తల్లీ?...'

'కుమరగిరి రెడ్డి ప్రభువు రాచకార్యాలన్నిటిని కాటయవేముల చేతుల్లో వుంచి వారు కళాపోషకులై, నర్తన మందిరాల్లో, వినోదాలతో, వసంతోత్సవాలతో కాలం గడిపారు. లెక్కకు మించిన క్రీడా సరసులు, క్రీడాగృహాలు, మందిరాలు నిర్మించి కళారాధన అంటూ, రసికులమంటూ, కళోపాసకులై కాలం ధనంవ్యయం చేశారు...'

'ఇవన్నీ రాజోచిత కార్యాలే కద వేమా?'

'ఔనమ్మా. కాదనలేదు. కాని రాబడినిబట్టి వ్యయం చేయాలన్న రాజనీతి తమకు తెలియనిదా తల్లీ. ఈ సమయంలో కల్లోలం రేగింది. కాటయవేముని ఆసరాతో నిలబడిన కుమరగిరి ప్రభువువైపు కొందరు, వ్యతిరేకించి కొందరు చీలిపోయినారు. ఇదేవిధాన పెదకోమటి రెడ్డి ప్రభువు, మాచారెడ్డి ప్రభువు చీలికలు తెచ్చారు. వీరి అంతః కలహాలు రాజ్యాన్ని పెద్ద దెబ్బతీసినై. వీటివలన అంతులేని ధన నష్టం, ప్రాణనష్టం కలిగింది. కుమరగిరిరెడ్డి ప్రభువు, పెదకోమటి రెడ్డి ప్రభువు యెవరి స్వతంత్రం వాళ్ళు ప్రకటించుకున్నారు. పెద కోమటిరెడ్డి ప్రభువు వారసుడుగా కుమరగిరిరెడ్డి అంగీకరించబడ్డాడు. ఈ విధమైన రాజ్యవిభజనలు అంతఃకలహాలు దేశాన్ని ఆర్థికవ్యవస్థను యెంతగా కుంగదీస్తయ్యో మీరూహించలేరా తల్లీ? రాజకీయ బలహీనత యేర్పడ్డది. కాటయవేముల ననుసరించి తరువాత వారు ఆనువంశికంగా వస్తున్న సచివులని, సిబ్బందిని తొలగించి వారి ఆశ్రితులను నియమించారు. వీరికి ఆ అనుభవం, లోతుపాతులు మృగ్యం. పాలనా యంత్రాంగంవల్ల రాజ్యం బలహీనమైంది.

'ఇక వీటిని మించినవి వసంతోత్సవాలు. అందరూ కర్పూర వసంతరాయల్లే గద తల్లి. అనవేమారెడ్డివారూ వసంతరాయలే. కుమరగిరిరెడ్డి ప్రభువులూ వసంతరాయలే. అవచి తిప్పయశ్రేష్ఠి తేవటం వీరు వాటిని ఖరీదు చేయటం పరిపాటైపోయినది. పన్నీరు యేరై ప్రవహించింది. కస్తూరి గాలిలో నిండి వూపిరి ఆడనిచ్చేది కాదంటారు. మంచి గంధం తెరలు తెరలుగా గాల్లో లేచి పడుతూ వుండేదని ప్రతీతి. పునుగుజవ్వాదులకు మితిలేదు. కస్తూరి, కుంకుమ, ఘనసారం బళ్ళతో తెప్పించి వాటికొక సుగంధశాలనే కట్టించారు గుర్తుందా అమ్మా?'

'ఉన్నవి తంత్రీ వుంది' అని నిట్టూరుస్తుంది.

'ఈ వసంతోత్సవాలలో భూమీ ఆకాశం సుగంధ పరిమళాలతో నిండిపోయేది. అనవేమారెడ్లు 'ఘనసార కస్తూరి కాదివస్తు విస్తార విరచిత అపూర్వవిభవ' అన్న పేరు పొందారు. కుమరగిరి రెడ్లు సాక్షాత్తు కర్పూర వసంతరాయలే. పెదకోమటి వేములు వీరి అడుగుజాడల్లోనే నడిచారు కదా?'

'ఔను వేమయ్యా' అని తల దించుకుంది.

'అలనాటి వసంతోత్సవాలలో మన్మధపూజలు యెంత ప్రాముఖ్యమో, వాటిలో స్వర్ణప్రతిమలు చేయించి పూజించటం, దానం చేయటం రివాజు. ఆ ఉత్సవ సమయాల్లో కర్పూర శలాకలవడగళ్ళ వానలు, పన్నీటి వర్షాలు అంటే అతిశయోక్తి కాదు. దారులన్నీ పన్నీటితో తడిసి జారుతూ, కర్పూర వడగళ్లతో కప్పబడి వుండేవి. ఈ వీరభోగ వసంతరాయళ్ళు కర్పూర శలాకలను ప్రజలపై వెదజల్లేవారు. వీటితోపాటుగా మంచిముత్యాలు, మొహర్లు, రత్నాలూను. రాజుల సొమ్ము రాళ్ళపాలన్న మాట నిజమైంది.'

'ఇక వీరి నాట్యశాలల నిర్మాణానికి, నాట్యగత్తెలకి, వారి ఖర్చులకూ మితే లేదు. రాచకార్యాలు కూడా విసర్జించి కళాపోషకులై గడిపేవారు. కుమరగిరిరెడ్ల చివరికాలంలో దేశంలో విపరీతమైన కరువు, కాటకం దేశంలో వ్యాప్తి చెందింది. గుర్తుందా తల్లీ. దాని ఛాయ పన్నెండేళ్ళదాకా పోలేదు కద."

'ఈ పరిస్థితుల్లో నేను గద్దె యెక్కే వేళకు యేమి మిగిలింది తల్లీ-?...జీర్ణశిధిలాలు తప్ప? ధనాగారం పట్టిపోయింది. చేతుల్లో చిల్లిగవ్వ లేదు. ఏమి చెయ్యగలను. ఏమి చెయ్యమంటారు. పన్నులు వేయక తప్పలేదు. ఈనాడు కొండవీటిరాజ్యం కేవలం మేడిపండు...

'నాయనా వేమా...నువ్వు చెప్పింది ఏదీ కాదనలేను తండ్రీ! కాని ఒక్కటి గుర్తుంచుకోవాలి. నీవు విసిగి వేసారి వున్నట్టే ప్రజలు కూడా విసిగి, వేసారి జీవితం గడపటమే దుర్లభం అనుకుంటున్నారు నాయనా. మోయలేని బరువులతో కుంగిపోయినారు. పోతున్నారు. ఈ పేరుకుపోయిన కసి, అక్కసు, నీపై తీర్చుకోవటానికి చూస్తారు. అవకాశం కోసరం వేచివుంటారు. అదే నా భయం, దిగులూ తండ్రి. ఈ తల్లి ప్రాణం ఓర్చలేక, నీకు హితవు చేయాలని చూస్తున్నాను. నీకేదైనా కీడు సంభవించవచ్చునన్న వూహ కూడా భరించలేకుండా వున్నాను. నా మనసెందుకో కీడు శంకిస్తున్నది. భయాందోళనలు కలుగుతున్నై. నా మాటవిని యీ పురిటి పన్ను తొలగించు వేమా'.

'సరేనమ్మా ఆలోచిస్తాను. మీ సంతోషమే నాకు రక్ష, బలం.'

'ఆలోచిస్తానంటే కాదు వేమయ్యా. నేడో రేపో దాన్ని రద్దు చేయాలి.'

'మీ మాట కాదనగలనా తల్లీ. అవశ్యం చేయగలను. నాకు శలవా మరి.'

'నా తండ్రి నూరేళ్ళు వర్ధిల్లాలి. వెళ్ళిరా కన్నయ్యా?'

* * * *

'అమ్మగారూ...'

'ఏమిటి రాజీ యేమి వార్తలు?'

'ప్రభువులు అత్యవసర పనిపై నగరువీడి వెళ్తున్నారట! రెండుదినాలలో రాగలమని, వచ్చిన వెనుక రాజమాతవారు అనతిచ్చినటుల చేయగలమని మనవి చేయమన్నారు.'

'అయ్యో. కుమారుడెంత పనిచేసినాడే రాజీ. నా సలహా పాటించకుండగనే నగరు విడిచి వెళ్ళినాడా వేమయ్య. ఏమి చేయలేని దానైనపోయానే రాజీ. అంతా ఆ భగవంతుడి దయ యింక!'

* * * *

'రాజీ...ఆ కలకలం యేమిటే?'

'ఏమి చెప్పను తల్లి. ప్రభువుల పరిచారకుడు బలిజ సవిరము ఎల్లయనాయకుని భార్య ప్రసవించినదట.'

'ఆఁ...ప్రసవిస్తే...'

'పురిటిపన్ను చెల్లించవలసినదని రాజభటులు బలిజనాయకుని వేధిస్తున్నారు.'

'అయ్యోయ్యో. భయపడినంతా జరుగుతున్నదే రాజీ. వేమయ్య యెందుకు యీ విషయంగా నిషేధాజ్ఞలు ప్రకటించకుండగా నగరు వెడలినట్టు. వెళ్ళి రెండు దినములు దాటుతున్నవి కదుటే రాజమ్మా?'

'ఔను తల్లీ. ఈ రోజు రావచ్చునన్నారు.'

'రాజీ ఆ కలకలం యింకా పెద్దదౌతున్నదే. ఎవరినైన పంపి కారణం తెలుసుకో. కాదే నీవే వెళ్ళి త్వరగారా. మనసు పిరికిబారుతున్నది. ఏమి కానున్నదో...'

'భయపడకు తల్లి. ఇప్పుడే రాగలను.'

* * * *

'తల్లి...అమ్మా...అంతా'

'ఏమిటే రాజీ...యేమైందే. ఆకులాగా వణికిపోతున్నావు యేమైందే రాజమ్మా...ఆ సేవకులు యెవర్నో లోపలకు మోసుకొస్తున్నారు...చెప్పవే...'

'ఏం చెప్పను తల్లీ...ఆ బలిజ ఎల్లయ నాయకుడు తిరగబడి, ముత్యాలమ్మ గుడివద్ద ఆవేశంతో...'

'ఆఁ ముత్యాలమ్మ గుడివద్ద యేమైందే రాజీ...'

'ఊరినుండి నగరుకువస్తున్న ప్రభువును...ప్రభువులను...పొడిచాడు తల్లి.'

'ఆఁ...'

'తల్లీ మూర్ఛపోయినావా? నీ ప్రాణాలే పోతే మంచిదేమో తల్లీ. భగవంతుడు నీకా వరం యివ్వాలి. ఇస్తాడు కూడానమ్మా!'

# జీవుని వేదన

## శ్రీ జి. వి. సుబ్బారావు

శ్రీ చక్రమ్మును బూజసేయ, స్ఫటిక శ్రీలింగమున్ క్షీరధా
రా చాంద్రీ మృదురేఖలన్ దనుప, శ్రీరాజేశ్వరీ స్తోత్రమా
లా చాతుర్య వచో విభూతు లెదలో లగ్నమ్ముగా జేయ-శం
భో! చిద్రూపిని నిన్నుగొల్తు కవితా పూజా ఫలావాప్తితో! 1

జపములు సేయలేను. క్రతుసంగత దీక్ష వహింపలేను. ధ్యా
న పరత యోగనిష్ఠల ననంతుని భ్రూకుటి నిల్పలేను. నా
చ పలతలో మనమ్మున రసాకృతిగా నినునెంచలేను. నా
తపము కవిత్వమై వెలుగ దాశరథీ! దయచూడునీకథన్, 2

చమకముురాదు, నీలగళ! సంస్తుతి సేయ శివార్చనమ్మునన్
నమకము రాదు లింగమ! సనాతనవేదవిధిన్ భజింపగన్
డమరుకరమ్య నిస్వనవిడంబము లేదు. కపర్ది కీర్తనన్
భ్రమ! కవితాత పమ్ము రసరమ్య ధ్వనీకృత రామగాథలై! 3

శివని, రామచంద్రుడని, నీలగళుండని, నీలమేఘపుం
భావము జానకీపతిగ, భావజవైరిగ, రావణారిగా
నీవును నల్లనయ్య గరుణింతురొ-కే విధమైన రీతిలో
జీవిత సత్యమిద్ది, రససిద్ధినొసంగరె నా తపస్సులన్ 4

మెత్తని నాదుగుండియల మీదులు కట్టిన భక్తిభావ సం
పత్తిని, నీకథాకథన భావస్రవంతుల గీలుకొల్పిలో
క్రొత్తర కావ్య శిల్పమును గూర్చెదనంచు దలంతుగాని నా
చిత్తము నిల్వబోదు! రససింధువులౌ కవితాతపస్యలన్ 5

వరదల సుళ్ళలోదిరిగి వార్ధక పర్వత ప్రాంతభూములన్
గిరగిరగొట్టుకొంచు, పరిభిన్న మనస్కృత లీనమైన, సా
గరప్రియభామినీ హృదయగాఢ విషాదతరంగ మైతి! నా
సరసను కావ్యకన్య రససంచలనాత్త ధ్వని ప్రవాహమై, 6

ధనమది యేలరా? బ్రతుకుదారుల, నీనయనాంత నీలమో
హన రుచిచాలదా? ఎదలు హత్తిన భక్తి మరందధారలే
చిన, కవితాతపమ్ము విరజిమ్మిన నీకథచాలదా?-మతే
మని, బ్రతుకీడ్తు? నీ వయసుమళ్ళినవేళ, విషాదసంధ్యలన్ 7

కట్టిన సంకెలల్ విఱిచి, కాలభుజంగపు కోఱలూడ్చి, ఇ
క్కట్టుల సంధిబంధముల ఘట్టనజేసి, విషాదచాయ, తె
ప్పట్టున వ్రాలనీని, రసబంధుర కావ్యతపమ్ములోన, ని
న్బట్టగజూతురా! విషయబంధ విముక్త మనోజ్ఞజ్యోత్స్నగా! 8

డా॥ మైనేని కృష్ణకుమారి

# త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజాధిరాజు శాసనములు

ద్రాక్షారామము[1], సింహాచలము[2]లలో నున్న త్రిభువన చక్రవర్తి రాజాధిరాజు శాసనములు సౌత్‌ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ వాల్యూములు నాలుగు, ఆరులలో ప్రచురింప బడినవి. ఇవి అన్నియు చాళుక్యచోళ రాజైన రాజాధిరాజు విజయరాజ్య సంవత్సరములలోను, శకసంవత్సరములలోను ఈయబడినవి. రాజులపేర్లు వేరైనప్పటికిని పండితులైన కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆదిత్యశర్మ[3]మరియు శ్రీమతి వి. యశోదాదేవి[4] గార్లు శాసనములలోని ఈ రాజాధిరాజును తమిళ ప్రాంతములో పాలించుచుండిన చాళుక్యచోళ రాజులైన ముమ్మడి కులోత్తుంగుడు (క్రీ.శ. 1178—1216), ముమ్మడి రాజరాజు (క్రీ. శ. 1216 — 1260 మరియు) ముమ్మడి రాజేంద్రుడు (క్రీ. శ. 1246-1279)గా గుర్తించిరి. కాకతీయరాజుల మంత్రులు, సేనాపతులు, భృత్యులునైన ఇందులూరి గన్నయ, జాయపనాయకుడు, కాలపరతి సూరయరెడ్డి, రేచర్ల రాజనాయకుడు ద్రాక్షారామములో నిచ్చిన దేవాలయ దానశాసనములలో త్రిభువన చక్రవర్తి రాజాధిరాజును, ఆతని విజయరాజ్య సంవత్సరములను ప్రస్తావించిరి. ఈ శాసనములను పరిశీలించుతూ పి. వి. పి. శాస్త్రిగారు[5] జయించిన ప్రాంతములలో, వాడుకగా వచ్చు ఆచారములవలన వీరు తమశాసనములలో రాజాధిరాజును ఆతని విజయ రాజ్యసంవత్సరములను ప్రస్తావించినట్లుగా భావించిరి ద్రాక్షారామములో రాజాధిరాజు శాసనములపై నేను మరియు సి. సోమసుందరరావుగారిచే వ్రాయబడిన వ్యాసములో[6] చాళుక్యచోళులకు సంబంధించిన ఒకవంశము ద్రాక్షారామ పరిసర ప్రాంతములో స్థిరపడి, సింహాచలమువరకు తమఆధిపత్యము నెరపినట్లును, వీరు రమారమి ఒక శతాబ్దముపాటు [అనగా క్రీ. శ. 1193 నుండి 1303వరకు] పరిపాలించినట్లును భావించితిమి. అదే వ్యాసములో కాకతీయ రాజులు ఎంతో సమర్థులు, బలవంతులైనప్పటికిని ఈ కాలములో వారిశాసనములు ద్రాక్షారామమునకు ఉత్తరముగా వేరెచ్చటను లభ్యముగానట్లు వ్రాయబడినది. పుంగనూరు శాసనము మరియు ద్రాక్షారామములోని శాసనముల సహాయముతో త్రిభువన చక్రవర్తి ఇమ్మడి రాజాధిరాజు ఆంధ్రదేశమునకు వచ్చిన కాలమును గురించి చర్చించుట ప్రస్తుత వ్యాసములోనిముఖ్యోద్దేశము.

బహుశ ఇమ్మడి రాజరాజు తనకు సంతానము లేకపోవుట వలన కాబోలు విక్రమచోడుని దౌహిత్రుడైన ఇమ్మడి రాజాధిరాజును చోళరాజ్యమునకు వారసునిగా ప్రకటించెను. తొలుత కీల్‌హార్న్ పండితుడు[7] ఇమ్మడి రాజాధిరాజు పట్టాభిషేకమును క్రీ. శ. 1163 ఫిబ్రవరి 28, మార్చి 30 మధ్యకాలమున జరిగినట్లుగా భావించిరి. రాబర్టుసూవెల్[8], జాకొబి[9], మరికొందరు పండితులు ఈ పద్ధతినే అనుసరించి సుమారు 15 శాసనములలో విజయరాజ్య సంవత్సరములను, దానికి సంబంధించిన శాసనములలో పేర్కొనబడిన ఇతర అంశములను సవరించిరి. కాని, తరువాత వెలుగులోనికి వచ్చిన ఇతర శాసనముల వలన చరిత్రకారులకు ఈ కాలనిర్ణయమును తిరిగి మార్చుటకు వీలు కల్గినది. రాజాధిరాజు శాసనములలో నీ యబడిన తిథి. నక్షత్రములు, మాసములు మున్నగు అంశములను పరిశీలించి ఎన్. సేతురామన్ గారు[10] ఇది క్రీ.శ. 1166, జూన్, జూలై నెలల మధ్య జరిగినట్లుగా అభిప్రాయపడిరి. ఇమ్మడి రాజాధిరాజు రెండవ రాజరాజుతో కలసి ఏడేండ్లపాటు, అనగా, క్రీ శ. 1173 వరకు రాజ్యమేలెను. ఇమ్మడి రాజాధిరాజు క్రీ. శ. 1166న రాజ్యమునకు వచ్చినప్పటినుండి తమిళ ప్రాంతములో రెండవ రాజరాజు శాసనములు మన కెచ్చటనుకానరావు,[11] కాని అదేసమయములో రెండవ రాజరాజు శాసనములు ఆంధ్రదేశములో క్రీ. శ 1173వరకు మనకు లభ్యమగుచున్నవి.[12]

ముమ్మడి కులోత్తుంగుడు చోళరాజ్యమునకు వచ్చుట వలననో లేక పాండ్యుల తోడి సంభవించిన కలహముల వలననో ఇమ్మడి రాజాధిరాజు తన 26వ రాజ్యకాల సంవత్సరము తరువాత (అనగా పుంగనూరులోని అతని శాసనకాలము[13] తదుపరి) ఆంధ్ర దేశమునకు వచ్చియుండవచ్చును. కాని ఆచార్యులు కె. ఏ. ఎన్. శాస్త్రిగారు ద్రాక్షారామములోని రాజాధిరాజు శాసనములలో నొకటి[14] అతని 61వ రాజ్యకాల సంవత్సరములో వీయబడగా, నది 16వ రాజ్యకాల సంవత్సరమునకు తప్పుగా వ్రాయబడినదని అభిప్రాయపడిరి.[15] అందువలన వారు రాజాధిరాజు ఆంధ్రప్రదేశమునకు 16వ రాజ్యకాల సంవత్సరమునకు తరువాతనే వచ్చినట్లుగా భావించిరి. శ్రీ ఎన్.

సేతురామన్‌గారు[16] కూడ కె. ఎ. ఎన్. శాస్త్రిగారు సవరించినదానిని అంగీకరించుతూ రాజాధిరాజు చోళరాజ్యమున 15 సంవత్సరములపాటు రాజ్యము చేసిన తరువాత ఆంధ్రదేశమునకు వచ్చినట్లుగా వ్రాసిరి.

“త్రిభువన చక్రవర్తి” అను బిరుదము ధరించిన చాళుక్య చోళ రాజులలో మొదటి కులోత్తుంగుడే ప్రథముడు. “సత్యాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజ” మున్నగు చాళుక్య బిరుదములతోపాటు “త్రిభువన చక్రవర్తి”అన్న బిరుదమునుకూడ ఈతడు వహించినట్లు 5వ రాజ్యకాల సంవత్సరమునుండి ఇచ్చిన కులోత్తుంగుని శాసనములవలన తెలియుచున్నది.[17] మొదటి కులోత్తుంగుని తరువాత రాజ్యమునకు వచ్చిన రాజులు సాధారణముగా వచ్చిన చోళవ్య బిరుదమును పంకించకుండ ముఖ్యముగా తమ వ్యక్తిగత నామములతోను “త్రిభువన చక్రవర్తి” బిరుదముతోనే ఎక్కువగా శాసనములలో ప్రస్తావించబడిరి.

ద్రాక్షారామములో త్రిభువన చక్రవర్తి రాజాధిరాజు శాసనములు 76వ విజయ రాజ్యసంవత్సరము వరకు కన్పడుచున్నవి.[18] ఈ విషయమును కీ॥శే॥ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు[19] గమనించి “ఇతడు కూడ త్రిభువన చక్రవర్తి రెండవ రాజాధిరాజు వలెనే ఒక ఛాయాగ్రహము వంటి విచిత్రవ్యక్తి” అని వ్రాసినారు. పి. వి. పి శాస్త్రిగారు[20] ఈతని విషయము గురించివ్రాయుచూ, కాకతీయుల మంత్రియైన ఇందలూరి అన్నయ శాసనములో చెప్పబడిన త్రిభువన చక్రవర్తి రాజాధిరాజును [శకసంవత్సరము 1215(క్రీ. శ.1293), 76వ రాజ్యకాలమునాటిది] చాళుక్య చోళరాజైన ముమ్మడి రాజరాజుతో గుర్తించుటకు వీలగునుగాని, రాజాధిరాజుతో మాత్రముకాదని అభిప్రాయపడిరి. అదే విషయమును విశదీకరిస్తూ, అప్పటికి చాళుక్య చోళ రాజైన రాజాధిరాజు మరియు ముమ్మడి రాజరాజును ఇద్దరూ మరణించిరి, ఐననూ, ఆ ప్రదేశములోని ఆచారమును గౌరవించుతూ, ఇందలూరి అన్నయ మంత్రి తన శాసనములలో రాజరాజును, అతని 76వ విజయరాజ్య సంవత్సరమును ప్రస్తావించినట్లు వ్రాసిరి. ఇది అంత సమంజసముగాలేదు. దీని వలన అసలు త్రిభువన చక్రవర్తి రాజాధిరాజు అనునతడు చారిత్రిక వ్యక్తో కాదో తెలియని సందిగ్ధత ఏర్పడుటకు వీలుకలిగినది. కాని, ద్రాక్షారామములోనే కాకుండ సింహాచలములోని ఒక శాసనములోకూడ రాజాధిరాజు. అతని విజయ రాజ్య సంవత్సరములు చెప్పబడినవి. మరియు, ఈకాలముననే ద్రాక్షారామములో వెలనాటి దుర్జయులు[21] కోనసీమనుపాలించు హైహయులు,[22] కొలనినయకులు[23] ఇచ్చిన అనేక దాన శాసనములలో, రాజాధిరాజు పేరుగాని, అతని రాజ్యకాలముగాని పేర్కొనబడలేదు. పి. వి. పి. శాస్త్రిగారు అభిప్రాయ పడినట్లు ఆ ప్రదేశ ఆచారమును, మరణించిన రాజును గౌరవించుటకే రాజాధిరాజుపేరును అతని సంవత్సరములను శాసనములలో కాకతీయ మంత్రులు ఇతరులు చెప్పినట్లయిన్చో పైనుదహరించిన శాసనములు దీనికి భిన్నముగా నెట్లు ఈయబడెను ?

ముమ్మడి రాజరాజు రాజ్యపాలన క్రీ. శ. 1260 వరకు జరిగినట్లుగా శాశనముల వలన మనకు తెలియుచున్నది. ముమ్మడి రాజేంద్ర చోళునికి సంబంధించిన తమిళ శాసనమొకటి త్రిపురాంతములో నున్నది.[24] ఇది రౌద్ర సంవత్సర మునను, అతని 15 వ రాజ్యకాల సంవత్సరమునను ఈయబడినది. అంగా నిది క్రీ. శ. 1260 నకు సరిపోవుచున్నది. ఇది కాకతీయ గణపతిదేవుని చివరి పరిపాలనా సంవత్సరములోనిది. దీనిలో నతడు “మహారాజనరపతి రాజేంద్రచోళ” అని చెప్పబడినాడు ఈ శాసనమందెచ్చటను ముమ్మడి రాజేంద్రుడు త్రిభువన చక్రవర్తి రాజాధిరాజుగా ప్రస్తావించబడలేదు. ఆంధ్రదేశముపై దండెత్తిన కారణము వలననో, లేక ఆంధ్రదేశముపై తన ప్రభావము చూపుటకో ముమ్మడి రాజేంద్రుడు త్రిపురాంతకము వరకు వచ్చినట్లుగా భావింపబడుచున్నది, దీనిని బట్టి చోళరాజ్యమునకే తమ అధికారము పరిమితమైనట్టి రాజులు వేరుగా. త్రిభువన చక్రవర్తి రాజాధిరాజుగా ద్రాక్షారామము శాసనములలో ప్రస్తావించబడిన రాజులువేరుగా తమ ఆధిపత్యము వెలయించినట్లుతోచుచున్నది. పి. వి పి. శాస్త్రిగారు సూచించినట్లుగా చోళదేశ చరిత్రలో ఒకరాజుమరణించి, అతని పరిపాలనాకాలము ముగిసి 33 సంవత్సరములయిన తరువాత, గౌరవసూచకముగా అతని పేరును, రాజ్యకాల సంవత్సరములను శాసనములలోపేర్కొనడ మనునది మనకు ఇంతవరకు తటస్థించలేదు. అట్లే ఆంధ్రదేశములోని రాజాధిరాజు శాసనములను, ఆయా సమకాలీన చోళ రాజులలో గుర్తించుటకూడ అంత సమంజసముగాలేదు.

ఇమ్మడి రాజాధిరాజుని పుంగనూరు శాసనము[25] లోని కాలము కొంతప్రత్యేకతతో లిఖింపబడినది. అది 14వ రాజ్యసంవత్సరమైనట్టి 12 వ విజయరాజ్య సంవత్సరము. గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టుగారు దీనిని రెండు రాజ్యకాల సంవత్సరములుగా భావించి, ఒకటి రాజాధిరాజు నిజముగా రాజ్యపాలనకు వచ్చిన సంవత్సరముగాను, రెండవది చోళ రాజ్యమునకు వారసునిగా ఇమ్మడి రాజరాజుచే ప్రతిపాదింపబడిన సంవత్సరముగాను పరిగణించిరి. కాని అందరికి ఆమోదకరముగా రెండవ రాజాధిరాజు సింహాసనమునకు వచ్చిన సంవత్సరము క్రీ.శ. 1166గా లెక్కకట్టబడుట వలన గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు వారి సూచనలను అంగీకరించుటకు వీలుకలుగుటలేదు.

సాధారణముగా, పెక్కు తమిళశాసనములలో చేయురీతిని ఈ రెండు రాజ్యకాల సంవత్సరములను కలుపుటయే ఈ సమస్యకు పరిష్కార ముగా తోచుచున్నది. దీనివలన, పుంగనూరు శాసనమును రెండవ రాజాధిరాజు తన 26వ విజయరాజ్య సంవత్సరమున [14 + 12 = 26] ఇచ్చినట్లుగా చెప్పవచ్చును. అంతేగాక, రాజాధిరాజుచోళ దేశంలో తన 26వ రాజ్యకాలము వరకు [అనగా క్రీ.శ. 1192] వున్నట్లు తెలియుచున్నది. ఈ పుంగనూరు శాసనకాలమును పరిష్క రించుతూ శ్రీ సేతురామన్ గారు[26] రాజాధిరాజు తన 14 సంవత్స రముల రాజ్యపాలన చోళదేశములో ముగిసిన పిదప 12సంవత్స రములకు పుంగనూరులో శాసనమిచ్చినట్లుగా వ్రాసిరి. అంతేగాక ద్రాక్షారామములోని ఒక శాసనమునందున్న 61వ విజయరాజ్య సంవత్సరమును 16వ విజయరాజ్య సంవత్సరముగా సరిదిద్ది, దాని ఆధారముగా వారు రెండవ రాజాధిరాజు 14 సంవత్సరములు చోళ దేశమున పాలనచేసి, తదుపరి ఆంధ్రదేశమునకు వచ్చినాడని అభిప్రాయపడిరి.

త్రిభువన చక్రవర్తి రాజాధిరాజు ద్రాక్షారామము శాసనము కొంతభాగము శిధిలమైనది. దానిలో రాజాధిరాజు యొక్క విజయ రాజ్య సంవత్సరము 61గా పేర్కొనబడినది. శకసంవత్సరము చెప్పునపుడు మొదటి రెండు అంకెలు 11గావుండి తరువాతిభాగము. కొంతపాడయినది. కానిరెండవ పంక్తిలో 'రత్న' అనునదిస్పష్టముగా కలదు, ఇది శ్రావణ శుద్ధ 10వ దినమున ఈయబడిన శాసనము. దీనిని శకసంవత్సరము 11 (99)గా మనము భావింప వచ్చును. దీనికి ఆధారముగా, అదే ప్రదేశములోనున్న ఈ రాజుయొక్క మరియొక శాసనము 28గురించిమనము చెప్పవచ్చును. అందులో శక సంవత్సరము 1200. మరియు రాజాధిరాజు విజయరాజ్య సంవ త్సరము 62గాను, వ్రాయబడినది. మరియు నిద్రిశ్రావణశుద్ధ, భౌమ వారము నాడు, మీనస్సుక్రోత్తరము మొదటి దినమందు కాకతీయ రుద్రదేవరాజుల సేవకుడైన సూరయదడ్డిచే నీయబడినది.

ఈ ద్రాక్షారామము శిలాశాసనములు పరిశీలించుట వలన త్రిభువన-చక్రవర్తి ఇమ్మడి రాజాధిరాజే కాక, అదేపేరు, బిరుదములు గల మరియొక రాజు వున్నట్లు స్పష్టమగుచున్నది. ఈతడు క్రీ.శ. 1216-1217న రాజ్యమునకు వచ్చినట్లు శాసనములవలన తెలియు చున్నది. అందువలన త్రిభువన చక్రవర్తి రాజాధిరాజు యొక్క 61వ విజయరాజ్య సంవత్సరమును 16వ విజయరాజ్య సంవత్సర ముగా సవరించుటకు వీలుకాదు. క్రీ. శ. 1195లో ఈయబడిన ముమ్మడి కులోత్తుంగుని తిరువెన్నైనల్లూరుశాసనములో కులోత్తుంగుడు శాసన పాఠకులను తనశాసనము చదువుటకుముందు రాజాధిరాజుని ప్రశస్తి చదువమనికోరెను. దీనినిబట్టి చూచిన రెండు విషయములు మనకు స్పష్టమగుచున్నవి. ఒకటి, ముమ్మడి కులోత్తుంగునికి, రెండవ రాజాధిరాజునకు ఎటువంటి శత్రుత్వము లేదని, రెండవది, ఈ శాసన మిచ్చినసమయమునకు (అనగా క్రీ.శ. 1195) రాజాధిరాజుచోళరాజ్య మున లేడని విశదమగుచున్నది. మరియు ద్రాక్షారామములో రెండవ రాజాధిరాజు యొక్క తొలిశాసనము30 28వ విజయరాజ్య సంవత్సర మున ఈయబడినది. ఈ కారణము లన్నిటిని పరిశీలించినచో బహుశ ఇమ్మడి రాజాధిరాజు ఇప్పటి చరిత్రకారులు భావించునట్లు తన 15వ విజయరాజ్య సంవత్సరము తరువాతకాక, తన 26,28వ విజయరాజ్య సంవత్సరముల మధ్యకాలమున ఆంధ్రదేశమునకు వచ్చినట్లుగా భావించుటకువీలు కలుగుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. సౌ.ఇం.ఇ వాల్యూం: 4నం: 1228; 1100; 1279; 12 57; 1117, 1118; 1043; 1178; 1045; 1033; 12 30; 1318; 1032-ఎ, 1163; 1373; 1074; 1152; 1038; 1079; 1307; 1183.
2. అదే., వాల్యూం :6:నం: 1177
3. మల్లంపల్లి సోమశేఖరశర్మ మరియు ఆదిత్యశర్మ, "దిలేటర్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి," జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసర్చ్ సొసైటి. వాల్యూం 32, పే. 77.
4. వి. యశోదాదేవి,, "దిహిస్టరి ఆఫ్ ఆంధ్ర కంట్రి—క్రీ. శ. 1000;1500— సబ్బిడియరి డైనాస్టీస్" జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసర్చ్ సొసైటి, వాల్యూం: 18,పేజి 107,
5. పి.వి.పి. శాస్త్రి., ది కాకతీయాస్ ఆఫ్ వరంగల్, పే 176.
6. డా॥ సి. సోమసుందరరావు మరియు డా॥ఎమ్. కృష్ణకుమారి "దిరికార్డ్స్ ఆఫ్ రాజాధిరాజ ఎట్ ద్రాక్షారామ," ఇతిహాస్ వాల్యూం:9స్ 10, 198 పే. 1-5.
7. ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూం:9, పేజిలు211 నుండి 217 వరకు
8. అదే వాల్యూం: 10, పే. 127; ఎ.ఆర్.ఇ. 571 ఆఫ్ 1907.
9. అదే., వాల్యూం;11, పే. 123; ఎ.ఆర్.ఇ. 172ఆఫ్1908,
10. తొలుత శ్రీ ఎస్. సేతురామన్‌గారు ఇమ్మడి రాజాధిరాజు సింహా సనమునకు క్రీ. శ. 1166 జనవరి 5 మరియు 8వ తేదీల మధ్య వచ్చినట్లుభావించిరి. చూడుడు - ది చోళాస్ -మేథ.

మెటిక్స్ రికన్స్ట్రక్షన్, ది క్రోనాలజి (1977)పేజీలు 181–183 తరువాత, ఆ కాలనిర్ణయములో కొద్దిమార్పులు చేసి దానిని తన మిడీవల్ పాండ్యన్స్, (1980) పేజి 34లో వ్యక్తము చేసినారు.
11. కె.ఎ.ఎన్. శాస్త్రి — ది చోళాస్ (2వ ప్రచురణ, పునస్సంశోధితము. పేజి 359.
12. సౌ.ఇం.ఇ. వాల్యూం: 10, నం: 187, 184;అదే,వాల్యూం:6 నం: 626, 160.
13. ఎ.ఆర్.ఇ. 209 ఆఫ్ 1932, పార్టు 2, పేరా, 18.
14. సౌ.ఇం.ఇ. వాల్యూం: 4, నం: 1074.
15. కె.ఎ.ఎన్. శాస్త్రి, పైది, పేజి 358.
16. ఎన్. సేతురామన్, మిడీవల్ పాండ్యన్స్, పే. 34.
17. ఎ.ఆర్.ఇ. 197 ఆఫ్ 1910.
18. సౌ.ఇం.ఇ.; వాల్యూం: 4, నం: 1163, 1373, 1074, 1152, 1038, 1079, 1307, 1183.
19. మల్లంపల్లి సోమశేఖరశర్మ, తెలుగు సంస్కృతి, వాల్యూం; 1 (పునస్సంశోధితము, 1983), పే. 235.
20. పి.వి.పి. శాస్త్రి, పైది, పేజిలు 176 మరియు 177.
21. సౌ.ఇం.ఇ. వాల్యూం: 4, నం: 1041, 1054, 1066 1068. 1069 1365 మరియు 1366.
22 అదే., నం: 1046, 1145, 1286, 1315.
23. అదే., నం: 1059, 1206.
24. ఎ.అర్. 201 ఆఫ్ 1905; ఎ.అర్.ఇ. 1906, పార్టు2,పేరా 24.
25. ఎ.ఆర్.ఇ. 209 ఆఫ్ 1932; పార్టు: 2, పేజి. 18.
26. ఎన్. సేతురామన్ ది చోళాస్ — మేథమెటిక్స్ రికన్స్ట్రక్షన్, ది క్రోనాలజి, పే. 151
27. సౌ.ఇం.ఇ. వాల్యూం: 4, నం: 1074.
28. పైది., నం: 1152
29. అదే., వాల్యూం 7, నం: 942; చూడుడు — ఎస్. సేతురామన్, ది చోళాస్ — మాథమెటిక్స్ రికన్స్ట్రక్షన్, ది క్రోనాలజి., పేజి 152:
30. సౌ.ఇం.ఇ.' వాల్యూం: 4, నం: 1223.

# జీవితమింతే!

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

నిశ్శబ్దమైన సడిరేయి
చెప్పలేని భయంతో
అమ్మ ఒడిలోకి దూరి దూరి
పడుకొన్నప్పటి పసితనం

ఉరవడించే తొలిరేయి...
సందడించే కోరికలతో
ఇల్లాలి కౌగిట ఒదిగి ఒదిగి
ముడుచుకొన్నప్పటి ఉడుకుతనం

వెన్నెలకురిసే చల్లనిరేయి...
ఊహకందని ఆలోచనలతో
ఎదపై వెచ్చగా పడుకొన్న చిట్టితండ్రిని
లాలనగా తడుతూ పితృవాత్సల్యం

మంచులో మునిగిన చలిరేయి...
స్మృతుల క్రతువులో జీవిత సత్యాలను వడబోసి
ఒంటరి బాటసారిగా సాగిపోతున్న ముఖావాన్ని
అదేపనిగా తడుముతూ ఆశాశిథిలం

తలచుకొన్న ప్రతిసారీ గతం
ఆర్ద్రతలో తలమునకలవుతుంది
హాయినీ బాధనీ కలిగిస్తుంది!
అయినా ఏదో తృప్తిని ఇస్తుంది

భవితవ్యం గుర్తుకొస్తే
మనస్సెందుకో మూలుగుతుంది
ఇష్టమున్నా లేకపోయినా ప్రయాణం ఆగదు!
ఏది ఎదురైనా ఎలాపరిణమించినా సిద్ధంకాక తప్పదు!

**శ్రీ విష్ణుభట్ల శ్రీరామచంద్ర**

# విజయనగర చరిత్రలో అప్రస్తుతాలు

1. భారత చరిత్రలో విజయనగర సామ్రాజ్యానికి విశిష్టత ఎందుకు యేర్పడింది? అదొక సంధియుగం. దేశవ్యవస్థ మీదికి పెను వెల్లువలా వస్తున్న ప్రభావానికి అడ్డునిలిచి కొంతకాలం, రూపుమాపలేక ఛిన్నాభిన్నమైపోయింది, బహ్మనీ సామ్రాజ్యం, విజయనగరంతో బాటే నెలకొన్నది. అది గూడా విచ్ఛిన్నమైంది కానీ గోల్కొండ రాజ్యం యిటీవలివరకూ ఏదో ఒక రూపంలో నిలబడే వున్నది. విజయనగరం తరువాతి రాజ్యాలేవీ - తంజావూరు, మధుర, శ్రీరంగపట్టణం - అంతకాలం నిలువలేదు. కర్ణాటక, బెంగాలు ఔధ్ నవాబుల ఆధిపత్యం తొలగించడానికి పూనుకున్న ఈస్ట్ఇండియా కంపెనీ హైదరాబాదు నిజాంతో ఒప్పందం చేసుకుని సర్కార్లు మాత్రం పుచ్చుకున్నది.

2. రెండున్నర శతాబ్దాలపాటు భారతీయతకు ప్రతీకగా, ఆలంబనగా నిలిచిన సామ్రాజ్యం పొరుగునున్న బహ్మనీల ప్రాంతం ఆక్రమించుకొనలేకపోయింది. చివరివరకూ సామ్రాజ్య స్థాపనోద్దేశ్యం విదేశీయుల దాడినీ నిలువరించి హైందవ సంస్కృతిని, ప్రాభవాన్నీ, సామాజిక వ్యవస్థను పరిరక్షించడమే అయినా, బహ్మనీరాజ్యం హంపీకి నూరుమైళ్ళ లోపునున్న బీజాపూరు రాజధానిగా రెండున్నర శతాబ్దాలూ పరిపాలించింది. సాధారణ రాజనీతిజ్ఞత కూడా సూచించే విషయం పొరుగు శత్రువుల నరికట్టి తమ పాలనా ప్రాంతం విస్తరింపజెయ్యడమే! అయినా కృష్ణరాయలవంటి చక్రవర్తులు ఓఢ్రగజపతులమీద దండయాత్రలకు ప్రాముఖ్యం ఎందుకిచ్చారు? సమీపంలోని శత్రువులను వదలి వందల మైళ్ళ దూరం రాజధాని విడిచి పలుమార్లు దండయాత్రకు వెడలి తిరిగి రాగలగడం కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే సంభవం. బీజాపూరు ఆవలి గోవా ప్రాంతంలోని పోర్చుగీసు రాజప్రతినిధులతో కొన్ని ఒడంబడికలున్నప్పటికీ, అప్పుడపుడు విజయనగరం, బీజాపూరులమధ్య శాంతియుత సంబంధాలున్నట్లు చెప్పుకోడానికి అవకాశం వున్నది.

3. విజయనగర రాజధాని ఒక విచిత్రమైన ప్రాంతం. తుంగభద్ర తీరం నల్లని రాతిగుట్టలవంటి కొండలబార్లు మలుపులు తిరుగుతున్న నదినానుకుని, మామూలుగా పచ్చనిపంటలకు అనువైన చోటుకాదు. అటూ యిటూ కొంతదూరం వెడితేతప్ప. దేశం మొత్తం మీద తక్కువ వర్షపాతంగల ప్రాంతం. రాజస్థాన్ థార్ ఎడారికి దీటైనది. తక్కువ వర్షపాతంతో జనసాంద్రత తక్కువ వుంటుంది సహజంగా. అటువంటిచోట ముహూర్తం నిర్ణయించి సామ్రాజ్య స్థాపన ఎందుకు చేశారు విద్యారణ్యులు. యుద్ధతంత్రం, జనావాస నిర్మాణం దృష్ట్యా కొన్ని ప్రతిపాదనలు చెయ్యవచ్చు. ఒకటి, దేశానికి పశ్చిమంగా విదేశీయుల ఆక్రమణ జరుగవచ్చని తోచడంవలన, సమీపంగా వాటిని అడ్డుకొనడానికి నదీప్రాంతంలో రాజ్యస్థాపన చెయ్యడం. రెండవది, ఉత్తరాన ఉధృతంగా కొనసాగుతున్న ఖిల్జీలు, తుగ్లక్ల దండయాత్రల వలన ఏర్పడిన వ్యాకులతవలన, దక్షిణాదికి వలసపోయిన కొందరి ప్రభావం వలన జనాకీర్ణప్రాంతాలు విడిచిన కొంతమంది నెలకొల్పిన రాజ్యం కావచ్చు. పశ్చిమ చాళుక్యులు, హొయసల రాజ్యాలు అస్తమించాయి. దక్షిణ సముద్ర తీరప్రాంతాలలో పల్లవుల ప్రభావం ఏదో ఒక రూపంలో కొనసాగుతునే వున్నది. అయితే విజయనగరం హైందవ రాజ్యాలను ఏకీకృతం చేసింది. కానీ బహ్మనీల పునాదులు సడలలేదు. రాజ్యస్థాపనలో ప్రయోజనం ఏమిటి? అది సిద్ధించిందా, లేదా అనేది ప్రస్తుతం.

4. అప్రస్తుతమైన విషయాలన్నీ స్పృశించడం ఉచితంకాదు, అవసరంలేదు. చరిత్ర అనేది నిర్మోహంగా, నిరపేక్షంగా విరచితమైన గతం కాదు. ఎన్నో విషయాలమీద యిసకపొరలు మేటవేసుకుని వుంటాయి. వాటిని తొలగించడం సాధ్యంకాదు. వర్తమానపు అవసరములు, సమస్యలదృష్ట్యా వాటిని పరామర్శించడం కూడా అవివేకం అని భావించే విజ్ఞత కూడా తోసిపుచ్చరానిది. అయినా చరిత్ర అధ్యయనంలో గమనించవలసిన అంశాలు స్మరించడం అవసరం.

4. విజయనగర స్థాపన క్రీ.శ. 1336 లో జరిగినట్లు సాధారణంగా అంగీకరించిన విషయం. ఆర్కియాలాజికల్ సర్వే వారు నిర్ధారణ చేసిన తేదీ కూడా యిదే. 1336 నుంచీ 1486 వరకూ సంగమవంశము, 1487 నుంచి 1503 వరకూ సాళువలు, తరువాత 1569 వరకూ తుళువలు చివరకు 1605 వరకూ ఆరవీడు

వంశీయులు పరిపాలించారు. ఇటీవలి రచనలు అనేకం వెలుపడినప్పటికీ, పురాతనమైన లిఖిత చారిత్రకాధారం "రాయవాచకం" అని పేర్కొనబడుతున్నది. రాష్ట్ర సాహిత్య అకాడెమీవారు 1982 లో దీని ప్రతిని పరిష్కరించి ప్రకటించారు. సి. వి. రామచంద్రరావుగారి పరిష్కరణ, 55 పేజీల పీఠిక విశిష్టమైనవి, మన్నికగలవి. నాయక రాజులు కాలంనాటి రాయవాచకం తెనుగులో ప్రథమవచనరచనగా పేర్కొనబడుతున్నది కూడా.

6 ఖుందేళ్ళు కుక్కను తరిమినచోటు ఒకప్పుడు కిష్కింధగా ప్రసిద్ధినొందినట్లు నానుడి. విద్యారణ్యులు హరిహరరాయలు, బుక్కరాయల తోడ్పాటుతో "శాలివాహన శకం 1127 మీది ప్రభవనామ సంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభకరణములు గూడిన శుభముహూర్తమందు శంకుస్థాపన" చేసినట్లు రాయవాచకం పేర్కొంటున్నది (పుట. 10) ఈ లెక్కన క్రీ. శ. 1205 కావలెను. చరిత్రకారు లంగీకరించిన క్రీ.శ. 1336 కు దీనికి 131 సంవత్సరాల తేడా వున్నది. అయితే వీరనరసింహరాయలు, రక్షసతంగడి యుద్ధ కాలముల లెక్కింపుకు, రాయవాచకకర్త, చరిత్రకారులు నిర్ణయించిన సమయం సరిపోతున్నట్లు తెలుస్తుంది. క్రీ.శ. 1505, క్రీ.శ. 1565 సంవత్సరాలలో నరసింహరాయలు, తళ్ళికోట యుద్ధం పేర్కొనబడ్డట్లు మనకు తెలుసు. రాయవాచక పరిష్కర్త రామచంద్రరావు గారు తమ పీఠికలో వాచక రచయిత తప్పుగా చెప్పివుండవచ్చునని భావించారు. ఇది ఎంతవరకు నిజం కావచ్చు?

7. రాయవాచకంలోని వచనం అష్టదిగ్గజాల కావ్యాలలోని వచనానికి భిన్నమైనది. "క్లాసికల్ ప్రోజు" సంప్రదాయంలో దీర్ఘవాక్యాలతో సాగిపోతుంది. కానీ ఒక ప్రత్యేక నుడికారం గల వ్యావహారికం. రచనలోనే కొంత 'యాస'తో గూడివున్నది. రచయిత సాహితీపరుడు గాడు. రాజకీయ వ్యవహార నిర్వహణలో నిమగ్నుడై నవాడు. ఆనాడు అంకెలతో వ్యవహారం స్థానాపతులకు, కరణాలకు తప్ప యితరులకు లేదు. అనుశ్రుతంగా సంక్రమించిన పరిజ్ఞానం కొన్ని పరిమితమైన సంకేతాలతో కూడుకొని వుండివుండటానికి అవకాశం వున్నది. తిథి వార నక్షత్రాదులు, అంకెలకన్న ఎక్కువ వాడకంలోనూ జ్ఞప్తిలోనూ వుండటానికి అవకాశం వున్నది. అందుచేత శా.శ, 1127 కన్న ప్రభవనామ సం॥ చైత్రపౌర్ణమియే సామ్రాజ్య స్థాపనాసంవత్సరంగా ప్రజాపరిజ్ఞానంగా అంగీకరించవలసి వుంటుంది. ఈ గొడవ అంతా ఎందుచేతనంటే (క్రీ.శ. 1205) ప్రభవనామ సంవత్సరంకాదు. మరి, రెంటినీ పేర్కొన్నప్పుడు దేనిని అంగీకరించాలన్న ప్రశ్న వస్తుంది గనుక యీ చర్చ. అటు క్రీ. శ. 1336 కూడా ప్రభవకాదు. అయితే క్రీ.శ. 1202 గానీ 1262 గానీ లేదా క్రీ.శ. 1327 గానీ 1387 గానీ అయివుండాలి. రాయవాచకం పేర్కొన్న సమయం యదార్థం అయితే 1202 సరైన సంవత్సరంగా స్వీకరించవలసి వుంటుంది. ఇది 1205కు అత్యంత సమీపంగానూ చాంద్రమానం తేదీకి సరిపోతుంది.

8. కానీ రాజవంశావళి 1336 నుంచి 1565 వరకూ నిర్ణయింపబడింది. 1202 నుంచీ 1336 వరకూ ఏమైనట్లు? అప్పుడు 1327 అయివుండటానికి ఎక్కువ అవకాశం వున్నది. 1327 కూ 1336కూ పెద్ద తేడా వుండకపోవచ్చు. కానీ విశేషం ప్రాచీనకాలపు వ్యవహారాలను, వైజ్ఞానిక సమాచార యదార్థ అంశాలను పొందుపర్చి భావితరాలవారికి అందించే తీరుతెన్నులనూ దృష్టిలో ఉంచుకుని చరిత్రను నిర్ణయించడం మేలు. అంటే శకసంవత్సరక్రమం, చాంద్రమాన తిథి వార నక్షత్రాదులు — రెంటిలో ఏది శ్రుతవిజ్ఞానం, స్మరణలో వ్యవహృతం అయివుంటుంది అనే విషయంమీద వివేచించి నిర్ణయించిన అంశం. రెండవది, రాయవాచకపు వివరణయొక్క విశ్వసనీయత, మొదటి అంశం ప్రస్తుతం పరిశీలిద్దాం. అది చారిత్రక పరిశోధనా పద్ధతులలో సర్వత్రా ఎదురువచ్చే సమస్య (తేదీలకు, తిథులకు తేడా వున్నప్పుడు). రాయవాచకం గురించిన చర్చ అకాడెమీ ప్రచురణ పీఠికలో సమగ్రంగా తార్కికంగానూ వున్నది. అయినా కొన్ని విషయాలు స్థాలీపులాకంగా స్పృశింపబడ్డాయి గనుక ఉత్తరోత్తరా పరిశోధన అవసరం.

9. పదునాల్గవ శతాబ్దపు సామాజిక స్థితిగతుల వివరణను ప్రామాణికంగా రూపొందించడం కష్టం. సాహితీకృతులలో గోచరించే కొన్ని వివరాలు అలంకార విరహితంచేసి తత్కాలీన వ్యవహారాలకు ప్రతిబింబాలుగా స్వీకరించవచ్చు. మెట్టప్రాంతం అంటే ఆ రోజుల్లో సర్వత్రా, అంతా చెరువులు, వర్షంమీదనే ఆధారపడిన ప్రాంతం. వరికన్న జొన్న, సజ్జ ప్రముఖమైన అపరాలుగా పేర్కొనవచ్చు. సమృద్ధిలేని సమయమైనా, జనసాంద్రతగానీ జనసంఖ్యగానీ సంఘర్షణకు పూనుకునే అవకాశం లేని వ్యవస్థ. అప్పటికే మూడు నాలుగు శతాబ్దాలుగా తీవ్రమైన ముస్లిందాడులకు కుంఠితమైన ఉత్తర భారతదేశపు మానసికస్థితి. ముస్లిం సామ్రాజ్యాధిపత్యంనుంచి తప్పించుకుని స్వేచ్ఛాయుతమైన జీవనభృతి, నిర్వహణకోసం కనీసం కొంతమంది అయినా వింధ్యలు దక్షిణాపథంలో నివాసం ఏర్పర్చుకొని ప్రజానీకాన్ని దాడుల విస్తరణ నరికట్టడానికి సమాయత్తం చేస్తూ వుండాలని వూహించవచ్చు. విద్యారణ్య లెక్కడివారో తెలియదు. బౌద్ధం, జైనం హైందవం పరస్పర కలహాలతో సతమతమవుతున్న రోజులు. దక్షిణ రాజ్యాలలో బౌద్ధం జైనం స్వీకృతమయ్యాయి. వీటిల్లో కొంత తాంత్రిక నియమావళి, ప్రవర్తన వున్నట్లు ప్రతీతి. శంకరుని అద్వైతం, తర్కాన్ని ఆదర్శవాదాన్ని జోడించి తాంత్రిక ప్రవర్తనను అరికట్టడానికి విశిష్టమైన కృషి సల్పింది. వివిధ మత

సిద్ధాంతాలను పర్యామర్శించిన గ్రంథం అనాటి "సర్వదర్శన సంగ్రహం". చార్వాకంతో ఆరంభం అవుతుంది. ముస్లిం దాడులతో కల్లోలితమైన సమాజంలో ఒక భీతితో గూడిన వ్యవస్థ ఏర్పడి వుంటుంది. ఆహారం, నివాసం, మనుషుల తోడ్పాటుకు వైషమ్యం, అటువంటి స్థితుల్లో దైహికవాదం ప్రాచుర్యం పొందుతుంది. చార్వాక వ్యవహారాన్ని దైహికవాదంగానే భావించవచ్చు చాలావరకు. ఒక వ్యక్తిపరమైన సిద్ధాంతంగాకాక ఒక సాంప్రదాయపు సరళిగా స్వీక రించడం తర్కయుతంగానూ యదార్థబద్ధంగానూ తోస్తుంది. ఆదర్శ వాదాన్ని మేలుగా నిలకొల్పడానికి కృషిచేసిన విద్యారణ్యులు సర్వ దర్శన సంగ్రహరచయిత మాధవాచార్యులు సోదరులనీ. ఒకరేనని రెండు వాదాలు. విజయనగర సామ్రాజ్యస్థాపన, సత్యదర్శన సంగ్రహం రచన ఒకే సమయానికి చెందినవని మాత్రం అంగీక రించవచ్చు.

10. తదనుసారం, ఒకవైపు ముస్లింలతోనూ మరొకవైపు బౌద్ధం జైనంతోనూ సంఘర్షణ ప్రాతిపదికగా ఏర్పడినది విజయనగర సామ్రాజ్యం. అయితే బౌద్ధం జైనంతో వైరుధ్యం క్రమేపీ వ్యవ హారంలో పరిష్కృతమైనట్లు తోస్తుంది. ధక్షిణాపథమంతా విస్త రించింది సామ్రాజ్యం పదహారవ శతాబ్ది నడిభాగంవరకూ, హరిహర బుక్కరాయలిరువురూ ఆనెగొందిలోని యుద్ధకార్యాసక్తులైన వ్యక్తులు. ఒకరు ఎత్తు, రెండు కురచ. మేధావి, నిష్ఠాపరుడైన వ్యక్తి విద్యా రణ్యుడు. ఆ విధంగా ప్రారంభం అయింది చరిత్ర.

11. వర్తమాన శిధిలాలను అనుసరించి చారిత్రక విశ్లేషణ చెయ్యడానికి కొన్ని ఆటంకాలున్నాయి. ఒకటి, శిధిలాల పునరుద్ధరణ కార్యక్రమం. అనేక దశాబ్దాలుగా సాగుతున్న పునరుద్ధరణ కార్య క్రమం పలుముఖాలతో ప్రవర్తిస్తున్నది. త్రవ్వకాలు, యితర త్రా గోచరించిన కట్టడాలను యధాతథంగా వుంచడం, మెరుగుపర్చి ఆధునిక చెయ్యడం, జీర్ణశైధిల్య నిరోధం మాత్రమేగాక పునర్ని ర్మాణం గూడా జరుగుతున్నది. కొత్తరాళ్ళతో ప్రస్తుతం చెక్క ప్రాచీనపు నమూనాలో రాజసభాప్రాంగణాల నిర్మాణం జరుగు తున్నది. హంపీ బజారులో ఒకవైపు విరూపాక్ష దేవాలయం వున్నది. మరొకవైపు యీ విధమైన పునర్నిర్మాణ కార్యక్రమం జరుగుతున్నది. పురావస్తు చారిత్రక పద్ధతులదృష్ట్యా ఇది ఎంత వరకు వాంఛనీయమో తెలియదు. పండితులు, పెద్దలు పరిశీలించ వలసిన విషయం. పూర్వపు నిర్మాణాలు పూర్తిగా శిధిలమై, కూలి పోయి మరే యితరవిధాలా ప్రదర్శనకు పరిశోధనకు పనికిరాకపోతే ఏం చెయ్యాలి. ప్రదర్శనకు ప్రాముఖ్యమివ్వాలా పరిశోధనకా. చెప్పడం కష్టమేమో! ప్రదర్శన పదిమందికీ చెందినది. పరిశోధన ఒకరిద్దరికో మాత్రమే. అచట పెద్దపెట్టున కొనసాగుతున్న నూతన శిలానిర్మాణాలు పూర్వపురీతిలో వున్నవే అని భావిద్దాం.

12. దైహికవాదంలో కొంత పైచేయి బీజాపూరులో నెల కొన్నట్లు కొన్ని ఆధారాలు ఋజువు చేస్తున్నాయి. వాస్తువు, శిల్పం, గ్రామవ్యవహార నిర్వహణ, ఆస్థానవైద్యం, సలహా సంప్రదింపుల వంటి విషయాలలో ప్రత్యక్షంగానూ కొన్నిచోట్ల పరోక్షంగానూ హిందువుల తోడ్పాటుతో ముస్లింరాజులు పాలన సాగించినట్లు తెలియ చేస్తుంది. ఆర్కియలాజికల్ సర్వేవారు ప్రకటించిన గ్రంథాలలోని అంశాలు నిదర్శనం. బీజాపూరు గురించి ప్రకటించిన కొన్ని విశేషా లలో అచటి రాజధాని చిత్రపటం చూస్తే మానవ మస్తిష్కం, యింద్రియ ద్వారాలు యితర విషయాలు ఆధారంగా నగరపటం యొక్క రూపం ప్రతిష్ఠించినట్లు తెలుస్తుంది. సప్తగిరి ఆధారమైన విజయనగర మస్తిష్కం మరొక రూపం, మరొక శక్తి కలది. బీజాపూరు ప్రాభవం వెనుక బలీయమైన శక్తులున్నప్పటికీ విజయ నగరంకన్న మిన్న అని చెప్పడానికి వీలులేదు. శిల్పవాస్తుశాస్త్రా లకు సంబంధించిన విషయాలను మన పెద్దలు గోప్యంగానే భావించారు. మానసిక పరిణతి, శ్రమ వుంటే తప్ప బోధనీయంగావు.

13. ఉత్తరభారతమేగాక విజయనగర స్థాపనకు పూర్వం అటు కాకతీయ సామ్రాజ్యం యిటు హోయసల రాజ్యం కూడా విచ్ఛిన్నమయ్యాయి. దండనాయకులు, రాజనీతిజ్ఞులు, పురోహితులు, సామంతులు చాలామంది తరలిపోయి విజయనగరం ఆశ్రయించారు. ఇటువంటి పరిణామంలో గమనించవలసిన విషయం, యుద్ధాలలో తలఒగ్గిన సామ్రాజ్యాలలో అధికారులు నూతన చక్రవర్తుల క్రింద కార్యనిర్వహణను ఆస్థాన పదవులను అంగీకరించడం. కొంతమంది ప్రముఖులు అత్యున్నత స్థాయిలో వున్నవారుతప్ప నిలకడగా గ్రామ వ్యవస్థలోనూ సైన్యంలోనూ పనిచేస్తున్నవారిలో చాలామంది తమ తమ స్థానాలలో నిలిచివుండే అవకాశం హెచ్చు. అటువంటప్పుడు నూతన హైందవ సామ్రాజ్యంలో కార్యనిర్వహణకు పూనుకున్న వ్యక్తులు కొంత అనుభవం, విజ్ఞత గలవారు. పశ్చిమంగా విదేశీయు లను నిలువరిస్తే తప్ప కృష్ణ, పెన్న కావేరీ తీరాలు, జనాకీర్ణమైన ప్రాంతాలు ఆదినుంచీ, సురక్షితం కావు. సామ్రాజ్యానికి ఒక మూలగా రాజధానీనగరం వుండటంలోగల ప్రత్యేకత ఏమంటే పరిపాలన, రాజ్యవ్యవస్థా నిర్మాణంకన్న సరిహద్దుల అవతలి రాజ్యపు దండయాత్రల నరికట్టడమే ప్రధాన ప్రయోజనంగా భావించడానికి అనువుగా వుంటుంది. ఉచ్ఛదశలో సామ్రాజ్యం తుంగభద్ర, కృష్ణా నదికి దక్షిణంగా వున్న భారతమంతా వ్యాపించింది. కొంచెం పశ్చి మోత్తరంగా తుంగభద్ర, భీమనదుల మధ్యభాగంనుంచీ ఉత్తరంగా బహ్మనీలు తుగ్లక్‌లు తదితరులు. అయితే విజయనగర రాజ్యకాలం లోనే ఉత్తర భారతదేశంలో మరొక సామ్రాజ్యం పరిఢవిల్లింది. దాని పేరు "హరావతి" - బూంది, కోట సంస్థానాల ప్రాంతం.

పదునాలుగు పదహారు శతాబ్దాలు ఒకరకంగానూ, తరువాత చీలిపోయి మరొకరకంగానూ వ్యవహరించింది. అయితే వారు ముస్లిం దాడులను విజయనగరంవలె ప్రతిఘటించినట్లుగానీ విజయనగరంతో సంబంధబాంధవ్యా లున్నట్లుగానీ వ్యాప్తిలో లేదు. నడుమ విశాలమైన ముస్లింరాజ్యం, కృష్ణనుంచీ నర్మదవరకు. ఆపైన ఢిల్లీ సుల్తానులు. పరిసర ప్రాంతాలలోకి వ్యాపించిన సామ్రాజ్య విస్తరణతప్ప ఉత్తర భారతంలో అసంతృప్తి చెందిన రాజ్యాలతో చేతులు కలిపి విదేశీ చక్రవర్తుల నరికట్టడానికి ఎందుకు ప్రయత్నాలు జరుగలేదు? ఉత్తర భారతంనుంచీ వలసవచ్చినవారు విజయనగరస్థాపన వెనుకవున్నప్పుడు అటువంటి ప్రయత్నాలు తప్పక కొనసాగి వుండాలి. లేదా, స్థానికమైన యిబ్బందుల ప్రభావం బలవత్తరమై వుండాలి. మరొకవాదం, ఉత్తరాన హైందవరాజులు ముస్లిం ఆధిపత్యాన్ని అంగీకరించి దక్షిణ రాజ్యాలతో పొత్తుపట్ల నిరాసక్తులై వుండవచ్చును.

14. విజయనగరం ఉత్తరంవైపుకు వ్యాపించడానికి సుగమం తూర్పుతీరం. కృష్ణానది దాటి కొంత గోల్కొండ ధాటినెదుర్కొని ముందుకు సాగితే ఓఢ్రదేశం గజపతులు. తరువాత గోండ్వానా, మరొకవైపు బెంగాలు. కానీ కృష్ణరాయల దండయాత్రలు ఓఢ్రదేశపు సీమలతోనే ఆగిపోయాయి. అప్పటికీ రాజధాని కడుంగడు దూరమయింది. చరిత్రలో కృష్ణదేవరాయల ప్రశస్తికి ధీటయినరీతి మిగిలిన రాజుల గురించిన వివరణలో కానరాదు. ప్రౌఢరాయలు, నరసింహారాయలవంటివారు మినహా. బీజాపూరుపతనం కృష్ణరాయలు సాధించిన ఘనవిజయం. 1509 నుంచీ 1530 వరకూ అతని పరిపాలనలో సుమారు యిరువది దండయాత్రలు చేశాయి విజయనగర సైన్యం. రాయచూరు ముద్గల విజయం, గజపతుల ఓటమి ప్రముఖమైనవి. సామ్రాజ్యస్థాపన ప్రయోజనం గణనీయంగా సిద్ధించిన పాలనాకాలం. వ్యవసాయం, లలితకళలు, సాహిత్యం పెంపొందిన సమయం. అతని తరువాత విజయనగర పతనం ప్రారంభమయింది. ఇక్కడ చెప్పవలసిన విషయం రాయల సమయంలో అమాత్యులు సేనానుల ప్రాముఖ్యం. అత్యంత స్వల్పవయస్సులోనే సింహాసనం అధిష్ఠించి నలుబది నిండకుండనే పరమపదించిన రాయల ఆస్థానంలోని సలహాదారులు, సేనానుల చాతుర్యం, ఆలోచన, యిచ్ఛాశక్తి చరిత్రాత్మకమైనవి. రాయలు వయసులో ఎదిగినకొలదీ సామ్రాజ్య లక్ష్యాలను నిరంతరం దృష్టిలో వుంచుకుని మెలగిన అనుయాయుల ప్రాభవంమీద తన ఆధిపత్యం నిరూపించుకొనడానికి చేసిన ప్రయత్నాలతో సామ్రాజ్య పతనానికి బీజావాపం జరిగిందని చెప్పుకోవచ్చు. అతని చిరుత ప్రాయంలో ఆస్థాన అధికారులకు లభించిన స్వేచ్ఛ లేకుంటే ఆ సమయం భారతదేశ చరిత్రలో మరొకవిధముగా మలుపుతిరిగి వుండేదేమో. ఆ రీతిగా, ఇతర ఆధారాలను పురస్కరించుకొని, భారతదేశం రానున్న నాలుగు శతాబ్దాల పైచిలుకు స్వాతంత్ర్యం కోల్పోవడానికి కృష్ణరాయల కాలంలోనే అంకురార్పణ జరిగింది. అటు పోర్చుగీసుల రాక, మొగలు రాజ్యస్థాపన - దిగువకు కుదింపుతో రాజ్యం విచ్ఛిన్నమైంది. ఇక్కడ చెప్పుకోవలసిన విషయం ముస్లిం దాడులకు గురైన ఉత్తర భారత హిందూరాజులు, సైన్యాలు, ప్రజలను గురించి. ఎంత పెద్దఎత్తున మత పరివర్తన కొనసాగినా, అంతర్వివాహాలు జరిగి సంతతి జనించినా, లక్షలమంది సైన్యం బహ్మనీలకు అండగా శతాబ్దాల పర్యంతం కొనసాగడం ప్రజాచైతన్య భావనకు, స్వేచ్ఛాపిపాసకు, ధైర్యస్థైర్యాలకు ఒక మాయనిమచ్చ. పతనమైన రాజ్యాధిపతుల బాధ్యతా నిర్వహణభావానికి ఒక అప్రతిష్ఠ. మతం ప్రజలను ఐక్యపరుస్తుందనే వాదం హిందువులపట్ల నిజంకాదని రూఢి అయింది, కోట్లమంది ప్రజల ఆత్మశక్తి, యిచ్ఛ అణిగిపోయి వున్నప్పుడు, శత్రువులను నిర్జించడం కష్టం.

15. ఇక్కడ కొన్ని సామాజిక పరిస్థితుల నవలోకించడం అవసరం. విశ్లేషించడానికి కొంత గాఢమైన అధ్యయనం, పరిశీలన కావాలి. ఆదిలో కిష్కింధగా పేరొందిన యీ విజయనగర ప్రాంతంలో వాలి సుగ్రీవుల కథ తెలిసినదే. అధిక ఉష్ణోగ్రత, కొంత తేమ, దుమ్ము గల యీ ప్రాంతంలో నివసించే ప్రజలతీరు జీవనవిధానం అన్వయించుకోవచ్చు. రాయలు పెనుగొండలో ఎక్కువ వేసవికాలం గడిపేవాడని ప్రతీతి. ఆనాటి సమాజాలలో ముఖ్యమైన చిహ్నాలు అప్పటి గౌరవనీయమైన చరిత్రకు చెందినవిగానీ, ఆనాటి వర్తమాన జీవనసరళిలో ప్రముఖమైనవిగానీ అయివుండాలి. విరూపాక్షుడు శివుడు. నరసింహుడు అవతారం. సర్పం, మర్కటం ప్రాకృతికమైన యితర చిహ్నాలు. రాజుల పేర్లన్నీ యివే... తిమ్మరాజు, నరసింహారాయలు, తిప్పవీరభద్ర...యిలా వుంటాయి. కొన్ని పేర్లు ఎక్కువ ఉత్తరకాలానికి చెందినవి సాంస్కృతీకరణ చెందినవి. పూర్వపు రాజులపేర్లు తద్భవాలుగానీ అచ్చికాలుగానీ, వీరంతా కత్తిబట్టి, హలంబట్టి జీవితం గడిపినవారు. ఇతర ప్రాంతాల వ్యవహారాదులు, ఇంతకుపూర్వపు సామ్రాజ్యాలలో పదవులు నిర్వహించినవారికి తప్ప తెలిసివుండే అవకాశంలేదు. దేశంలోని ఐక్యభావన - వేదాలు, అద్వైత విజయం, త్రిమూర్తులు వారి అవతారాల ఆరాధన, జ్యోతిష, వ్యాకరణ, వాస్తు యిత్యాది శాస్త్రఅధ్యయనం వలన మాత్రమే కొద్దిమందికి పరిమితమై వున్నది. ఆనాడు రాజుల అధికారం అకుంఠితం అయినందున ప్రజల విశ్వాసం రాజుపట్ల, రాజ్యసీమలపట్లనే. జాతీయభావన పరిమితమైనది. రాజపుటానా రాజ్యముల లొంగుబాటు, సింధు గంగా తీరాలవెంబడి ముస్లింల ఆక్రమణలతోనే కొంతవరకు భవిష్యం నిర్ధారితమైపోయింది. విజయ

నగరానికి వున్న అవకాశం తక్కువ. మాళ్వ, మేవారు రాజ్యాలు తోడైతే చరిత్ర మరొకవిధంగా మలుపులు తిరిగేది.

16. గ్రంథస్థం, ప్రచురితమూ అయిన చరిత్రల విచారణలో యిప్పటివరకూ విజయనగర అధికారుల వివరాలు తగినరీతిగా లభ్యం కావడంలేదు. రాయవాచకంలోనూ, కొన్ని కావ్యాప్రశస్తులలోనూ పేర్లు గోచరిస్తాయి. కత్తిసాములు, గరిడీలు, మల్లయుద్ధాలలో ఆరితేరిన జోదులున్నారు. వేదపారంగతులు, కమనీయ కవితామూర్తులు, శబ్దాధికార సంపన్నులు, కార్యకారణ సమన్వయాధిపతులు, చిరంతన ఉత్తేజపూరిత శిల్పకారులు, అందరినీ మించిన మేధావంతులైన మంత్రి పుంగవులు - ఎందరో, చెప్పదలచిన విశిష్టమైన విషయం...విదేశీయుల దాడులతో పెచ్చరిల్లిన కల్మష భయమాత్సర్యపూరితమైన విద్రోహ కరమైన వాతావరణంనుంచి సత్యస్వరూపం వెలార్చి, ధైర్యస్థైర్యాలు ప్రోదిచేసి సమాజాన్ని సంఘటితం చెయ్యడానికి జరిగిన ఒక ప్రయత్నం. విజయనగర సామ్రాజ్యం. వాగనుశాసనుని పరంపర నిరంతరాయంగా కొనసాగిన శాబ్దిక నైపుణ్యం పుణికిపుచ్చుకున్న దేశసంస్కృతీ వృక్షాల కాలవాలములు అయిన ధీశాలురు గణుతికెక్కిన సమయం. వైరితలలు వేసిన భౌతికవాదాన్ని ఖండించి ఆదర్శ సిద్ధాంతం, నిగ్రహ నిల్వగరిమను ఉగ్గడించిన సమయం. సర్వజన హితంకోసం శక్తిపంతులు 'కార్యకారణ' నిర్వహణ దక్షులను సమాజంలో ఉన్నతికి కొనిపోయిన సత్యయుగం. హిమాలయ, హిందూ సముద్ర నడిమిభాగాన్ని ఏకఖండంగా అనాదిగా నిలబెట్టిన ఒకానొక అంతర్వాహిని పెల్లుబికి అధికార వ్యవస్థను నిర్వహించిన మహత్తరయుగం. వట్టిమాటలు గావు, అర్థవంతమైనవే. అయినా దురదృష్టం. పతనం కావలసిన జాతి యదార్థంముందు తలవంచక, కుట్రలద్వారా అసత్యపు మాయాజాలం పెచ్చరిల్లజేసినందున చరిత్ర బానిసత్వంలోకి జారిపోయింది. తంజావూరు, మధుర నాయకరాజుల సమయంలో కొంత సంప్రదాయం నిలుపబడింది. కానీ సూరత్, మచిలీపట్టణం, గంగైకొండ చోళపురం, మదరాసు ప్రాంతాలలోకి చేరిన నౌకలలోని వ్యక్తులు మొగలు దర్బారు విశేషాలు తెలిసినవారు. శతాబ్దాలు ప్రశాంతజీవనం గడుపుతూ భయాందోళనా పూరితమైన వాతావరణంలోకి నెట్టబడినవారితో వ్యవహారం విదేశీయులకు సులభ సాధ్యం. నాటి హైందవరాజులందరూ చిరకాలం కొనసాగిన ముస్లిం రాజవంశాల సంపర్కంవలన శారీరక మానసికతత్వాలు మారిపోయి అలసభావం, నిరసన, ప్రజావ్యతిరేకతలలో ఎటువంటి సవాళ్ళను ఎదుర్కొనేందుకు సన్నద్ధులుగాక పరాజితులై ప్రజలపట్ల తమ కర్తవ్యాన్ని నిర్వహించలేకపోయారు. మరాఠా సామ్రాజ్యం, రాజపుత్ర సంఘటన కొంత పనిచేసినా నిలువలేకపోయాయి. ఫలితంగా ఆంగ్ల సామ్రాజ్యం నెలకొన్నది. విజయనగర వారసులు కకావికలై విశీర్ణ జీవనానికి లోనైనారు. వారన్‌హేస్టింగ్సు కాలంలో కొన్ని విజ్ఞప్తులు చేసుకున్నారు. ఇరువది శతాబ్దపు ఆరంభం వరకూ వారి వంశాలవారు సంస్థానాధిపతులుగా వున్నట్లు చరిత్ర, నాయకరాజులు, వారి సమాజాలు, పాళెగాండ్రు - పాశ్చాత్యుల వ్యూహాలకు ఎదురు నిలువలేకపోయారు.

17. శరభోజి మహారాజుమీద వ్యక్తిగతంగా అత్యంత గాఢమూ, తత్రమూ అయిన ప్రభావం నెరపిన ఆంగ్లేయ మత ప్రపక్త గురించి సాధారణ పాఠ్యచరిత్ర గ్రంథాలలో వివరాలు కానరావు. బెంగాలు, కర్ణాటక నవాబుల నోడించడంతప్ప వేరుమార్గం లేదని హిందూసమాజం భావించవలసి వచ్చింది. తత్ఫలితంగా ఆంగ్ల సామ్రాజ్యంలో కొంతమంది భారతీయులకు ఔన్నత్యం ప్రాప్తించింది. ప్రాచీన జనావాసాలవెంబడి మతపరమైన పల్లెలు ప్రత్యేకంగా నెలకొల్పారు. దానితో ప్రజలు తమ తమ మతవిశ్వాసాలు, వ్యవసాయ భూములు, పశువులు, కుటుంబ వ్యవస్థలకుచెందిన కలహాలకు లోనయి ప్రభుత్వంమీద ఒత్తిడులుతగ్గి విదేశ పరిపాలన ప్రశాంతంగా కొనసాగింది. ఓడిపోయిన ముస్లిం నవాబులు వారి అనుయాయులు ప్రజలు కొంత కృంగిపోయారు. ఒక్క నిజాం నవాబు మాత్రం గోల్కొండ వారసుడుగా ఆంగ్లేయుల సహకారంతో అధికారంలో వుండిపోయాడు. కందనవోలు నవాబు పాత్రకూడా పరామృష్టం చెయ్యవలసినదే. ఆంధ్రలో రాజభరణాలు పొందిన రాజులు వీరిరువురే! స్వాతంత్ర్యానంతరం ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. కందనవోలు పిమ్మట హైదరాబాదు రాజధానులుగా ఉచితమైన తీరు.

18. మొగలు రాజ్యస్థాపనా కాలానికి విజయనగరం అత్యున్నత స్థితిలో వున్నది. మొగలు సామ్రాజ్యం విస్తరించే సమయానికి విచ్ఛిన్నమైపోయింది. బహ్మనీలవలె అనేకరాజ్యాల కూటమిగా తయారయింది. దక్షిణాపథాన కాలూనడం తేలిక అని తోచిన ఆంగ్లేయులు, తదితర పాశ్చాత్యుల ప్రభావం దేశవ్యవస్థయొక్క సత్యస్వరూపాన్ని అణచివేసింది. విదేశీయులదే సత్యమయింది. నవాబులందరినీ తుదముట్టించి దేశం మొత్తంమీద ఆధిపత్యం నెలకొల్పిన కంపెనీవారికి ముస్లింలకు ప్రాభవం నెరపే అవకాశం కల్పించవలసిన అవసరం కలిగింది. ఇంగ్లండులో కూడా తీవ్రమైన మార్పులు వచ్చాయి.

లండన్ వ్యాపారస్థులు, సముద్రతీర నావికులు, భూస్వాములు వెనుకంజ వేశారు సాంకేతికవేత్తలు, విద్యావంతులు, ప్రభుత్వోద్యోగులు, విశ్వవిద్యాలయాలు బాంకింగ్ వ్యాపారంలో వారు గౌరవ ప్రతిపత్తులు, ధనసంపద గడించారు భారతదేశం బ్రిటిష్ ప్రభుత్వపరమైంది విద్య ఉద్యోగాలు, స్వతంత్రభావన — వీటితో స్వాతంత్ర్యం సిద్ధించింది అయితే దేశంలో ఒక భాగం పాకిస్తాన్‌గా ఏర్పడింది స్వాతంత్ర్యానంతరం నలుబది వర్షాలు గడిచాయి స్వాతంత్ర్యయోధులు ఒక తరం రాజకీయాధికారంతోనే గడిచిపోయారు ఆంగ్లేయుల కాలంలో ప్రాభవం నెరపి సంపదలార్జించిన వారికి స్వాతంత్ర్యానంతరం ఎన్నికలు ప్రజాస్వామ్యం నూతనావకాశాలు చూపించాయి అదే పరంపర కొనసాగింది ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు కూడా యింకా ఐ సి యస్ వర్గాలకు చెందిన వారి కుటుంబాలకు, ఆంగ్లేయులలో అధికార స్థాయిలో సన్నిహిత బాంధవ్యం కలవారికే సంక్రమిస్తున్నాయి విశ్వవిద్యాలయాలలో పదవులకు కూడా పాశ్చాత్యులతోడి సంబంధాలు నెమరువేసుకుంటే తప్ప లభించనిస్థితి తీవ్రమైంది ఇదంతా స్వాతంత్ర్యం అనుకోవాలి

19 దేశవ్యవస్థయొక్క స్వతంత్రభావన వైయక్తికమైన అస్తిత్వమూ విశిష్టత వెనుకాల వున్న సత్యస్వరూపం మరుగుపడి, జీవనవాహిని యింకిపోతూ వున్నది అవ్యవస్థ, నిరంకుశ ధోరణులు పెచ్చరిల్లాయి యదార్థానికి పదునెనిమిదివ శతాబ్దపు నడిమిభాగంలో కన్న తీవ్రమైన అంతఃకలహాలతో నేడు దేశం సతమతమవుతున్నది వేయి సంవత్సరాల పరుల పాలన దాని ప్రభావం ఎలా అంతమవుతుంది కష్టమే అయినా కృషిచెయ్యక తప్పదు గదా! విజయనగర పతనంతో మరుగుపడిన ఒకానొక భారతీయ లక్షణం, తెరవెనుక గోచరమవుతున్నప్పటికీ, ముందుకు స్పష్టంగా రానంతవరకూ చరిత్ర భారమే

---

# భూగ్రహణం

## శ్రీ వెంపరాల సుబ్బారావు

భూభేకాన్ని
సాగర విషోరగం కబళిస్తోంది
ప్రభాకరుడేమయినా రక్షిస్తాడని
మొఱలిడుతూ అది అతనిచుట్టూ
ప్రదక్షిణం చేస్తోంది
భయంలేని భుజంగం
పట్టు విడువదు – పారిపోదు
దివాకరుడు, దేవతలు
నిస్సహాయులై చూస్తున్నారు.

సాగరాహి గ్రక్కిన ఫేనమణి నికరం
ఆకసంలో రిక్కలు,చుక్కలు జేడుఅయి నిలిచాయి
సూర్యచంద్రులను
రాహువు కబళిస్తూ
భూలోకవాసులకు అప్పుడప్పుడు కనిపిస్తే
భూగ్రహణం
నాకవాసులకు
దినం దినం కనిపించి
వారిని అనిమిషులను చేస్తోంది

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# మహబూబ్ నగర్ జిల్లాలోని ప్రాచీన రాజధానులు

నేటి మహబూబ్‌నగర్ జిల్లా ప్రాంతానికి పూర్వం ములికినాడని పేరు. ములికి "ముళక" యొక్క రూపమని పరిశోధకుల మతం. గౌతమీపుత్ర శాతకర్ణి నాసిక శాసనంలో అశ్మక - ముళక - సౌరాష్ట్ర - కుకుర - అపరాతిక - అనూప - విదర్భ - ఆకర - అవంతి - అనే దేశాలు పేర్కొనబడినవి.

కీ. శే కుందూరి ఈశ్వరదత్తుగారు తమ ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళంలో శాతవాహనులనాటి "ముళక" పేరు తరువాతి "ములకనాడు" పేరు. ఇది కడప మండలం లోని మున్నూటి అన్నారు. ఇదిగాక శ్రీనాథుడు తన చాటువులలో పేర్కొన్న ములికి విషయం గుంటూరు జిల్లాలోని పల్నాటికి చెందుతుంది. తెలంగాణా లోని పాలమూరు జిల్లా ప్రాంతంలో పరిని మొలకకట్టి అలుకుతారు గాబట్టి దీనికి మొలకసీమ అని వ్యవహారం ఏర్పడిందని కీ. శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగా రభిప్రాయపడినారు. నల్లమలయొక్క వాలభాగం చొచ్చుకొని వచ్చి పాలమూరు జిల్లా భాగం అరణ్యమయమైన వన మూలికలకు నిలయంగా ఉన్నది కాబట్టి దీనికి మూలికాసీమ అని వ్యవహారం అని ప్రాంతీయులైన పెద్దల మతం

అయితే ఈ ముళక, ములకనాడు - ముల్కి విషయం - మొలకసీమ - మూలికాసీమ అన్ని కలసి ఒకే పెద్ద భూభాగంగా ఉండేవో లేదా వేరువేరో మనకిపుడు స్పష్టమైన సీమా విభాగాలు లభించవు కాని బ్రాహ్మణంలో ములికినాటి వారి యిండ్ల పేర్లన్నీ నేటి నల్లగొండ - పాలమూరు జిల్లాలలోని గ్రామాలకే చెందుతవి.

నైజాం కాలంలో ఈ జిల్లాలో కొల్లాపురం - గద్వాల - వనపర్తి వంటి సంస్థానాలు వెలసినవి కాబట్టి దీన్ని సంస్థానాల జిల్లా అన్నారు.

ఈ జిల్లాలో సంస్థానాల కాలం నుండే గాక అంతకు మొదటి నుండే కోడూరు - కందోరు వడ్డవాని మొదలైన రాజధానులెన్నో వెలసినవి కాబట్టి వానిని గురించి స్థూలంగా పరిచయం చేయటం ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యం.

నేటి పాలమూరు జిల్లా ప్రాంతానికి చాళుక్యుల కాలం నాడు కోడూరు మున్నూటి అని వ్యవహారం. ఈ జిల్లాకు పూర్వం ఆ పేరే ఉన్నట్టు అమరాబాదు పీఠభూమి యొక్క సంస్కృతిపై పరిశోధన డా. పాల్‌గారు గూడ అంగీకరించినారు.

కోడూరు - పూర్వం ఒకపుడు మున్నూటినాటికి కేంద్రమైన ఈ గ్రామం ఇపుడు మహబూబ్‌నగర్ నుండి "మక్తర్" రోడ్డుపై ధర్మవరం స్టేషన్ దగ్గర ఒక సామాన్యమైన గ్రామంగా మిగిలింది. దీని పరిసరంలో "కెయిరను" లనబడే పూర్వకాలము సమాధులున్నవి గాబట్టి దాన్నిబట్టి ఇది చాలా ప్రాచీన గ్రామమని తోస్తుంది. ఏఱువ మండలం నుండి నల్లగొండ పాలమూరు జిల్లాలకు తరలివచ్చిన ఏఱువ చోళులకిది తొలిరాజ రాజధానిగా ఉన్నది.

పూర్వం ఏఱువనాడు ఇప్పటి నెల్లూరు జిల్లాలోని పొదిలి - ధర్మి - కడప - కడప జిల్లాలోని బద్వేలు - సిద్ధవటం - కర్నూలు జిల్లాలోని మార్కాపురం రాజంపేట తాలూకాలోని కొంత భాగంగా ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళంలో చెప్పబడింది. అక్కడి నుండి వారీ ప్రాంతానికి వలస వచ్చినారు.

చోళులు తమిళ దేశం వారు తెలుగు దేశంలో వ్యాపించి వారి శాఖలు కరికాలుని తమ మూల పురుషునిగా చెప్పుకొన్నవి. ఏఱువ చోళులు గూడ ఆ మాట చెప్పుకున్నారు.

తెలుగు దేశానికి వచ్చిన చోళులు మొదట రేనాటిలో స్థిరపడ్డారు. ఇది నేటి కడప మండలంలో ఒక భాగం. అక్కడ స్థిరపడిన పిమ్మట వారు చాళుక్యులతో సంబంధ బాంధవ్యాలు కలిసి వారికి సామంతులైనారు.

చాళుక్యులలో తూర్పు పడమర భేదాలేర్పడిన పిమ్మట పశ్చిమ చాళుక్యులకు రాష్ట్రకూటులకు రాజ్యం కొరకు చాలా యుద్ధాలు నడిచినవి. అపుడు వానిలో రాష్ట్రకూటుల వైపునుండి వైదుంబులు చాళుక్యులవైపు నుండి చోళులు ప్రముఖపాత్ర వహించినారు. ఈ

యుద్ధాలలో క్రీ. శ. 971 ప్రాంతంలో వైదుంబులు విజృంభించి చోళవాడి నాక్రమించుకున్నారు. దీనికి "చోళవాడికయ్యాము"ని పేరు. దీని పర్యవసానంగా చోళులు వివిధ ప్రాంతాలకు వెళ్ళి స్వతంత్ర రాజ్యాలేర్పరచుకున్నారు.

రాజులేదైనా క్రొత్త ప్రదేశానికి వెళ్ళి గ్రామాలు స్థాపించినపుడు వానికి తమ పూర్వపు రాజధానుల పేర్లు పెట్టడంలో వింత ఏమీఉండదు కాబట్టి పాలమూరు జిల్లాలోని ఈ కోడూరును చోళులే స్థాపించినారనవలె ఈ ప్రాంతంలో సూగూరుకు సూగూరు కందూరుకు కందూరు ఉన్నవి.

తమిళ చోళులు ఒరయూరు పురాధీశ్వరులైతే తెలుగువారు కోడూరు పురవరేశ్వరులు. ప్రాచీన చోళుల కథలలో కలుపొన్న పూయటం, కలుకోడి కూయటం ఉండి కాబట్టి వారికి ఈ కోడి సంబంధమేమిటో చరిత్రకారులకింకా అందలేదు.

"కోడు" అంటే పల్లం కాబట్టి పల్లపు నేలలో వెలసిన గ్రామాలన్నీ కోడూరువే అవుతవి. అందుచేత మొదటి కోడూరు ఏవిధంగా ఏర్పడిందో చెప్పలేం గాని తరువాతివి దాని నామప్రశస్తి చేతనే ఏర్పడినవనుకోవలె. చరిత్రలో ఇపుడు మనకు అయిదు కోడూరులు కనిపిస్తవి. వానిలో రెండు కడప జిల్లాలోనే ఒకటి రాజంపేట, మరొకటి జమ్ములమడక తాలూకాలలో ఉన్నవి. మూడవది కృష్ణాజిల్లా లోని గుడివాడ తాలూకాలో, నాలుగవది గుంటూరుజిల్లా లోని బాపట్ల తాలూకాలో ఉన్నవి. గుడివాడ లోని గ్రామానికి అనవోత పురమని, బాపట్లలోని గ్రామానికి అతని సోదరుని పేర అనవేమ పురమని నామాంతరాలు. ఈ అనవేమపురం కాలాంతరంలో "బ్రాహ్మణ కోడూరు" అయింది.

చరిత్రలో ఈ విధంగా ప్రసిద్ధమైన కోడూరులు చాలా ఉన్నవి కాని వీనిలో రాజంపేట తాలూకాలోని గ్రామంలోనే చోళులకు ఎక్కువ సంబంధం కనిపిస్తుంది. వారక్కడి నుండి వచ్చిన తరువాత ఈ జిల్లాలో తాము స్థాపించిన గ్రామానికి "నవకోడూరు" అని నామకరణం చేసినారు. దీనికిగల ఈ పేరు గంగాపురంలోని ఒక శాసనంలో పేర్కొనబడింది.

ఈ నవకోడూరు వైభవంగా ఉన్న దినాలలో ఇక్కడ స్వయంభూదేవుడైన సోమనాథ దేవర వెలసినాడు. పంచమఠ స్థానాలున్నవి. ఆ దేవరకు, పంచ మఠాలకు ఎందరో దానాలు చేసినారు. మరొకటి. చోళులలో గోకర్ణనాములు చాలామంది ఉన్నారు. జడ్చర్ల శాసనంలో "కోడూరు గోకర్ణ సింగరూకలు" పేర్కొన బడినవి. దీనినిబట్టి చోళులు చాళుక్య సామంతులైనా స్వతంత్రమైన నాణేలు నడుపుకునే అధికారం కలిగి ఉన్నారని తెలుస్తుంది.

చోళులలో ఈ నాణేలను ప్రవేశపెట్టిన గోకర్ణుడు ఎన్నవవాడో తెలియదు కాని జడ్చర్ల శాసనం దాదాపుగా ఈ ప్రాంతంలో వారి చివరి దినాలనాటిది కాబట్టి కోడూరి పేర చలామణి అయిన ఈ నాణేలకు మొదటి టంకశాల అక్కడనే ఉండవచ్చు. ఈ విధంగా "కోడూరు" చరిత్రలో ఒక ప్రత్యేక స్థానం కలిగి కనిపిస్తుంది.

ఇపుడు కోడూరులో గ్రామం నడుమ చాళుక్య స్త్రీలు అగ్ని ప్రవేశం చేసిన స్థలంగా చెప్పబడుతున్న "బిందెం" అనే చోటుంది. ఇటువంటి అగ్నిగుండం ఒకటి ఇంద్రకల్లులో గూడ ఉంది - అంతేగాక ఊరిలో ఒక ఎత్తయిన అరుగుమీద వీరుల విగ్రహాలున్నవి. వానిని బట్టి ఇది ఎపుడో ఒక తుముల సంగ్రామం జరిగిన స్థలమని తెలుస్తుంది. ఈ గ్రామంపై చాళుక్య సేనాపతి మన్నెం తిప్పయ్య దండెత్తి దీన్ని దహించి ఈ ప్రాంతంలో శాసనస్తంభం ఎత్తించినట్లు చరిత్ర పరిశోధకులైన శ్రీ. పి. పరబ్రహ్మశాస్త్రిగారు చెప్పినారు కాని ఈ తిప్పయ్య ఏకాలంవాడో తెలిసి రాలేదు. భయంకరమైన ఈ దండయాత్ర పిమ్మటనే ఈ నవకోడూరు రూపుమాసి నేటి కోడూరుగా మిగిలింది. చోళులక్కడి నుండి వెడలిన తరువాత కందూరిని తమ రాజధానిగా చేసికొని కందూరి చోళులైనారు.

2. కందూరు - ఈ గ్రామం ప్రస్తుతం వనపర్తి తాలూకాలో ఉంది. బూదపురం వనపర్తి రోడ్డున శాగాపురం దగ్గర దిగి గ్రామం లోనికి రెండు కిలోమీటర్లు నడువవలసి ఉంటుంది. ఏడవ భీమచోడుడు చాళుక్య త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యునికి యుద్ధరంగాలలో తోడ్పడి అతనిచేత క్రీ. శ. 1076-77లో ఈ మండలాధికారాన్ని పొందినాడు.

చోళులిక్కడికి వచ్చేనాటికి ఇది మరొక మున్నూటి. వారు దీన్ని రాజధానిగా చేసికోగా కోడూరి మున్నూటి తన ప్రసిద్ధిని కోలుపోయి దీనిలో లీనమయింది. అపుడు దానితోపాటు మరికొన్ని కూడ కందూరునాడులో కలిసి అది "పదకొన్నూటి" అయింది. ఆనాడు కందూరు పదకొన్నూటి ఎల్లలు దూరదూరంగా వ్యాపించినవి. ఈనాటి అచ్చంపేట తాలూకాలోని "లింగాల" ఒకపుడు కందూరి మండల స్థలంగా చెప్పబడింది.

కందూరు పాలమూరు జిల్లాలో ఈనాడు కదంబ వృక్షాలకు ప్రసిద్ధి. అవి యిక్కడ తప్ప తెలంగాణంలో మరెక్కడా లేవు. ఈ వృక్షాలు శ్రావణంలో పుష్పిస్తవి కాని మధ్యప్రదేశ్‌లోని బీహార్ రాష్ట్రంలో ఉండే కదంబ వృక్షాలకు వీనికి ఆకారంలోను పూతకాతల లోను భేదం ఉంది.

పూర్వం ఈ గ్రామంలో ఏకోత్తర శతలింగ ప్రతిష్ఠ ఉండేదట. కాని ఈనాడా శివలింగాలు మిగులలేదు. గ్రామం వెలుపల గల గుట్ట

క్రింద రామలింగేశ్వరాలయం మాత్రం మిగిలింది అది ఈ ప్రాంతంలో ప్రసిద్ధిచెందిన ఆలయం. సాధారణంగా శివలింగ ప్రతిష్ఠ సోమ సూత్రంపై ఉంటుంది కానీ ఇక్కడ అది ఒక రథ చక్రంలో ఉంది. అభిషేక సమయంలో మనం ఎంత నీరు పోసినా అది బయటకు రాదు. చక్రంలోనికే పోతుంది. ఇది యిక్కడి ప్రత్యేకత- ఈవిధంగా అభిషేకజలం సోమసూత్రం లోనికే పోవటం అలంపురంలో గూడ ఉంది-

ఇదిగాక ఇక్కడ గ్రామంలో ఒక చెన్నకేశవాలయం ఉంది. దాని విమానం ద్రావిడ పద్ధతిలో కట్టబడింది ఇటువంటి విమానం ఈ జిల్లాలో మరొకటి లేదు.

చోళులు దీన్ని రాజధానిగా చేసుకున్న తరువాత దీనికి బలమైన ప్రాకారం కట్టించినారు. దాని అవశేష కుడ్యం ఇపుడు అక్కడ రంకుల గుట్టపై ఉంది. రాజుల యొక్క కోట మాత్రం పూర్తిగా శిథిలమయిందికాని గ్రామంలో మాత్రం ఘారి కాలంలో త్రవ్వించిన చేదబావులింకా సజీవంగా ఉన్నవి.

వనపర్తి ప్రభువు పెద్దరామేశ్వర రాయలవారి భార్య ఈ గ్రామపు టాడుపడుచు. అందుచేత ఇది సంస్థానాల కాలంలోగూడ దర్జాగానే ఉన్నది. ఈ గ్రామంలో ఎక్కడ త్రవ్వినా శివలింగాలు మరేవో శిల్పాలు లేదా చోళులనాటి మరేవో అవశేషాలు బయలు పడుతూ ఉంటవని గ్రామస్థులు చెబుతుంటారు.

3. గంగాపురం - పాలమూరు జిల్లాలో ఇది తరతరాల చరిత ఉదరాన జీర్ణించిన ప్రాచీన నగరం దీనికి మాయాపురం - మత్స్య పురం - దురిత కోలాహలం - గంగాపురం అని నాలుగు యుగాలలో నాలుగు పేర్లుండెనట. ప్రస్తుతం ఈ గ్రామం జడ్చర్ల నుండి కలువకుర్తి రోడ్డుపై ఉంది.

ఈ గ్రామంలో ప్రధాన దైవం గంగేశ్వరుడు. అతని పేరనే ఇది గంగాపురం అయింది కాని ఆ స్వామినెవరు ప్రతిష్ఠించినారో తెలియదు. అనంతకాలంలో ఇక్కడ వీర హోంబాళుడను పేరుగల చాళుక్య పెర్మాడిరాయడు గండకాద్రికి వెళ్ళి చెన్నకేశవస్వామిని తెచ్చి ప్రతిష్ఠించినట్లు గంగాపుర మాహాత్మ్యం చెబుతుంది కాని ఇక్కడి కేశవ దేవర శాసనాలలో అతనికంటే చాలా మొదటినుండే త్రైవిలోక్య మల్లుని కాలంనాటికే కనిపిస్తున్నాడు. ఈ మహారాజు క్రీ.శ 1043-68 నడుమ రాజ్యాన్ని పాలించినాడు,

తెలుగు చోడుడైన జటాచోడ భీముడు వేంగి న్నాక్రమించి దాన్ని అనాయకం చేసినపుడు తెలుగు దేశానికంతా ఇదే రాజధానిగా ఉన్నది. ఆ తరువాత ఆరవ సోమేశ్వరుడైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు తన రెండవ కుమారుడైన తైలపునికి కోడూరు మండలాన్ని కుమార వృత్తిగా ఈయగా అతడి కుడినుండే ఆ మండలాన్ని పాలించినాడు.

విక్రమాదిత్యుని పిమ్మట అతని పెద్దకొడుకు భూలోకమల్ల సోమేశ్వరుడు సింహాసనం ఎక్కినాడు. అది చూచి తెలంగాణా ప్రాంతానికి కుమార తైలపుడు క్రీ.శ. 1187లో గంగాపురంలో స్వతంత్రంగా పట్టాభిషేకం చేసుకున్నాడు. అపుడు అన్నగారైన సోమేశ్వరునికి రాజ్యక్షేమాన్ని కోరి తమ్ముని బంధించవలసి వచ్చింది. అతనిపైకి కాకతి రెండవ ప్రోలరాజును పంపినాడు.

ఆనాడు కాకతి ప్రోలరాజుకు ఈ తైలపునికి జరిగిన చారిత్రాత్మకమైన యుద్ధం నాగర్‌కర్నూలు తాలూకాలోని నేటి "పాపకల్లు" దగ్గర జరిగింది. ఆ యుద్ధంలో ప్రోలుడు తైలపుని ఓడించి బంధించి సైనిక పర్యవేక్షణలో కళ్యాణికి పంపినాడు. ఈ యుద్ధ కారణంగా కొందరు పాపకల్లును "పాపికల్లు" అంటారు

పాపకల్లులో ఈనాడు ఆనాటి యుద్ధ చిహ్నాలయిన వీరగల్లులు అశ్వగల్లులు వానిపై చిన్న చిన్న శాసనాలు గూడ కనిపిస్తవి. వైభవంగా ఉన్న దినాలలో గంగాపురం చాలా పెద్ద పట్టణం. ఆనాడు దానికి నాగర్‌కర్నూలు తాలూకాలోని నేటి సిరసవాడ శిరోవాటికగా ఇంద్రకల్లు యజ్ఞభూమిగా ఉండేవని చెబుతారు అవిధంగా వైభవంతో వెలిగి ఈ జిల్లాలో ఇది తనకొక మాహాత్మ్యాన్ని సృజించుకొన్న గ్రామం.

4 అవంచ - కుమార తైలపుడు కోడూరు మండలాన్ని పాలించిన కాలంలో ఇది ఈ మండలంలో వెలసిన అతని రెండవ రాజధాని పురం. ప్రస్తుతం ఇది జడ్చర్ల నుండి అచ్చంపేట సర్వీసు రూటులో ఉంది,

చాళుక్యుల కాలంలో ఇదిగూడ వైభవంగా వెలిగిన గ్రామమే. ఇక్కడ మీనాంబరి నదీతీరంలో నాలుగు పెద్ద పెద్ద చాళుక్య రాజ భవనాలుండేవి. ఈనాడవి లేవు. శిథిలమైపోగా వాని శిలలు గ్రామస్థు లుపయోగించుకున్నారు. ఆ భవనాల ముందు నిలుపబడిన రాతి ఏనుగుల జతలు మాత్రం ఇపుడూరిలో దిక్కు దివాణం లేకుండా పడిఉన్నవి

ఇవి క్రీ.శ. 1424 వరకు రాజధానిగా ఉన్నది. రాచకొండ ప్రభువు - లింగమనేడు విజయనగర పాలితాలైన కొండవీడు - కర్నూలు పట్టణాలు ముట్టడించినపుడు అదే దండయాత్రలో పెద్ద వర్ధమాను - మామిడాల - గంగాపురం - అవంచ దుర్గాలను స్వాధీన పరుచుకున్నాడు అని వెలుగోటివారి వంశావళి చెబుతుంది. లింగమనేని

కాలంలో దీన్ని చెన్నరాజు రాఘవరాజు లనేవారు పరిపాలిస్తున్నారు. వీరెవరో తెలియదు కాని ఈ తరువాత దీన్ని కొంతకాలము మధ్వ ప్రభువులు పాలించి చివరిదశలో ఈ పరగణాను లోకయపల్లె దొరలకు అమ్ముకున్నారు.

5. వడ్డవాని - ఇదిపుడు నాగర్ కర్నూలు తాలూకాలో కేంద్రానికి పది కిలోమీటర్ల దూరంలో సర్వీసు రూటులో ఉంది. ఒకప్పుడిది ఐన్నూటికి కేంద్రం.

"వడ్డ" కన్నడ పదం: అది వృద్ధి వాచకం కన్నడదేశంలో వడ్డారాధన ఉంది. కాబట్టి "వడ్డ + అవని" వడ్డవాని అయింది యాదవ + అవని = యాదవాని గూడ ఈలాగే ఏర్పడింది.

ఈ ప్రాంతంలో కోడూరి మున్నూటి, కందూరి మున్నూటే గాక, ఎత్తపి తొంబది, ఆమన కంటిడెబ్బది, కక్కుళం ముప్పది - కూళకిళియ పదమూటి - రేబళియపది - నర్వతొమ్మిది వంటి చిన్న చిన్న ప్రాంతాలు చాలా ఉండేవి కాబట్టి వానిలో ఇది పెద్దదైనందున "వడ్డవాని" అయింది. ఈ గ్రామం క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దం నుండి శాసనాలలో కనిపిస్తుంది. దీని పేరుమీదనే అనంతర కాలంలో ఆత్మకూరు తాలూకాలోని వడ్డవాని గ్రామాలేర్పడినవి.

వెలుప చోళులలో కందూరు పిమ్మట ఉదయన చోడుడు అతని కుమారులు భీమ గోకర్ణ చోడులు ఇక్కడి నుండి కందూరు నాడును పాలించినారు వారి కాలంలో ఇది లంకా పట్టణం వలె ఎంతో సుందరంగా ఉన్నది. ఇక్కడి భీమ చోడునిపై కాకతి రుద్రుడు దండెత్తి నగరాన్ని దహించినాడు. దానితో దీని వైభవం తరిగింది అయినా ఆ తరువాత కాకతీయ సామంతులుగా దీన్ని గోనమల్యాల వంశీయులు మళ్ళీ చాలాకాలం పాలించినారు గోన గణపరెడ్డి దీన్ని మంత్రియైన భీమనప్రగడ సహాయంతో పునరుద్ధరించి ఇక్కడ ఎన్నో ప్రతిష్ఠలు చేసినాడు. అతడిక్కడి నుండి పాలిస్తూనే ఇప్పటి వనపర్తి తాలూకాలోని గణపురాన్ని స్థాపించి అక్కడి కోటను కట్టించినాడు. దీన్ని పాలించినవారిలో ఇంకా మల్యాల గుండయ గోన గన్నయరెడ్డి చెప్పదగినవారు గన్నయరెడ్డి ఇక్కడ నుండి పాలిస్తూనే రాయచూరు కోటను కట్టించినాడు

ఇక్కడి ప్రభువులలోని భీమ గోకర్ణులను తీసుకొని శేషాద్రి రమణ కవులు "వసుంధర గన్నయరెడ్డిని తీసుకొని అడివి బాపిరాజు గారు "గోనగన్నయ" అనే నవలలు రచించినారు.

గణపురంలో గల కోటపై అల్లావుద్దీను ఖిల్జీ దండయాత్ర చేసినట్లు స్థానికులు చెబుతారు. అతని దండయాత్రలు తెలుగుదేశంపై క్రీ.శ. 1304 నుండి 20 నడుమ జరిగినవి కాబట్టి దీనిపై అతని దాడి దాదాపుగా క్రీ.శ. 1310 ప్రాంతంలో జరిగి ఉండవచ్చు నంటారు. ఈ దాడి తరువాత గణపురం ప్రతిభ మాసింది. అంత వరకు అక్కడ గణపిరెడ్డి కట్టించిన కోటకాక మరో ఏడు నేలకోటలు గూడ ఉండేవి.

ఇక్కడ ఆనాడు అల్లావుద్దీను వెంటవచ్చిన సేనానులలో షేక్‌సాహెబ్-బోదిల్‌సాహెబ్-బాలేసాహెబ్ అని ముగ్గురు సోదరు లున్నారు. వారిలో మొదటి యిద్దరు గణపురంలోనే నిలువగా మూడవవాడైన బాలేసాహెబ్ వడ్డవానివరకు సాగివచ్చి నాగర్ కర్నూలును పట్టుకొని అక్కడ జరిగిన యుద్ధంలో వీరమరణం పొందినాడు ఈనాడు అతని సమాధి అక్కడ కేసరి సముద్రం కట్టపై "బారుసావుల" పేర ఉంది.

కాకతీయుల పిమ్మట వడ్డవానిపై రాచకొండ ప్రభువు లింగమనేడు దండెత్తినాడు. అతని కాలంలో దాన్ని "జాజువఖాన్" అనేఅతడు ఏలుతున్నాడు లింగమనేడు అతనిని వధించి ఈ పట్ట ణాన్ని స్వాధీనం చేసుకున్నాడు ఈ తరువాత ఇది చివరిదశలో "కూచకుళ్ళవారు" అనే రెడ్డిదొరల చేతికివచ్చి కొంతకాలం వారి ఏలుబడిలో ఉండి తరువాత క్రమంగా అస్తిత్వాన్ని కోలుపోయింది

6. అమరపురం - ఈ గ్రామం ఇక్ష్వాకు విష్ణుకుండినుల శాస నాలలో పేర్కొనబడింది ఇక్ష్వాకుల రాజధాని విజయపురి విష్ణు కుండినులది ఇంద్రపాల నగరం కాబట్టి వానిప్రక్కన గల పీఠ భూమిపై ఉన్న అమరాబాదు గ్రామమె ఆనాటి "అమరపుర"మని పరిశోధకులు తలుస్తున్నారు.

అమరాబాదు పీఠభూమికి "ప్రతాపగిరిసీమ" అని వ్యవహారం. ఆ పీఠభూమిమీదగల మున్ననూరు-చంద్రగుప్తి-అమరాబాదు-పద-ఉడుమిళ్ల అనే గ్రామాలన్ని ఆయాకాలాలలో రాజధానులుగా ఉన్నవి. హనుమకొండను మొట్టమొదట ఆక్రమించుకున్న మాధవవర్మ అక్కడినుండి ఎఱుకు దేవరాజును అమరాబాదుసీమకు పంపినట్లు సిద్ధేశ్వర చరిత్రవల్ల తెలుస్తుంది. కాబట్టి ఈ గ్రామం క్రీ.శ. 8వ శతాబ్దంనుండే శాసనాలలో కనిపిస్తుంది.

కాకతీయుల కాలంలో వారి సామంతులైన చెఱుకురెడ్లు ఇక్కడినుండి మూడు తరాలవరకు పాలించినారు. వారి పిమ్మట చింతకుంట వెలమలు-అలంపురం బిజ్జలవంశీయులైన రెడ్లు దీని నేలినారు

ఈ పీఠభూమిపై గల చంద్రగుప్తి మిక్కిలి ప్రాచీన పట్టణం. దాన్ని రాజధానిగా చేసుకొని సోమవంశీయుడైన చంద్రగుప్తు డమరావతీసీమ నేలుతుండగా అతనిపై విష్ణుకుండిన నాలుగవ మాధవ వర్మ దండెత్తి ఓడించి అతని కూతురు చంద్రవతిని వివాహం చేసు కున్నాడు. ఆ యుద్ధంలో చంద్రగుప్తి ప్రసిద్ధి మాసింది. ఆ తరు వాత క్రీ.శ. 1361లో రాచకొండ ప్రభువులు అనపోతమాదానేడులు జరిపిన జల్లపల్లి ముట్టడిలో సోమవంశమే నిర్మూలమైపోయింది.

కాకతీయుల కాలంలో దీన్ని హేమాద్రిరెడ్డి పాలించినట్లు అతని కూతురు జ్ఞానాంబ కాకతిరుద్రుడు దహించిన వర్ధమానపురాన్ని ఉద్ధరించటానికి పాటుపడినట్లు ప్రజలు చెబుతారు.

ఈ పీఠభూమిపైగల ఉడుమిళ్ళను రాజధానిగా చేసుకొని నాగవంశీయులు మూడు తరాలు పాలించినారు. వారి పిమ్మట పదరను రాజధానిగా చేసుకొని చేపూరు వంశీయులైన బ్రాహ్మణులు మున్ననూరును రాజధానిగా చేసికొని నందివంశీయులు అమరాబాదుసీమ నేలినారు. వీనిలో నందివంశం ఇక్కడ తప్ప మరెక్కడా కనిపించటం లేదు.

7. కలువకొలను - అమరబాదుసీమను పాలించిన చెలుకు బొల్లయరెడ్డి సోదరుడు వోలిలయరెడ్డి క్రీ.శ. 1321లో కలువకొలను కోటను పాలించినాడు. ఈ గ్రామం ప్రస్తుతం నాగర్‌కర్నూలు నుండి కొల్లాపురంరోడ్డుపై ఉంది. ఇది కూడ ఈ జిల్లాలోని ప్రాచీన పట్టణాలలో ఒకటి.

ఇక్కడ మొదట కలువలతో కూడిన కొలను ఒకటి ఉండగా గోనవంశీయుడైన జయలక్ష్మిపతిరాయుడు ఆ కొలను ఆధారంగా చేసుకొని ప్రస్తుతం అక్కడ ఉండే నందికోటీశ్వరాలయాన్ని కట్టించి గ్రామాన్ని స్థాపించినాడని స్థానిక కైఫియతులవల్ల తెలుస్తుంది. పూర్వం నేటి కొల్లాపురం తాలూకాలో గోనరెడ్ల మొఖాసాగ్రామాలు ఉండేవికాబట్టి ఈ లక్ష్మిపతిరాయడు ఏ కాలంవాడో ఎవరి శాఖకు చెందినవాడో తెలియటంలేదు.

గోనవంశీయులు కాకతీయ సామంతులుగా ఈ ప్రాంతానికి క్రీ.శ. 1223 ప్రాంతంలో అడుగుపెట్టినారు కాని వర్ధవాని వారికి ఇతనికిగూడ ఏమైనా సంబంధం ఉందో లేదో తెలియదు. ఈ గ్రామానికి సాహిత్యంలో "కైరవకాసారపురం" అని వ్యవహారం. పార్థసారధి - క్షేత్రమైన తిరువళ్ళిక్కేణికి "కైరవిణీపురం" అని పేరు. అనగా అది తెల్లకలువకొలను. కాని స్థానికుల కధనాన్నిబట్టి ఇక్కడ బంగారురంగు కలువలు పూచేవని తెలుస్తుంది.

ఇక్కడ నంది గుడిముందు ఒక పెద్ద శాసనం ఉంది. దానిలో చెలుకురెడ్ల వంశం వివరించబడింది. ఆ వంశంలో ప్రోలయరెడ్డియే ఇక్కడి చివరి ప్రభువు. అతనిపై తాత పిన్నమరాజు పౌత్రుడు సోమదేవరాజు దండెత్తి వధించి ఈ కోటను వశపరుచుకున్నాడు.

చెలుకురెడ్ల పిమ్మట దీనిని పానుగంటి ప్రభువులైన బ్రాహ్మణులు పాలించినారు. వారిని చివరి దశలో గోలకొండ సుల్తానులు బందీగా కొనిపోయినట్లు తెలుస్తుంది. ఆనాటితో ఇది హమమ్మదీయుల జాగీరై ప్రభ తరిగిపోయింది.

8. పానగల్లు ఈ జిల్లాలో మరొక ప్రాచీన పట్టణం. ఈ పేర నల్లగొండజిల్లాలో గూడ ఒకటి ఉంది. అక్కడ పచ్చల సోమేశ్వరాలయం, ఛాయసోమేశ్వరాలయం ప్రసిద్ధి. ఇక్కడ దీని కోట ప్రసిద్ధి. ఇది మిక్కిలి బలిష్ఠమైన దుర్గం. ఈ గ్రామం చాళుక్యుల యొక్క మొదటి కాలంనుండి చరిత్రలో కనిపిస్తుంది. అంతేగాక శ్రీశైలానికి ఉత్తమ పాదంగాను పశ్చిమ ద్వారంగా కూడ ప్రశస్తిని పొందింది. దీన్ని క్రీ.శ. 1417 ప్రాంతంలో కాశ్మీర బ్రాహ్మణుడైన అనియంకభీమ బిరుదాంచితుడు దేవనారాయణుడు పాలించినాడు. ఇతని వంశమే తరువాతి కాలంలో కలువకొలనుకోటను పాలించింది. వీరిక్కడనుండి వెళ్ళిన పిమ్మట ఈ దుర్గం కొంతకాలం సురభిదొరల అధీనంలోగూడఉన్నది కాని సురభి వారెంతకాలం దీన్ని పాలించింది తెలియదు.

9. పాలమూరుజిల్లాలో సురభి మరొక ప్రాచీనపట్టణం దుందుభీ నదీతీరంలో నేటి తాళ్ళపల్లి నడిగడ్డ కారువంగ గ్రామాల నడుమ ఉండేది. ఇది సురభి ప్రభువుల జన్మస్థానంగా చెప్పబడుతుంది. అనంతకాలంలో వారిక్కడినుండే రేచెర్ల - పిల్లలమఱ్ఱి మొదలైన స్థలాలకు వెళ్ళినారు. ఈ గ్రామ ప్రసక్తి ఉమామహేశ్వర శాసనంలో గూడ ఉంది. అపుడు దీనిని మహాదేవుడు అనే నాయకుడు పాలిస్తున్నాడు. కాకతి రుద్రుని వర్ధమానపుర దండయాత్రా సందర్భంలో భీమనోడుడు వచ్చి యిక్కడ రాగగారుద్రుని సేనానులతనిని వెన్నంటి తరుముతువచ్చి దీనినిగూడ దహించినట్లు స్థానికులు చెప్పుకునేవారు.

ఇపుడీ గ్రామం పూర్తిగా రూపరివోయి అయిదారు గ్రామాలుగా ఏర్పడింది. వానిలో రఘుపతిపేట ప్రసిద్ధమయింది. దానిని పూర్వులు "రఘుపతిపేట ఉరఫ్‌సురభి" అనేవారు.

సురభి వైభవంగా ఉన్న కాలంలో ఇక్కడ మట్టిబొమ్మల పరిశ్రమ ఉన్నట్లు తెలుస్తుంది. కొండాపురంలో దొరికినటువంటి మట్టిబొమ్మల భాగాలీ ప్రాంతంలో చాలా దొరికినవి. మట్టిబొమ్మలేగాక ఇంద్రకల్లు-చేకుంట గ్రామాలలో బలపపురాతిబొమ్మల పరిశ్రమ, ఇంకా గాజుపరిశ్రమ-శంఖుపరిశ్రమ గూడ ఉన్నవి.

సురభిపలెనే పూర్తిగా రూపరివోయిన పట్టణాలలో కుమ్మరి రాయని పట్టణం మరొకటి. దీని అవశేషాలు ఈనాడు నాగర్ కర్నూలు తాలూకాలోని కుమ్మెరగట్టుక్రిందఉన్నవి చక్కగాఉన్న దినాలలో ఇది చాలా గొప్ప పట్టణం ఇక్కడ ఏవైపున ఏమి జరుగుతుందో తెలియనంత సందడిగా ఉండేదట. అందుచేత ఇప్పటికీ ఈ ప్రాంతంలో గొప్ప సందడి జరిగే స్థలాన్ని అది "కుమ్మరి రాయని పట్టణం" అని అనటం పరిపాటిగా నిలిచిపోయింది.

ఈ పట్టణాన్ని అయ్యాన-బయ్యాన-అనే యిద్దరు సేనాపతులు పాలించినట్టు ఈ ప్రాంతంలోని ఒగ్గుకధవల్ల తెలుస్తుంది. అయ్యాన వంశం ఒకటి గంగాపురంలోగూడ ఉండేది.

10. పూడూరు- ఇది ప్రస్తుతం గద్వాల తాలూకాలోని గ్రామం. ఒకప్పుడిదిగూడ పేరందిన పట్టణం. పశ్చిమ చాళుక్యుడైన ఆరవ సోమేశ్వరునిపై తమిళ చోడుడైన అధిరాజేంద్రుడు సల్పిన దండయాత్రలలో ఇది నాశనం చేయబడింది. వారీ పట్టణాన్ని గాడిదలతో దున్నించి పరాంతికపు విత్తులు చల్లించినారట. శత్రువుల నవమానించటంలో ఆనాడు తమిళ చోళులవలంబించిన పద్ధతులు మిక్కిలి కఠినంగా ఉండేవి.

ఈ దండయాత్రలలోనే వారు "మణితిప్పె" అనే చాళుక్య రాజ ప్రాసాదాన్నిగూడ గ్రహించినట్లు తమిళ శాసనాలలో చెప్పబడింది. ఈ మణితిప్పె ఈనాటి "మన్నెంకొండ" అని పరిశోధకులభిప్రాయ పడుతున్నారు. ప్రస్తుతం మన్నెంకొండ దగ్గర కోటగట్టు దానిపై ఆనాటి రాజ ప్రాసాదావశేషాలున్నవి.

పూడూరులో ఈ యుద్ధాలేకాక శైవ జైన మత సంఘర్షణలు గూడ చాలా నడిచినవి. వాని ఫలితంగా అక్కడి సంస్కృతి ఎంతో నష్టమైపోయింది. అనంతకాలంలో మళ్లీ ఈ జిల్లాలోని పెద్ద సంస్థానాలలో ఒకటైన "గద్వాల సంస్థానం" ఈ పూడూరునుండే పుట్టింది.

ఇక్కడి ప్రాచీన పట్టణాలలో "గోదలు" మరొక చెప్పదగిన గ్రామం. దానికి మొదట గోదాల్లయమని వ్యవహారముండెనట. అదే ఈనాటి గోదలు అంటారు. శాసనస్థలానికి గ్రుడ్డంటి అని వ్యవహారం ఉంది. దేవరకొండ ప్రభువుల కది విడిచిన తరువాత ఈ గ్రామమే నివాసంగా ఉన్నది. ఆ వంశంలోని పదునాల్గవ తరంవాడైన కుమార మాదానాయుడు ఇక్కడినుండే జటవోలిలు సీమను ఆళియ రామరాయల చేత పొందినాడు.

ఈ విధంగా పాలమూరుజిల్లాలోని ప్రాచీన రాజధాని పురాలు చాల వెలసినవి కాబట్టి పురాతత్వ శాఖవారు మరియు చరిత్ర పరిశోధకులు ఈ గ్రామాలను పరిశీలించి అధ్యయనం చేయవలసిన అవసరముంది. ఆ విధంగా చేస్తే ఈ జిల్లాకు సంబంధించిన ప్రాచీన చారిత్రక విశేషాలెన్నో వెలుగుచూడగలవు.

---

# ఆద్యంతాల నడుమ నవ్వు

## శ్రీ నిఖిలేశ్వర్

ఆద్యంతాలపై అంత నిగూఢంగా
నిలిచే నీ అంతరంగం
జీవిత బడబానలంలో రాటుదేలి
బాల్యపు చిరునవ్వు కెరటాలను
ఎగచిమ్మడం ఒక జీవితానుభవం!
సుఖమెరుగని జీవనయాత్ర
నిత్య సంఘర్షణలోనే సజీవతత్వం.
సౌఖ్యం కొవ్వు పేరిన కొందరు
ప్రాణమున్న శవంలా మారుతారు,
మరికొందరి జీవన పరమార్థం—
—ప్రశ్నించని అంతరాత్మపై డబ్బు భారం
భార్యాభర్తలు పిల్లలు ఇళ్ల పరిధి,
ఈ కుటుంబ యథార్థానికావల
సంపాదనకు పనికిరానివన్నీ గాలికబుర్లు!!
స్నేహ మమతానుబంధాలకు
నిష్కామయోగం ఇక్కడ ఎండమావి
అక్కడే నీ నవ్వు నీ ప్రాణాధారం.
ప్రక్షాళనం చేసే ఆ నవ్వైనా
ఇక్కడ ఎంతకాలం నీలో నాలో?
ఎదురుదెబ్బలు తీసే ఈ "అవ్యవస్థ"
ఈ సమాజ నీతిగా ఆద్యంతం
అసంఖ్యాకుల నవ్వును ఖననం చేస్తుంటే
ఒక వ్యక్తిగా నీ నవ్వు నీ సొంతం కానేకాదు.
అందరిలో ఆ నవ్వు అల్లుకున్నపుడు
అంతరంగ తరంగాల్లోనే కదా
మనం కోరే ఆది అంతం!!

(ఒంటరిగానే జీవన సమరంలో నిలిచిన "శివ"కోసం)

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

# వాస్తవాలకు ఆవల ఆధునిక నవల

"ఒక నవలాకారుడిగా నేను ఒక సన్యాసికంటే, ఒక శాస్త్రవేత్తకంటే, ఒక వేదాంతికంటే, ఒక కవికంటేకూడా ఉన్నతుడుగా భావిస్తాను. ఎందుకంటే వీళ్ళందరూ మానవజీవితాన్ని పాళ్ళువేసి పంచుకోవడంలో మహోన్నతులే కానీ పరిపూర్ణ జీవితావగాహన పొందలేనివాళ్ళు!" అని డి. హెచ్. లారెన్స్ అన్నాడు.

"నేను ఒక సన్యాసికంటే గొప్పవాడిని. ఒకశాస్త్రవేత్తకంటే గొప్పవాడిని. ఒక వేదాంతికంటే ఉన్నతుణ్ణి. కడకు ఒక కవికంటే కూడా!' అని రొమ్ము విరిచి చాటుకొనే శక్తి ఒక నవలారచయితకు ఎట్లా వచ్చిందంటే?-అందుకు ఆ మహానుభావుడే సమాధానం చెబుతాడు- నవల ఒక జీవనవికాస గ్రంథము." అని.

మరి యిప్పుడు ఆ మాత్రం ఆత్మస్థైర్యంతో తన అభిప్రాయాన్ని అభివ్యక్తం చేయగలిగిన నవలారచయిత ఉన్నాడా?–ఉంటే-యిట్లాంటి ప్రశ్నకు తావు ఉండేదికాదు ఒకవేళ ఉన్నాడనుకొంటే ఆతడికా అర్హతఉందా? అని ఆలోచించవలసి వస్తుంది.

దాదాపు పదకొండు దశాబ్దాల వయస్సు కలిగిన ఈ జీవిత వికాసగ్రంథం నేటి జీవిత వికాసానికి దోహదం చేస్తున్నదా? ఆధునికుల చేతుల్లోపడి ద్రోహం చేస్తున్నదా? దీనికి సమాధానం చెబితే ఆధునిక తెలుగు నవల వాస్తవాలకు ఆవల ఉన్నదా? ఈవల ఉన్నదా? తేటతెల్లమవుతుంది.

నవల అంటే-ప్రణయంతోనో, అద్భుతాలతోనో, సాహసాలతోనో, ముడిపడి కడకు ఆ ముడిని విప్పే వచన ప్రబంధమని ఒకనాటి అభిప్రాయం. ఇది చాలా పాతదైన అభిప్రాయం.

ఆ తరువాత నవల అనేక విధాలుగా మారింది.

నవలా విర్భావం పాశ్చాత్య ప్రభావమే అయినా వస్తుస్వీకరణ దృష్ట్యా వాళ్ళకు మనకు భేదముంది

కల్పితుడైన వ్యక్తియొక్క జీవితచరిత్ర కావ్యదృష్టితో రాస్తే అది నవల అయింది. ఒకడి జీవితంలో విద్యావికాసమే ప్రధానాంశంగా సాగినా అదీ నవలే అయింది. ఒక్క వ్యక్తియొక్క దినచర్య కూడా నవలే అయింది. సైన్సు, జైలుశిక్ష అనుభవిస్తున్న ఖైదీల గాథలు, చిన్నచిన్న పల్లెటూళ్ళల్లో గ్రామాధికారుల కృత్రిమ చర్యలు ఆదిగాగల యితి వృత్తాలన్నీ నవలలైనాయి. అసలు కథే లేకుండా ప్రకృతి దృశ్యాలద్వారా పాఠకుని మనస్సులో ఎన్నో విషయాల్ని ప్రదీపింపచేస్తూ కావ్యత్వాన్ని సాధించిన నవలారచయితలెందరో ఉన్నారు. ఈ ప్రక్రియలో రష్యా రచయిత చెకోవ్ అఖండుడని ప్రతీతి దీనినిబట్టి చూస్తే పాశ్చాత్య సాహిత్యంలో నవలకు వస్తు నిబంధనలేనట్లు తోస్తుంది.

కానీ భారతీయ సారస్వతంలో సూచ్యార్థసూచన, ఉపశ్రుతి, ఉత్ప్రేక్షకరమైన వర్ణనలు ప్రధాన శిల్పంలో కొన్ని లక్షణాలైనా, సంఘ సంస్కరణే వస్తువుగా గౌరవింపబడింది. తెలుగులో తొలి నవల వీరేశలింగం పంతులుగారి రాజశేఖరచరిత్రము వెలువడునాటికి ముఖ్యముగా మనకు ఎదురైన సమస్యలు రెండే! ఒకటి: స్వాతంత్ర్య సముపార్జన, రెండు. సంఘ సంస్కరణ, నవలా విర్భావం పాశ్చాత్య ప్రభావమే అయినా, పాశ్చాత్య నవలా సాహిత్యంలా వస్తునిబంధన లేకపోయినా తొలి తెలుగునవల సంఘసంస్కరణోద్దేశ్యంతోనే వెలువడడం మన సాహితీదృక్పథానికి గీటురాయి. రచయిత సాంఘిక, నైతిక బాధ్యతలకు నిదర్శనం! ఆధునికనవలా రచయితలు ఈ బాధ్యతను పూర్తిగా విస్మరించినారు. నవలా రచన గిట్టుబాటు వ్యాపారంగా భావించి బ్రహ్మరథం పడుతున్నారు.

సామాజిక వాస్తవరూపాల్ని చిత్రించిన తొలి తెలుగునవల 'రాజశేఖర చరిత్రము. కర్త వీరేశలింగంపంతులుగారు. కాలము 1878. అయితే 1872 లోనే తెలుగు నవల వెలువడింది. అది నరహరి గోపాలకృష్ణయ్య చెట్టిగారు రాసిన 'శ్రీరంగరాజచరిత్రము.' అయితే అది పేరుకు మాత్రమే నవల. అందుకే తెలుగు సాహిత్యంలో తొలి నవల రాజశేఖర చరిత్రమే! అని పరిగణింపబడింది.

నాటినుండి నేటికి పదకొండు దశాబ్దాలు గతించినాయి ఈ కాలంలో నవల ఎన్నో పోకడలు పోయింది ఉత్తమ సాహితీ ప్రక్రియగా పేరు గడిచింది. సాంకేతికంగా, కళాత్మకంగా ఎన్నో విజయాల్ని సాధించి హిమవన్నగ ఉన్నత శిఖరాల్ని అధిరోహించింది

ఇప్పుడు అక్కడినుండి రాయి కిందికి దొర్లడానికి ప్రారంభించింది. దీనిని ఎవ్వరూ ఆపలేని నిస్సహాయస్థితి అయితే చేయగలిగిన ఒక్కగానొక్క సహాయం ఏమిటంటే? దానికింద పడి నలిగిపోతున్న జనాన్ని ప్రయత్నించి పక్కకు లాగడమే! అయితే అదిగూడ అంత సులువైన పనికాదు.

సాహితీ విమర్శ కత్తిమీద సాము. దీనికి సద సద్వివేక సంపన్నత. సంయమన శక్తి సదవగాహన అన్నిటికీమించి సహృదయత అవసరం. సరైన విమర్శకులు లేనందువల్లనే నేటి సాహిత్యం వెర్రితలలు వేస్తున్నది. ఆశ్రితపక్షపాతము చిట్టెలుకల్ని సింహాల్లా గర్జింపచేస్తున్నది మేధాగ్నులైన మేధావులకు ఆలూరి బైరాగిలాంటి కవివరేణ్యులు-

"ఎక్కడున్నారు మేధావులు బుద్ధిజీవులు?
బూజు పట్టిన గ్రంధాలయాల గనుల్లో, పరిశోధనశాలల్లో
పత్రికల ఆఫీసుల్లో నాటక సంగీత నర్తనశాలల్లో
ఊహాస్మరణశక్తుల అంతులేనిచేలల్లో ఒంటరి సేద్యంచేస్తూ
సత్యసౌందర్యాల నైవేద్యాల మోస్తూ ఎక్కడున్నారు?
బైటకు రండి'ముందుకు రండి! విస్తృత వసుధమీదకు!"-

అని కలంపోట్లు పొడిచినా మేధావులు మెదలకుండా కూర్చున్నారు. చదవేసేకొద్దీ ఉన్న మతి పోయినట్లు తానొవ్వక తప్పించుక తిరగడంలో వాళ్ళు ధన్యులైనట్లు భావిస్తున్నారు. ఇది సాహితీ లోకానికి ఏర్పడిన పెద్ద ప్రమాదము కాకుంటే దురదృష్టం.

అథవా ఎవ్వరైనా సాహితీ విమర్శలకు పూనుకొంటే గత వైభవ ప్రాభవాలకు ప్రభలు కట్టడంతోనే సరిపుచ్చుకొంటున్నారు పాడిందే పాడినట్లు యింతవరకు ఎందరో మహానుభావులు చెప్పిందే తిరగేసి మళ్లేసి చెబుతున్నారు లేకుంటే తమ అవగాహనా శక్తి అనుమానాస్పదమైపోతుందని వాళ్ళకు భీతి!- కానీ నవల విషయానికి వచ్చేటప్పటికి అట్లా నీళ్ల నమలవలసిన అవసరం ఆవగింజంతలేదు ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే యిది విదితము. విస్పష్టము!

మళ్ళీ ఒక్కసారి వెనక్కు తిరిగి పంతులుగారి వద్దకు వెళ్ళితే-సమాజ వాస్తవరూపాన్ని చిత్రింప పూనుకొన్నపుడు ప్రణయము, విరహము, అద్భుతము, సాహసము ఉండకూడదన్న విమర్శ వాస్తవ దృక్పథంలో పంతులుగారు తన మొదటి నవలలో చోటు చేసుకొన్న సాహసాలు, అద్భుతాలు రెండవ నవల 'సరస్వతీ చరిత్రము'లో చోటుచేసుకోకుండా శ్రద్ధ వహించినారట. ఇది నూరేండ్ల క్రిందటిమాట. మరి ఆధునిక రచయితల చేతుల్లో శరవేగంతో ఉత్పత్తి అవుతున్న నవలల్లో ప్రణయము, విరహము, అద్భుతము, సాహసమే కాకుండా సహించలేని ఎంత చెత్తాచెదారం ఉదారంగా కొత్త పోకడలు పోతున్నదో గమనిస్తే ఆధునిక నవల రచనా రీతి సుబోధకమవుతుంది.

ఒక్కసారి త్రికరణశుద్ధిగా ఈ సమాజ పరిస్థితిని అవగాహన చేసుకోవడానికి బుద్ధిజీవులు ప్రయత్నిస్తే నిజంగానే పిచ్చెక్కుతుంది. మేకకంట పడిన లేతఆకులా దోపిడీతత్త్వానికి గురైపోతున్న ఈ సమాజం విలవిలలాడిపోతూఉంది, హత్యలు దోపిడీలు దౌర్జన్యాలు మత కలహాలు, వేర్పాటు ఉద్యమాలు, ప్రభుత్వ నిరంకుశధోరణులు సంక్రాంతి సంబరాల్లా సవ్యంగా సాగిపోతున్నాయి. అస్తవ్యస్తమైన ఈ వ్యవస్థలో సామాన్యుడి బ్రతుకు గాలిలో దీపమయింది. ఒక ప్రక్క అతివృష్టి యింకొక ప్రక్క అనావృష్టి- పరిస్థితి అల్లకల్లోలంగా తయారవుతూఉంది. దేశాధ్యక్షుడికేకాదు, దేశ ప్రధానికేకాదు దేశాన్ని కంటికి రెప్పలా కాపాడే సర్వసైన్యాధ్యక్షుడికి కూడ భద్రత కరువైనపుడు సామాన్యుడు ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకొని కుములుతున్నాడు.

కేంద్రం మీద రాష్ట్రాలు, రాష్ట్రాల మీద కేంద్రం- ఎత్తిపోసుకోవడమే వృత్తిగా పరిణమించింది.

ఏ ప్రభుత్వోద్యోగికైనా కనీసవేతనం ఏడువందల రూపాయలకు తక్కువ కాకూడదని నిర్ణయిస్తే, యింట్లో ఎంతమంది ఉంటే అంతమంది తలకొకపని చేసినా దినానికి ఏడురూపాయలు కూలి గిట్టలేదని దేశానికి వెన్నెముకలైన రైతులు వాపోతున్నారు. ఈ దేశంలో రైతులు అప్పుల్లో పుట్టి, అప్పుల్లో పెరిగి, అప్పుల్లో చస్తున్నారని ఎప్పుడో సైమన్ కమీషన్ తీర్పు యిచ్చింది.

ఆధునిక నవలా రచయితల దృష్టిని సమకాలీన సమాజ వాతావరణం ఆకర్షింపకపోవడం దేశానికి పట్టిన దౌర్భాగ్యం.

రచయితల పరిస్థితులు యిట్లుంటే పాఠకులూ ఆ స్థాయికే చేరుకొన్నారు ఒకనాటి పాఠకుడికి, నేటి పాఠకుడికి ఎంత మార్పు? నేటి పాఠకుడిలో ఎక్కడుంది ఒక అవగాహనతో చదవాలన్న ఓర్పు?

ఇది పూర్తిగా యాంత్రికయుగమైపోయింది. ఈ యాంత్రిక యుగంలో మనిషి సుఖజీవనానికి మరిగినాడు. బతుకు వడ్డించిన విస్తరి కావాలని అతని ఆరాటం. ఈ ఆరాట పోరాటాల్లో పడి నలుగుతున్న అతడికి నవలలు చదివే తీరిక కోరిక ఎక్కడుంటుంది? ఉన్నా, అది వెయ్యి పేజీల నవలైనా ఎనభై పేజీల నవలైనా దానికి రంగు రుచి వాసన కలిపి రెండున్నర గంటల కాలంలో వెండితెరమీద వేడుగ్గా చూపిస్తూంటే- నాయికా నాయకుల్ని, వాళ్ళ అందచందాల్ని స్థలాల్ని పరిస్థితుల్ని కాగితాలమీద ఊహించుకొంటూ చదువుకోవలసిన

కర్మ నేటి పాఠకుడికి పట్టలేదు. అతడికి టీ వీ. చూపిస్తుంది. రేడియో విని పిస్తుంది. అందుకే ఒక వంద పేజీల నవల్ని మాస పత్రికలో వార పత్రికలో వేసి కుట్టితేకానీ చదువలేని పరిస్థితి ఏర్పడింది.

ఒకనాటి పాఠకుడి స్థితివేరు. ఆ రోజుల్లో అతనికి పుస్తకమే సర్వస్వం. పుస్తకం చేతపట్టడం సంస్కారం. సంస్కారవంతుడైన నాటి పాఠకుడు తన స్నేహితుడితో గడిపినట్లే పుస్తకాలతో గడిపినాడు. మంచిని గ్రహించినాడు. తనకు నచ్చనపుడు తీవ్రంగా విమర్శించినాడు. చెడును నిరసించినాడు. రచయిత తన బాధ్యతను గుర్తెరిగి ప్రవర్తించినాడు. ఆధునిక సమాజంలో ఈ స్థితి మారుతారయింది. అంతా చెడే అయినప్పుడు ఎంతోకొంత మంచి సముద్రంలో యింగువ కలిసినట్లుగా కలిసిపోతున్నది.

ఆధునిక రచయితను ఎందుకు మీరు పాములూ తేళ్ళకథలు, భూతాలూ దెయ్యాల కథలు, అతీతశక్తులకథలు, అర్థం పర్థం లేకుండా రాస్తున్నారు? పోనీ! రాస్తున్నారుకదా? ఆయా విషయాల్లో తగినంత అనుభవముండి రాసినా సంతోషించవచ్చు. పూర్తిగా అనుభవంలేని, తెలియని సమాజానికి అనవసరమైన విషయాల్ని ఎంత కష్టమ్స్ అధికారులు కలుగచేసుకపోయినా దిగుమతి చేసుకొని పాఠకుల నెత్తిన రుద్దుతున్నారే? ఎందుకీపని చేస్తున్నారంటే?- "ప్రజలు చదువుతున్నారు కాబట్టి!" అని ధీమాగా సమాధానం చెబుతున్నాడు.

"ప్రజలారా! యిచ్చినదాన్నిచ్చి పుచ్చినదాన్ని కొన్నట్లు డబ్బులిచ్చి ఎందుకు మీరీ మానసిక రుగ్మతల్ని కొనుక్కుంటున్నారంటే?- మీరు రాస్తున్నారు కాబట్టి! మాకు కాలక్షేపం కావాలి కాబట్టి! అని బదులు చెబుతారు.

పత్రికా సంపాదకులారా! మీరెందుకీ చెత్తను పోగుచేసి ప్రోత్సహిస్తున్నారంటే?"- 'మా సర్క్యులేషన్ పడిపోకుండా ఉండడానికి" అని రెడీమేడ్ సమాధానం చెబుతారు. కొన్ని పత్రికల్ని పిల్లల చేతుల్లో పెట్టడానికి యిండ్లల్లో ఎంత యిరకాటంలో పడుతున్నారో?- పడుతున్న వాళ్ళకే తెలుస్తుంది

ఎవరి తాపత్రయం వాళ్ళది కాబట్టి నవల తప్పుదారిపట్టింది. తప్పుదారి పట్టడమేకాదు ఎంతో దూరం వెళ్ళిపోయింది. ఎంతదూరం వెళ్ళిందంటే సినిమా నిర్మాతలు ఈ నవలల్లో సినిమాకు పనికివచ్చే మసాలా ఎంతవరకు ఉందని తూకం వేస్తుంటే ఆధునిక నవలా రచయిత ఎంత మసాలా ఉంటే సినిమాకు ఉపయోగపడుతుంది? అని తాపత్రయపడే స్థితికి వెళ్ళిపోయింది. అంటే-పక్కా వ్యాపారసరళికి దిగజారిందన్న మాట!- ఈ మాట అనడానికూడా వీల్లేదు. ఎందుకంటే వ్యాపారం సత్యానృతం. ఏ వ్యాపారానికైనా కొంత నీతి నియమం నిబంధనలు ఉన్నాయి. నేటి సాహితీ వ్యాపారానికి అవికూడా లేవు.

అయినా దింపుడు కళ్ళం ఆశమాత్రం చావలేదు.

రుచిగా ఉందని తీపు ఎంతవరకు తింటారు?- తీపు ఎక్కువగా తినడంతో తీపురోగం రాకపోయినా ఏనాటికో ఒకనాటికి మొగంమొత్తుతుంది. వేలంవెర్రి వినోదం వెనకపడుతుంది. యాంత్రికమైన, అనారోగ్యకరమైన సస్పెన్సులు సస్పెండ్ అవుతాయి. ఏ గమ్యమూ అర్థములేని ముగింపులకు ముగింపు వస్తుంది!

మానవాళి ఈ మానసిక ఆందోళనలనుండి, రుగ్మతలనుండి ఒకనాడు డిటెక్టివ్ శవ సాహిత్యంనుండి బయటపడినట్లు బయటపడుతుంది అది జరుగుతుందని, అదే జరగాలని ఆశించడం తప్ప ఈ పరిస్థితుల్లో ఎవ్వడైనా చేయగలిగిందేమీ లేదు!

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## జనవరి - 1988

**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1 పా.

అశ్విని వారికి గతంలో కొంతకాలంనుండి పట్టిపీడిస్తున్న శని దోషం వదలిపోయినట్లే. అయితే నెల అంతా కుజుని తీవ్రత హెచ్చుగా ఉండి, త్రిప్పట, ప్రయాస, మానసికవైకల్యం, ఉద్రేక స్వభావం కలుగును. గురుని దృష్టిబలంవల్ల శుభాదికార్యసిద్ధి జరుగును.

భరణి వారికి నెల అంతా శ్రమ. 28వ తే 1 నుండి శుభ ఫలం హెచ్చును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, వృత్తి ఉద్యోగపరులకూ ధన వ్యయం అయినా, అందుకు తగిన ప్రయోజనం కల్సిరాగలదు. ప్రతి విషయములోనూ ప్రారంభంలో అధిక శ్రమ వ్యయ ప్రయాసలూ, తరువాత కార్యసిద్ధీ కలుగుతాయి. మొత్తంమీద శుభాశుభ మిశ్రఫలం.

కృత్తిక 1వ పాదంవారికి శుభకార్య ప్రయత్నాలకు ఆటంకం. నెల చివరివారం అంతా విశేషశ్రమ, ధనవ్యయం, ఆరోగ్య భంగం, ఎందరు అత్యున్నత పదవిలో ఉన్న అధికారులూ, ఆప్తులూ ఉన్నా అదృష్టఫలం కలిసిరాదు. ఫలితం చేతికి అందినట్లే కనబడు తుంది. కాని ఆశమాత్రమే మిగులుతుంది.

**వృషభం**

కృత్తిక 2, 3, 4, పాదములవారికి అష్టమ శని అయినా, కార్యసిద్ధి, అయినా ధనలాభం, పదుగురిలో మాట పలుకుబడి, ప్రజా సన్మానం జరుగును. మిత్రబంధు సమాగమం, భార్యకు అనారోగ్యం కలుగును. ప్రథమ కోపం, చిరాకు, పనికిమాలిన ఆలోచనలు హెచ్చు. పెద్దల సహవాసంవల్ల మేలుకలుగుతుంది.

రోహిణి వారికి శనిదోషం, గురుదోషం హెచ్చు. జప శాంతులు చేయించుట మంచిది. మానసికంగా ఆందోళన, కుటుంబంలో అశాంతి, విపరీతంగా ధనవ్యయం, అనుకొన్న పనులన్నీ వాయిదా పడుతూఉంటాయి. వర్తకులూ, ఉద్యోగస్థులూ జాగ్రత్తగా ఉండడం మేలు. బంధు విరోధం తప్పదు.

మృగశిర 1, 2, పాదములవారికి 10వ తే. వరకు మిశ్రమ ఫలంగాను ఆ మీద నెలఅంతా మంచియోగదాయకంగాను ఉండును ఇంతవరకు నెరవేరని పనులన్నీ అతి సులభంగా నెరవేరుతాయి. అన్నింటా విజయం. ధనలాభం, ఉద్యోగవ్యాపారాభివృద్ధి, కార్యాను కూలత కలుగును. అన్ని వృత్తులవారికీ, విద్యార్థులకూ, రాజకీయ నాయకులకూ కూడ చాల అనుకూలమైన ఫలం కలుగుతుంది.

మిథునం మృగశిర 3, 4 పా. వారికి భార్యా మూలకంగా ధనలాభం, భార్యావర్గం వారితో కలహం. బంధుమిత్రులతో మాట పట్టింపులూ కలిగినా ఉద్యోగ వృత్తి వ్యాపారాదులలో అధికంగా లాభించును. సువర్ణవస్త్రాభరణ ప్రాప్తి, రాజసన్మానము, దైవభక్తి, సద్గోష్ఠి. సాధు సజ్జన సహవాసం కలుగును. నెల చివరివారంలో శ్రమ, త్రిప్పటా, ప్రయాణాదుల మూలకంగా బడలిక కలుగును.

ఆర్ద్ర 1, 2, 3, 4 పా. వారికి నెల మధ్యలో కార్యభంగం, ధన వ్యయం, మానసికంగా ఆందోళన కలుగును. మిగిలిన కాలం అంతా ధనలాభం. శుభకార్యములు నెరవేరుట, ఉద్యోగప్రాప్తి మొ॥ సత్ఫలితాలు కలుగును. నెల చివరివారంలో క్రొత్త పరిచయస్థుల ద్వారా గాని, తక్కువస్థాయి మనుషులద్వారాగాని అధికంగా లాభిం చును. అన్ని వృత్తులవారికి మేలు జరుగును.

పునర్వసు 1, 2, 3 పా. వారికి-శ్రమ అధికం, పనికిమాలిన ఆలోచనలు, కార్య విలంబం, ఆత్మీయులతో అభిప్రాయభేదాలు, అనవసర ధనవ్యయం, ప్రతి విషయంలోను దిగులు కలుగుచుండును. సంబంధంలేని బాధ్యతలు నెత్తిన వేసికొనుట జరుగును. అయినను జాగ్రత్తగా వ్యవహరించుటవలన క్రమంగా చిక్కులు విడిపోయి నెల చివరినాటికి అన్ని పరిస్థితులు చక్కబడును. శుభకార్యములలో పాల్గొ నుట జరుగును.

**కర్కాటకం**

పున. 4వ పా. వారికి నెలమధ్యలో వ్యవహారపు చిక్కులు కలిగినా, నెల అంతా అనుకూల పరిస్థితితో గడచును. ఉద్యోగులకు, వర్తకులకు. విద్యార్థులకు. రాజకీయవాదులకు, కర్షకులకు, కార్మికులకు, కూడ అన్ని విధాల కలసివచ్చును. అధికారులతో మంచితనము పెరు గును. సంఘములో మాట విలువ పెరుగును. ఆరోగ్యం బాగుగా ఉండును.

**పునర్వసు 1, 2, 3, 4, పా. వారికి** ధనలాభం, బంధుమిత్ర లాభం **కలుగును, ముఖ్యంగా ఉద్యోగులకు** వర్తకులకు, **రాజకీయ వాదులకు అనుకూలంగా ఉండును.** ఇంతవరకుఉన్న వ్యథలు, బాధలూ, పూర్తిగా తొలగిపోవును. గృహంలో వివాహాది శుభకార్యములు జరుగును. దాయాదులతో స్వల్ప విరోధం కలుగును.

**ఆశ్లేష** 1, 2, 3, 4, పా, వారికి ఇంతవరకు ఉన్న ఉద్యోగ, వ్యవహార, వ్యాపార సంబంధములైన చిక్కులు తొలగిపోయి మానసికమైన సంతోషము, శుభకార్య నిర్వహణము గృహవాహనాది లాభం కలుగును. **అయితే** శారీరకంగా అధికశ్రమ పడవలసివచ్చును. స్వల్పంగా నిందలుకూడ పడవలసివచ్చును. నెల మధ్యలో ఆరోగ్యం భంగం కలుగును.

## సింహం

మఘ 1, 2, 3, 4, పా. వారికి శరీరంలో నలతగా ఉండును. భార్యకు తరుచు బలహీనత కలుగును. డాబు దర్పాలకోసం, పదుగురిలోను మెప్పు మెహర్బానీలకోసమూ, స్నేహ వాతావరణ దోషం వల్లనూ దుబారావ్యయం కల్గును. బంధుమిత్రుల రాకపోకలవల్లకూడ ఖర్చు పెరుగును. అయినను ధనాదాయానికి లోపం ఉండదు. ఇంత ఖర్చులోకూడ ఒక స్థిరమైన భాగ్యంలేక సువర్ణాభరణాది సంపాదన కూడ జరుగును.

పుబ్బ 1, 2, 3, 4, పా వారికి ఇంతవరకు పట్టిపీడించుచున్న వ్యవహారపు చిక్కులు, బంధు విరోధాలు, ఉద్యోగపు ఆటంకాలూ తొలగి, అన్ని విషయాలలో అభివృద్ధి కలుగును అన్ని రంగాలలో వారికి సుఖసంతోషాలు కలుగును. అయితే శరీరశ్రమ మాత్రం ఉండును. అన్నీ సంపూర్ణ- ఫలితాలనిచ్చే స్థితి క్రమంగా ఏర్పడును శుభకార్యాలు నిశ్చయమగును.

**ఉత్తర 1వ పా. వారికికూడ** కొంతవరకు చిక్కులు తొలగి కార్యసిద్ధికి, సర్వానుకూలతకు తగిన పీలు ఏర్పడును. ఆరోగ్యం బాగుగా ఉండును. వ్యయం అధికంగా పెరుగును. బంధుమిత్రాదుల వల్ల, అధికారులవల్లా హెచ్చు సహాయం కలుగును. దూరదేశ ప్రయాణాలకు తగిన అవకాశం కలిగి భవిష్యత్తులో సర్వవిధాలా ఉద్యోగ వృత్తి వ్యాపారానుకూలత అభివృద్ధికిని తగిన మార్గం సుగమం అగును. శరీరశ్రమ కల్గును

## కన్య

ఉత్తర 2, 3, 4, పా. వారికి అర్ధాష్టమ శని ఐనా ద్విస్వభావ రాశి అగుట, మిత్ర తారా స్థితి అగుట వల్ల మేలునే కలిగించును. గురుడు శుభకార్య ప్రయత్నాలకు విఘ్నం చేయును. ఆర్థికంగా తొట్రుపాటు కలిగించును కించిత్తు ఋణభారంకూడ కలిగించును. సంబంధంలేని చుట్టాలబాధ అధికంగా ఉండును. వృత్తి-ఉద్యోగ-వ్యాపారాల్లో అభివృద్ధిఉన్నా, అధికారుల ఒత్తిడి అధికంగా ఉండును.

హస్త 1, 2, 3, 4, పా. వారికి ఆరోగ్యం సరిగా ఉండదు. బాధ్యతలు కొన్ని తీరినా, తిరిగి క్రొత్త బాధ్యతలను చేపట్టవలసి వచ్చును. దైవభక్తి హెచ్చును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి. నూతన వస్త్రాభరణప్రాప్తి కలుగును. దైవ పుణ్యధర్మ కార్యాలలో పాల్గొనుట జరుగును. బంధుమిత్రుల రాకపోకలతో గృహం సందడిగా ఉండడమేకాక ధన వ్యయం కూడ అధికంగా జరుగును. ప్రయాణాలుకూడ లాభించును.

చిత్త 1, 2, పా. వారికి ఈ నెల అంతా శుభఫలితంతో గడచును. ఉద్యోగ వ్యాపారాభివృద్ధి జరుగును. కుటుంబంలో సుఖసంతోషాలు పెరుగును. విజ్ఞాన, విద్యా-పారమార్థిక చింతన సంబంధమైన కృషిలో పాల్గొనుట జరుగును బంధుమిత్రుల రాకపోకల సందడి హెచ్చుగా నుండును సంసార పుత్ర పుత్రికా సౌఖ్యం బాగుండును సర్వ విధాల ధన లాభంకూడ కల్గును.

## తుల

చిత్త 3, 4, పా. వారికి అన్నీ అనుకూలంగా ఉన్నా, జ్ఞాతి దాయాద బంధువులతో ద్వేషము తాత్కాలికముగా కలుగును. దైవచింతనము, పరమార్థ విచారము కలుగును. నూతన వస్త్రాభరణ లాభం కలుగును సంతానమునకు అన్ని విధముల శుభములు, ఉద్యోగాభివృద్ధి, విద్యాభివృద్ధి, కలగవచ్చును. సాటివారిలో గౌరవ మర్యాదలు బాగుగానుండును. తలపెట్టిన పనులన్నీ నిర్విఘ్నంగా నెరవేరును. ధనలాభం కలుగును.

స్వాతి 1 2, 3, 4, పా వారికి నెలలో 2, 3, వారములు చిక్కులు కలిగి మానసికంగా వ్యధకలిగించి తొలగిపోవును 1, 4, వారములు ధనలాభం కలుగును. నెల మధ్యలో అనవసరంగా ఇతరుల చేత మాటపడుట, చిన్న చిన్న తగవులలో ఇరుకుకొని బాధపడుట, బంధుమిత్రాదుల నిమిత్తంగా ధనం వ్యయమగుట, మానసికంగా అప్పుడప్పుడు అశాంతిపొందుట జరుగును అయినను ధనాదాయమునకు లోపం ఉండదు, కొన్ని విషయాలలో దర్జా ఖర్చులు పెరుగును.

విశాఖ 1, 2, 3, పా. వారికి నెల 28వ తే. వరకు అన్ని విధాలా బాగుగానే ఉండును. ఆర్థికంగాకూడ కలసివచ్చును. కుటుంబంలో సుఖసంతోషాలు వృద్ధిపొందును. నూతన బంధుసమాగమం, వివాహనిశ్చయాలు మొ॥నవి నిశ్చయమగును. అన్ని విషయాలలోను బంధుమిత్రుల, అధికారుల, అనధికారుల సహాయ సహకారములు లభించును. చివరివారంలో మాత్రం చిక్కులను మనఃక్లేశాన్ని, ఆర్థికపుతొట్రుపాటులని తట్టుకొనడం కష్టమగును.

## వృశ్చికం

విశాఖ 4. వ. పా. వారికి అన్ని విధాల అనుకూలమైనకాలం. సంతానానికి విద్యాభివృద్ధి వివాహాది శుభకార్యముల నిశ్చయం, పుత్ర పౌత్ర సుఖం, ధనలాభం, బంధు సమాగమం అంతవరకు విడువడని చిక్కువ్యవహారాల పరిష్కారమూ మొదలగునవన్నీ సిద్ధించును. అవసరానికి తగిన ద్రవ్యం సమకూడి పనులు నిర్విఘ్నంగా కొనసాగి పోవును. కించిత్తు ఋణంకూడా చేయవలసివచ్చును.

అనూరాధ 1, 2, 3, 4. పా. వారికి విశ్రాంతిలేని పని భారమూ, రాత్రింబగళ్ళు శ్రమా, కలుగును, శరీరంలో తీవ్రంగా ఉష్ణాధిక్యం తాపం, మనస్సులో పరిపరి విధాల ఆలోచనలూ, విశ్రాంతిలేక ఎప్పుడూ ఏదోవిధంగా కుటుంబం గూర్చిన పనిపాట్లలో సతమతం అగుటా జరుగును. అన్ని పనులకూ పూనుకొని, ఏ పనినీ సక్రమంగా నెరవేర్చలేక, ఒక స్థిరబుద్ధిగాని, కార్యదీక్ష పట్టుదలగాని లేక క్రిందామీదా పడుచుండుట జరుగును. ఆర్థికంగాకూడ బాగా లాభించినా అనాలోచితంగా ఖర్చుచేయుట, చిరాకు మూర్ఖత్వం, కోపం కలిగియుండుట, జరుగును.

జ్యేష్ఠ 1, 2, 3, 4, పా. వారికి శరీరశ్రమ బడలిక, ఉష్ణాధిక్యం, చిరాకు, మొదలగునవి ఉన్నా పుష్కలంగా ధనలాభం కలుగుటచేత అవి అంతగా బాధించవు. శుభకార్యయత్నాలు ఫలించును. ఉద్యోగులకు వర్తకులకు వ్యవసాయదారులకు, ముఖ్యంగా రాజకీయవాదులకూ, అన్ని విధాలా ధనలాభం, భాగ్యవృద్ధి సువర్ణ ఆభరణ ప్రాప్తి, కుటుంబ సంసార సౌఖ్యం కలుగును సంఘంలో ప్రతిష్ఠ పెరుగును.

## ధనుస్సు

మూల 1 2, 3, 4, పా. వారికి విశేష వ్యయప్రయాసలు కలుగును ఆరోగ్యభంగం అగును. బంధుమిత్రులతో విరోధం కలుగును. అకారణ కలహం, అనవసరవ్యయం కలుగును. తల పెట్టిన పనులకు ఆటంకములు కలుగును. ప్రతి పనీ అయినట్లే ఆశకలుగును. ప్రయత్నం ఎంతగా చేసినా ఫలితం తక్కువగానే ఉండును. సోదర పీడ జరుగును. లేదా సోదర విరోధం కల్గును. శనికి జప శాంతులు చేయించుట మంచిది.

పూర్వాషాఢ 1, 2, 3, 4. పా. వారికి ఇంకా శుభాశుభ మిశ్ర ఫలమే కలుగును. అయితే కుటుంబంలో సుఖసంతోషాలు కల్గును శుభవార్తా శ్రవణం జరుగును. డబ్బు పుష్కలంగా లభించినా, ఏదో విధంగా కొంత పనికి వచ్చినదీ, కొంత పనికిమాలినదీ ఖర్చు జరుగుచునే ఉండును. ఆలోచనలు కోర్కెలు కొల్లలుగా ఉండి రాత్రింబగళ్లు గాలిలో మేడలు కట్టుట జరుగును. స్వల్పంగా అనారోగ్యం కల్గును.

ఉత్తరాషాఢ 1వ. పా వారికి పరిస్థితులు ప్రతికూలంగా ఉండును, తల్లి, లేక మాతృవర్గ పీడజరుగును. స్థిరాస్తి కొంత ఋణ గ్రస్తము కాగలదు. ధనం బాగా కలసివచ్చినా దుర్వ్యయం అవుతుంది. మనస్సు ఎల్లప్పుడూ పరిపరి విధాల ఆలోచనలతో బాధ పడును. సోదర బంధువులతో తగవులు పెరుగును. సంతానంతో మాట పట్టింపులు లేదా పుత్రుల మూలకంగా ధన వ్యయం పెరుగును.

## మకరం

ఉత్తరాషాఢ 2, 3, 4, పా. వారికి కుటుంబ మూలకంగా ధన వ్యయం, కార్య విజయం, కోర్టు వ్యవహారాదులవల్ల లాభం కలిగినా అందుకు తగిన ఖర్చు వెచ్చాలు, బంధుమిత్రాదులవల్ల పెరుగును. శుభకార్యములు ఫలించినా, మానసికంగాను, సంతానం మూలకంగాను అశాంతి హెచ్చును సంఘంలో గౌరప్రతిష్ఠలు హెచ్చును. రాజ, ప్రజా, సన్మానాదులు జరుగును. ప్రతివారివలన గౌరవ సానుభూతులు పెంపొందును. మొత్తంమీద శుభాశుభ మిశ్రఫలం కలుగును.

శ్రవణం 1, 2, 3, 4, పా. వారికి శని దోషంవల్ల శ్రమాధిక్యం ధన వ్యయం కలిగినా, గురు, రాహు, కుజ, గ్రహముల బలంవల్ల అంతగా బాధ ఉండదు. శనికి జపశాంతులు చేయించుట మంచిది. తలపెట్టిన పనులకు ఆటంకం జరుగకపోయినా, ఆలస్యం మాత్రం జరుగును అప్రయత్నంగా జరుగవలసిన పనులన్నీ అతి వ్యయప్రయాసలవల్ల అర్థార్థంగానే జరుగుతాయి. అన్ని విషయాలూ. అనుకూలంగానే ఉన్నా, మానసికంగా మాత్రం అసంతృప్తి తప్పదు.

ధనిష్ఠ 1, 2, పా. వారికి అన్ని వృత్తులలో ఉన్న వారికినీ గొప్ప రాజయోగకరంగా నుండును. ఉద్యోగ వ్యాపారరంగాలలో ఊహించని అభివృద్ధి, గృహవాహన లాభము, నూతన వస్త్రాభరణ ప్రాప్తి. పుష్కలంగా ధనాదాయము బంధుమిత్రులందరినీ అన్ని విధాలా, సంతృప్తి పరచుట, అధికారుల, పెద్దల మన్ననలు పొందుట, సంసార కుటుంబ, భార్యా పుత్రాది సౌఖ్యము, మిత్ర సమాగమం, పదుగురికీ ఉపయోగకరమైన మంచిపనులు చేయుట జరుగును.

## కుంభము

ధనిష్ఠ 3, 4, పా. వారికికూడ అన్ని విధాల రాజయోగకరమైన కాలమైనా. ఇంతవరకు అస్థిరంగాఉండి, "ఎప్పుడు ఏ విధంగా ఏవి తొలగిపోతాయో" అన్న స్థితి మారిపోయి అన్నీ బాగుగానుండి, జీవన సౌఖ్యానికి కావలసిన సుస్థిరత్వాన్ని సంతరించుకొంటాయి. ఇంతవరకు జరుగని పనులన్నీ సక్రమంగా, అవలీలగా జరిగిపోయి సంపదను పెంచగలవు.

శతభిషం 1, 2, 3, 4, పా. వారికి శుభా శుభ మిశ్రమ ఫలం కలుగును. అన్ని విధాల, అన్ని రంగాలలోను ఒకటి పది వంతులు పనికిమాలిన దండగమారి ఖర్చులు జరుగును. పెట్టినంత వరకును ప్రతి ఖర్చూ అవసరమైనదిగా, తప్పనిసరియైనదిగా

ఉండును. కాని చివరకు ఋణంకూడ చేయించును. డాబుదర్పాలకు, వ్యామోహాలకు, లగ్జరీ ఖర్చులకు, బంధు మిత్రులకు, తలకుమించి ఖర్చులుచేసి తర్వాత బాధపడుట జరుగును. అయితే అంత ఖర్చూ ఆదాయంలోనే జరుగును.

పూర్వాభాద్ర 1, 2, 3, పా. వారికి డాబుదర్పాలు హెచ్చు. గొప్పకోసం మెహర్బానీకోసం, ప్రాకులాడుట జరుగును. ధనాదాయానికి లోపం కలుగకపోయినా, ఇతరుల మెరమెప్పులకు, గొప్పలకుపోయి వెచ్చించుట జరుగును. అధికారుల మెప్పునకై ప్రాకులాడినా, ప్రయోజనం మాత్రం శూన్యం. ధనం, సంపద, భాగ్యం, గృహవాహనాదులను బాగా సంపాదించుట జరుగును. నీతి, న్యాయం, ధర్మం, నామకాగా ఉన్నా, మనస్సు ధనం సంపాదించుటకే హెచ్చు ప్రాముఖ్యాన్ని కలిగించును.

## మీనం

పూర్వాభాద్ర 4. పా. వారికి గతంకంటె ఆర్థికస్థితి బాగుగా మెరుగుపడును: ఉద్యోగాదులలో స్థిరత్వం ఏర్పడుతుంది. పదుగురిలో గౌరవ మర్యాదలు పెరుగును. బంధుమిత్రాదుల సహాయం, అధికారులందరి మన్నన, సాటివారిలో గౌరవం అధికం కాగలవు. సంసార కుటుంబ సౌఖ్యమూ, పుత్రపుత్రికాభివృద్ధీ బాగానే ఉంటాయి శుభ కార్యాలలో పాల్గొనుట జరుగును. తలపెట్టిన పనులన్నీ నిర్విఘ్నంగా, సక్రమంగా, అతి సులభంగా నెరవేరుతాయి. కుటుంబంలో సుఖసంతోషాలు వర్ధిల్లును.

ఉత్తరాభాద్ర 1, 2, 3, 4, పా. వారికి గతంలో వచ్చిన చెడు పరిస్థితులన్నీ పూర్తిగా తొలగి, స్తంభించిపోయిన వ్యాపార, వ్యవహారాదులన్నీ అతివేగంగా పరిష్కారం కాగలవు. సమృద్ధిగా ధనం కల్గును. కుటుంబంలో అన్ని రకాల అభివృద్ధులూ, శుభకార్య ప్రయత్నాలూ, అనుకూలంగా కలిసివస్తాయి. ఉద్యోగులకు, వర్తక వ్యవసాయదారులకూ, ముఖ్యంగా విద్యార్థులకూ, నిరుద్యోగులకూ కూడ ఏదో విధంగా కలిసివచ్చి, మనస్సుకి ఉత్సాహం, ధైర్యం, ఆత్మ విశ్వాసం ఏర్పడుతాయి. ఇది మొదలు అన్నీ అనుకూలంగానే ఉంటాయి.

రేవతి 1, 2, 3, 4, పా. వారికికూడ ఈ నెల చాల ఆనందదాయకం. గతములో పడిన ఖేదమూ, వ్యయమూ, ఆందోళనా, అన్నీ తొలగిపోయి, నవవసంతంగా, అన్ని రంగాలలో క్రొత్తదనలతో, పువ్వులతో, పండ్లతో, క్రొంగ్రొత్త శోభతో జీవితోద్యానము తనకే కాక, తనకు సంబంధించిన వారందరికీ మేలుకలిగిస్తుంది. పెద్దవారితో, గొప్పవారితో స్నేహ, సహవాసభాగ్యం ఏర్పడును. సర్వవిధ శుభాలూ చేకూరుతాయి మొత్తంమీద యోగ్యప్రదమైన కాలం.

గమనిక:- నక్షత్ర ఫలితాలను వారి వారి వయస్సు, స్థితి, ఆదాయాదుల ననుసరించి సమన్వయించుకొనవలెను.

సిద్ధాంతి : నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం

# అగ్నిమయం కారాదు అవిచ్ఛిన్నం

## శ్రీ మాదిరాజు రంగారావు

అణువు తరువాత అణువు
బిందువు ననుసరించి బిందువు,
ఊహ వెంట ఊహ
ఒక సమాప్తినందుకొని మరో ఆరంభం!
మనిషి ప్రక్కనే మనిషి
స్వరం అందుకొని స్వరం,
అడుగు వెన్కనే అడుగు
ఒక సమాప్తి నందుకొని మరో ఆరంభం!

ప్రతి హృదయంలో ఉంటుంది సత్యం
పైన వెలిగే సూర్యబింబంవలె
కన్పించకపోవచ్చు మనిషి కంటికి
మబ్బు దాచీ పొగలు సోకి
ధూళి చిమ్మి, అహం క్రమ్మి
ఒక సమయం తమోవృతమై,

దిశా తూణీరంలో వెలుగు చీకటి బాణాలతో
నిల్చిన కాలమూర్తి తలపైనుండి
దూసుకపోతున్నాయి రాకెట్లు.
షర్టుపై ఒలికిన సిరా చుక్కలతో
స్కూలునుండి వస్తున్నారు పిల్లలు!
అగ్నిసుప్త జీవితంతో హిమార్ద్ర కళికలు!

ఉదయం నుండి చీకటిపడే దశలో
మట్టినుండి సౌధాలు నిర్మించే కలకలం
రాత్రినుండి ఉదయమయ్యే స్థితిలో
మట్టిలో సౌధాలు కూల్చే అలజడి
అగ్నిమయం జీవితం కారాదు అవిచ్ఛిన్నం.

శ్రీ ముదిగొండ వీరభద్రయ్య

# రావిశాస్త్రిగారి మూడుకథల బంగారం-అలంకార రచన

అత్యాధునికకాలంలో వచ్చిన నవలల్లో శతాధికంగా అలంకృత వాక్యాలుండటం అన్న విశేషాన్ని ఎక్కువగా రావిశాస్త్రిగారి నవలల్లోనే చూస్తాము - ముఖ్యంగా 'మూడు కథల బంగారం' నవలలో. 'మూడు కథల బంగారం'లో అలంకారాల్ని ప్రయోగించిన సందర్భాలను - వాటివల్ల ఒనగూడిన ప్రయోజనాలనీ ఎత్తిచూపడమే ఈ వ్యాసంయొక్క లక్ష్యం.

"కావ్యం గ్రాహ్యమలంకారాత్"[1] అని వామనుడు చేసిన నిర్ణయాన్ని అపరిపక్వమనస్కులు ఒప్పుకోకపోవచ్చునుగానీ, అలంకార సహితమైన రచన అనలంకృతమైన రచనకన్నా పాఠకులపై ఎక్కువ ప్రభావాన్ని వేస్తుండటంచేత, సాలంకృతరచననే విజ్ఞులు ఆదరిస్తారు. అయితే ఇది ప్రధానంగా కావ్యాలకు సంబంధించిన విషయం. నవలల్లో ఇతివృత్త నిర్వహణ, పాత్రచిత్రణ, సందేశాత్మకమైన ముగింపు, సమకాలీన సామాజిక చరిత్రను కళాత్మకంగా చిత్రించడం, ఒక ముఖ్య జీవితకాల చిత్రణ ఉంటాయి. ఇవన్నీ కావ్యంలో గూడా ఉంటాయి. వీటిపైన కావ్యంలో ప్రకృతి వర్ణన కవితాత్మకంగా చేయబడ్తుంది. నవలల్లో ఈ పనిని విశ్వనాథాదులు [ఏకవీర, వేయి పడగలు మొ॥న రచనల్లో] గొప్పగా చేశారు.[2] రావిశాస్త్రిగారు దాన్నే కొనసాగించారు.

రావిశాస్త్రిగారు అలంకార విరహితంగా కొన్ని సందర్భాల్లో రాయలేరేమోనని నిర్ణయించాల్సి వస్తున్నది. అలంకార సహితమైన రచన రావిశాస్త్రిగారి ప్రత్యేకతల్లో ముఖ్యమైనది.

"ఆ వెన్నెల్లో జాలి దొరకని చీకటి రోదన చేస్తూంటే..."
[పు. 14 - మూడు కథల బంగారం]

"కత్తిలా ఖచ్చితంగానూ, యెండాకాలపు యేటినీటిలా జాలిగానూ చెప్పాడు. [పు. 35].

వంటి వాక్యాలు లేకుండా రావిశాస్త్రిగారి రచనల్ని ఊహించలేము. శాస్త్రిగారి రచనలో గొప్ప 'వక్రోక్తి' రచనా నైపుణ్యం కన్పిస్తుంటుంది - అలాంటి ఒక సందర్భం :- తాను ప్రేమిస్తున్న విమలతో తన ప్రేమ వ్యవహారాన్ని తెల్పడానికి పరిచయం పెంచుకోడం, ఆమె అంతరంగంలోకి తాను పోగల్గడం, అన్న అవకాశం కోసం చూస్తుండగా - అది దొరికిన తక్షణం బంగారయ్య ఆ అవకాశం వాడుకొన్నాడు! అప్పుడు శాస్త్రిగారు రాసిన వాక్యాలు

"సూర్యుడు కొంతసేపు ఆగిపోయేడు. భూమి కూడా అలానే ఆగిపోయింది. ఆ సమయంలో చంద్రుడు ఎక్కడున్నాడో కాని వాడు కూడా ఆగిపోయే ఉంటాడు. ఆస్పత్రి గడియారం ఎలానూ ఆగిపోయే ఉంది. నా గుండె మాత్రం ఆగిపోలేదు. అది ధనధన ధబధబ లాడుతోంది. ఆమె తల దించుకొంది." [పు. 212]

"తేచాద్యాపి వికల్ప్యన్తే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి."[3] అని దండి అన్నాడు. ఉక్తివైచిత్ర్యంతో రావిశాస్త్రిగారిలాంటివెన్నో వాక్యాలు రాశారు.

"లేదు, మా చెల్లి లేదు. మా చెల్లి ఇంట్లోనూ లేదు;... పొరింట్లోనూ లేదు; బళ్ళోనూ లేదు, అమ్మవారి గుళ్ళోనూ లేదు;... ఎండిపోయి తామరతో నిండిపోయిన ఊరిమధ్య చెరువుమధ్యా లేదు; దాని గట్టున విస్తరించుకున్న మర్రిచెట్టు ఊడల పందిరికిందా లేదు, ఈ భూమ్మీదా ఆ ఆకాశంకిందా ఎంత వెతికినా ఎక్కడా లేదు మా చెల్లి, మా చెల్లి" (పు. 83)

చనిపోయిన చెల్లెలి కారణంగా ఏడుస్తున్న బంగారుబాబు హృదయాన్ని ఆవిష్కరిస్తున్న ఈ వాక్యాల్లో ఏ అలంకారం ఉందో ఎలా చెప్పగలం? కాని లేదు-లేదు అన్న పునరుక్తి ఆ సోదరుని ఉద్వేగాన్నీ, దుఃఖాన్నీ "భూమ్మీదా ఆ ఆకాశంకిందా ఎంత వెతికినా ఎక్కడా లేదు" అన్న విచిత్రోక్తితో మాత్రం ఉన్నదని చెప్పవచ్చును.

రచనల్లో రామణీయకత ఉన్నచోట్ల వక్రోక్తి కాని, అలంకారం కానీ ఉండకుండా సాధారణంగా ఉండదు. జీవితాన్ని గాఢంగా అనుభవిస్తున్న వ్యక్తుల్నే పాత్రలుగా రచయితలు తమ నవలల్లో ప్రవేశపెడ్తారు. గాఢానుభూతిని పాఠకులకు సమర్థవంతంగా అందించే కవిత్వభాషే అలంకారం. ఈ నవలలోని బంగారుబాబు పాత్ర జీవితం యొక్క అడుగుకి వెళ్ళి మళ్ళీ ఎవరెస్టు శిఖరం ఎక్కదలచుకొన్నవాడు. "నాకు ఎందుకు అలా అనిపిస్తోందో చెప్పలేనుగాని, నువ్వు

చెడిపోయిన శ్రీరామచంద్రుళ్లా నాకు అనిపిస్తున్నావు'' అని వియత్నాం విమల బంగారయ్యగారితో (అలంకారికంగా) అనడం బంగారయ్యగారి లోని వెలుగునీడల్ని ఎంతో తేలికగా పాఠకునికి అవగాహన చేయించ గల్గుతున్నది.

అలంకారాలు సాధారణంగా ఉపమాభేదాలుగానే పుట్టాయని అలంకారికుల్లో కొందరు అభిప్రాయపడ్డారు. ఒక వస్తువునకు మరో వస్తువుతో సాధర్మ్యంచేత సామ్యాన్ని చూపిస్తున్నప్పుడే ఉపమా లంకారం పుడుతుంది. ఈ అలంకారాన్ని శాస్త్రిగారు వేరు వేరు సందర్భాల్లో ప్రయోగించారు. 3(ఎ)

ఒక పాత్రను తన రచనలో ప్రవేశపెడుతున్నప్పుడు రావి శాస్త్రిగారు ఆ పాత్రను ఏదైనా ఒక ఉపమతో కాని, ఉపమాభేదంతో కాని ప్రేక్షకుల మనఃఫలకంపై ముద్రిస్తారు. దొంగనోట్ల కేసులో దారిద్ర్యంలో చిక్కుకున్న బైరాగి నాయుడిపాత్రను పాఠకులకు చూపిస్తూ శాస్త్రిగారు

"బిడ్డ బతుకోసం పాతిరొచ్చేం సెరుపుకున్న తల్లిలాగ్గ ఉన్నాడా బైరాగినాయుడు. [పు. 142]

అని రాస్తారు. ఈ పోలికతో బైరాగినాయుడియొక్క మంచితనమూ, తప్పనిసరి పరిస్థితుల్లో అతడు చెడిపోవాల్సి రావడమూ మాత్రమే కాకుండా, ఈ కథలో అంతర్లీనంగా ఉన్న "కరుణా సరస్వతి''ని కూడా ఈ ఉపమ అవగాహన చేయిస్తూ బైరాగినాయుణ్ని పాఠకు లకు స్పష్టంగా చూపిస్తుంది. బైరాగి నాయుణ్నీ, అతనివెంట ఉన్న క్రూరుడూ, దుర్మార్గుడూ అయిన కర్రిపంతుల్నీ వర్ణిస్తూ శాస్త్రిగారు

"ఈ లంజకొడుకుని (కర్రిపంతుల్ని) జూస్తె ఈడు తోక తెగ్గి పొయ్యి కాళ్ళిరిగిపొయ్యి తాటికాయ నెత్తిమీద పడిపొయ్యిన కునుకు నక్కలాగ్గ ఉన్నడు. ఆడు (బైరాగినాయుడు) జూస్తె ఆదిసివుడు అన్నం పడుక్కుంటున్నట్టు ఆడున్నడు,''

అని ఉపమలతో ఇద్దరి ప్రత్యేకతల్ని తెల్పడం పాఠకులపై చెరగని ముద్రవేస్తుంది. బైరాగినాయుడి ఇతివృత్తంవల్లే విమల బంగారం విషయంలో కఠినాతి కఠినంగా ప్రవర్తించినప్పటికీ అతడు ఊరికే ఉండిపోయాడు. తాను చేసిన పాపం పోగొట్టుకోలేనిదన్న అవగాహన దానివల్లే అతనికి కల్గింది. అందుకే బైరాగినాయుణ్ని భిక్ష మడుగుకుంటున్న ఆదిశివునితో పోల్చి అతని ఔన్నత్యాన్ని రచయిత పాఠకులకు తెలుపుతున్నారు. బైరాగినాయుడివెంటే ఉన్న అతని చిన్నకూతురును వర్ణిస్తూ

"సిలక సిన్నపిల్లగ మారినట్టుంది ఆ పాప.'' [పు. 143]

అని రాస్తారు శాస్త్రిగారు. నవల మొట్టమొదటి పుటలోనే విమల తండ్రిని ప్రవేశపెడ్తూ రచయిత.

"[అతను కడిగేసిన జీతపురాళ్ళతప్ప మరేమీ ముట్టుకోలేదు.] అతను నిప్పురవ్వ, వజ్రపుతునక, నిర్మలాకాశం. నిప్పురవ్వలూ, వజ్రపుతునకలూ మనకి కనబడతాయి, దొరుకుతాయి. కాని నిర్మలా కాశం ఎప్పుడోకాని మనకి కనిపించదు. ఏదో ఒక మేఘకళంకం... ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. కాని విమల తండ్రి ఏ కళంకం లేకుండా ఉద్యోగంలోంచి రిటైరయేడు'' [పు. 10]

అని అంటారు. ఒక పాత్రని తన ఇతివృత్తంలో ప్రవేశపెట్టేటప్పుడు వాళ్ళ రూపమూ, వేషమూ మాత్రమే కాకుండా ఉపమాది అలంకారా లతో వాళ్ళ మౌలిక గుణాలనూ, ప్రత్యేకతలనూ కూడా శాస్త్రిగారు తెల్పుతుంటారు. రూపమూ గుణమూ కలిపి ఒకేచోట ఉపమతో వివ రించడం అక్కడక్కడా శాస్త్రిగారు చేశారు.

"దేముడు ప్లీడరుగారు ఐక్కగా పొడవుగా కొంగలి పొగా పెట్టినట్టు ఉండేవారు. మా నాన్న అంతగా పొట్టివాడు కాకపోయి నప్పటికీ ఎందుపల్లనోగాని పిల్లికి పొగా పెట్టినట్టు ఉండేవాడు. పిల్లులు కొన్ని దర్జాగా డాబుగా ఉంటాయి. కొన్ని పిల్లులు క్రూరంగా కఠినంగా ఉంటాయి, మరికొన్ని అందంగా సుకుమారంగా ఉంటాయి. కాని, మా నాన్న బోడిబాపనమ్మ ఇంట్లో వజ్జిగ మెతుకులు తినే ముసలిపిల్లిలా జాలి జాలిగా ఉండేవాడు. అతన్ని చూస్తే ఈ పిల్లి ఎలుకతో చెలగాటాలాడగలిగిన పిల్లి ఎన్నటికీ కాదని ఎవ్వరికైనా సరే తెలిసిపోతుంది.'' [పు. 54]

జీవిత పోరాటంలో ఘోరంగా ఓడిపోయి, చచ్చిపోబోతున్న ఆ ప్లీడరు గుమాస్తాయొక్క స్వరూప-స్వభావాల్ని తెలిసికోవడానికి ఈ అలంకృత వాక్యాలెంతగానో పనికివస్తాయి. కేవలం స్వరూపాన్ని తెల్పడం మినగా శాస్త్రిగారు అతని నిర్జీవపు జీవితాన్ని ఎలా తెలిపారో చూడండి.

"అవి [మీసాలు] పండిపోయినప్పటికీ తెలుపూ తళుకూ లేకుండా కిందబేడాది ఎండుగడ్డిలా వెలవెలబోతూ మడ్డి మడ్డిగా ఉండేవి.'' [పు-54]

ఇంతకన్నా అతని దారిద్ర్యాన్ని స్పష్టంగా అర్థమయ్యేటట్లుగా అందరికీ అనుభవంలో ఉండే ఇంకో ఉపమానంతో తెల్పారు.

"మూడురోజుల ముసురులో మూలగదిలో ఆరీ ఆరని బట్టలు ముక్కవాసన వేసినట్టు మా నాన్న దగ్గిర ముక్కవాసన వేసేది. ఆ వాసనే పేదవారి బీదవాసన అని నాకు ఇప్పటికీ అనిపిస్తూ ఉంటుంది.'' [పు-54.]

రావిశాస్త్రిగారు ఒక తొంబైయేళ్ళ ముసిలమ్మని ఈ నవలలో ఒక్క క్షణకాలం కోసం ప్రవేశపెడ్తూ - కొద్దిసేపే కదా ఈమె ఇతివృత్తం అని ఊరుకోకుండా - ఉన్నంతలో ఎంత గొప్పగా ఆమెను వర్ణించారో చూడండి.

"ఆమె కళ్ళు గాజుగాజుగా కాకుండా నీరునీరుగా చచ్చిపోయిన కళ్ళు స్మశానంలోంచి తిరిగొచ్చినట్టుగా ఉన్నాయి." [పు. 244]

ఎలాంటి పరిస్థితుల్లో కూడా ఆ ఇంటివాళ్ళను [విమలవాళ్ళను] అనుసరించడమే తప్ప ఎప్పుడూ వాళ్ళకి తాను అధికారి కాలేని కనకరాజనే పోస్ట్‌మాన్‌ని ప్రవేశపెడ్తూ శాస్త్రిగారు

"అతను శ్రీరామచంద్రుడికి ఆంజనేయుల్లా ఉండగలిగిన వాళ్లాగే కనిపించేడు కాని ఆంజనేయుడికి శ్రీరామచంద్రుల్లా ఉండగలిగినవాళ్లా కనిపించలేదు." [పు. 230]

అని అంటారు. తన హత్యకు ముందర విమల - తన భర్త దొంగ ఆర్జితాల విషయంలో అతనిపై ఇన్‌కంటాక్స్ వాళ్ళకు రాసిన లేఖను ఈ కనకరాజుతోనే పంపింది.

చూడటానికి అందంగా, రమ్యంగా లేని పాత్రల్ని సైతం ప్రవేశపెడ్తున్నప్పుడు శాస్త్రిగారు అనలంకృత రచన చేయలేదు.

బంగారుబాబు బావగారి రెండో పెళ్ళాన్ని వర్ణిస్తూ రచయిత "దిబ్బరొట్టెలా ఉండేది. కాని తెల్లగా కొబ్బరికాయ ముక్కలా ఉండేది. అయితే బాగా ముదిరిపోయిన కొబ్బరిముక్కలా ఉండేది. కొరకడం కష్టం. నమిల్తే రుచి తక్కువ." [పు. 71]

తెల్లంగా ఉండి కూడా అందంగా లేదనీ, లేతదనమూ, నాజూకుతనమూ లేనిదనీ, కొరకరాని కొయ్యనీ తెలుపదలచుకొన్నారు రచయిత. నారాయణ అనే దుష్టుణ్ని ప్రవేశపెడ్తూ

"ఆడు శాయకి అమ్మామ్ సబ్బులా ఆకుపచ్చగ ఉన్నాడు గాని ఆడి జుట్టు పియర్స్ సబ్బులా మాడిన ఇటికరంగులా ఉంది."

[పు. 115-116]

అని వర్ణిస్తారు. వాడి రూపం ముఖ్యంగా రంగు-జుట్టు రంగు ఆకర్షకంగా లేదన్నమాట! జుట్టుకి ఆ రంగేం బాగుంటుంది? రైల్లో ప్రయాణం చేస్తున్న ఓ వెధవరాలిని వర్ణిస్తూ

"తీరుగనే ఉందిగాని కుసింత ఎలాగున్నదంటే కుసింత సల్లారిపోయిన పెసరట్టులాగ్గ ఉంది. పెసరట్టు బాగా సల్లారిపొయ్యిందంటే సూపుకీ బాగుండదు, రుసికీ బాగుండదు. (పు. 159)

తను వేసిన ఉపమానాన్ని తానే వివరించడం కూడా ఇందులో ఒక ప్రత్యేకత! మరో స్త్రీని వర్ణిస్తూ

"ఆళ్లల్ల పాతికేళ్ళ ఆడమనిసి ఒకుర్తె పరవతంలాగ్గ ఉంది... అయమ్మ కళ్లు సెక్రాల్లాగ ఉన్నయి." [పు. 159]

ఒక స్టావ్‌సర్స్‌ని ప్రవేశపెడ్తూ

"ఆవిడ గేదెలా ఉంది." (పుట. 250)

అని రాశారు. ఇంచుమించు అపవాదం లేనేలేదన్నట్టుగా ప్రతి పాత్రనూ నవలలో మొదటగా పరిచయం చేస్తున్నప్పుడు ఆ పాత్రల స్వరూప స్వభావాల్ని పాఠకులు సులభంగా అర్థం చేసికోవడం కోసం రావిశాస్త్రిగారిట్లా అలంకారాల్ని (ఉపమ) ప్రయోగించారు.

కొన్ని ప్రత్యేక మానసికస్థితుల్ని వర్ణించేటప్పుడు కూడా శాస్త్రిగారు అలంకార ప్రయోగాలు చేశారు. పాత్రల మానసిక సంఘర్షణ, సౌందర్యానుభూతి, కారుణ్యానుభూతి, శృంగారానుభూతి, దిగ్భ్రాంతి, పాపభీతి, జుగుప్స మొ॥న అనుభూతుల్ని తెల్పేటప్పుడు శ్రీ రావిశాస్త్రిగారు అలంకృతవాక్యాల్ని గుప్పించారు.

ఈ సందర్భాల నొక్కొక్కదాన్నే పరిశీలించాలి.

పాత్రల మానసిక సంఘర్షణను సూచించడానికి శాస్త్రిగారు చేసిన ఆలంకారిక రచన ఎంతో గాఢమైనది. బైరాగినాయుడు దొంగ నోట్ల వ్యవహారంలో మోసగింపబడి, ఏడుస్తున్న కూతురి ఎడంచెయ్యి పట్టుకొని నడిచిపోతున్నప్పుడు బంగారిగాడు మనస్సులో ఎంతో వ్యథపడ్డాడు. నవల చివరిదాకా అతని మనస్సులో తన ఈ పాపకార్యాన్ని మరచిపోలేకపోయాడు.[4] అందుకని శాస్త్రిగారు ఆ పిల్ల ఏడ్పుపై ఇట్లా రాశారు - "ఆ సయ్యింకాలం, దెబ్బతిన్న ఏదో పిట్టో, ఏదో పువ్వో ఏడ్సుకు పోతా పోతా ఉన్నట్టు అనిపిచ్చింది నాకు ఆ బిడ్డ యేడుపు యింటుంటే" [పు. 146] ఈ వాక్యాలు మన గుండెను కూడా పిసికివేస్తాయి బంగారిగాడి గుండెల్లో ఈ దృశ్యం - అందే ఏదో దెబ్బతిన్న పిట్టో లేకుంటే పువ్వో ఏడ్చుకుంటూ పోయినట్లు అన్పించటం - ఎంత శాశ్వత ప్రభావాన్ని వేస్తూ నిల్చిందో, పాఠకుల గుండెల్లో కూడా అంతే.

తన ప్రాణంతో సమానంగా ప్రేమించుకొన్న భార్య విమల హత్య చేయబడేటప్పటికి పక్కనే ఉన్న బంగారయ్యకా దృశ్యం కనిపించిన పద్ధతిని శాస్త్రిగారు.

"...బతుకులోంచి చావులోకి ఇంకిపోయింది విమల వెన్నెలంతా ఎండలోకి ఇంకిపోయినట్టుగా" [పు. 322]

అని వర్ణిస్తారు. ఇంకిపోవడం అన్న సామాన్యమైన వాడుక శబ్దాలకే ఇక్కడ శాస్త్రిగారు కవిత్వ గౌరవాన్ని కలిగించారు. వెన్నెలంతా ఎండల్లోకి ఇంకిపోయినట్టుగా" [పు. 322].

అని వర్ణిస్తారు. ఇంకిపోవడం అన్న సామాన్యమైన వాడుక శబ్దాలకే ఇక్కడ శాస్త్రిగారు కవిత్వ గౌరవాన్ని కలిగించారు. వెన్నెలంతా ఎండలోకి ఇంకిపోయినదాన్తో పోల్చడం కవిత్వీకరణకు పునాది వేయడం. ఆ క్షణంలో అతని మనఃస్థితిని ఇంతకన్నా గొప్పగా వర్ణించడం కష్టసాధ్యం. ఒక వైభవోపేతమైన స్వాల్పకాలిక జీవితాన్ని వెన్నెలతోనూ, రానున్న పాపరహితమైన, ధర్మతీవ్రతతో కాగిపోబోతున్న జీవితాన్ని ఎండతోనూ శాస్త్రిగారు సూచిస్తున్నారు. విమల మీపగా బంగారయ్య జీవితాన్నే శాస్త్రిగారు సూచిస్తున్నదిక్కడ.

సరళ సముద్రంలో దూకి ఆత్మహత్య చేసికొన్నప్పుడు చెల్లెలు విమల మనస్సులో అనుభవించిన మానసిక సంఘర్షణను శాస్త్రిగారు చిరస్మరణీయంగా వర్ణించారు.

"అటు చూస్తే కొండ బండలు, ఇటు చూస్తే రాక్షసిడొంకలు. కాని ఇది విమల. అటు చూస్తే పెద్దపులుల కోరలు, ఇటు చూస్తే పడగలెత్తిన పాములు. కాని ఇది విమల...అటు చూస్తే దొరికే ఎండలు. ఇటు చూస్తే కొరికేనీడలు. అవును సరే, కాని ఇది విమల. అటు చూస్తే ఎత్తు దొరకని మంచు మహాపర్వతాలు, ఇటుచూస్తే లోతుచిక్కని చీకటి అగాధాలు లేదా ఒడ్డులేని మహా సముద్రాలు. అవునవును ఇది విమల..." [పు. 26]

క్షుభిత పరిస్థితుల్లోంచి ధైర్యంగా, నిలదొక్కుకోగలిగిన ఒక మహా శక్తిగా విమల పరిణమించబోవడాన్ని ఈ అలంకారీ రచన మధ్య మధ్య-ఇది విమల-అన్న ముక్తాయింపుతో శాస్త్రిగారు సూచించారు. పెద్దపులుల కోరల మధ్యన, పాముల పడగల మధ్యన ప్రజ్వరిల్లిన ధైర్యంతో విమల చిక్కి గూడా, నిలదొక్కుకోగల్గడాన్ని ఇతివృత్త వివరణ లేకుండా ఈ రకమైన రచనద్వారా సాధించారు శాస్త్రిగారు.

అత్యంత సుందరమైన వస్తువును సుందరంగా వర్ణించడం ఎంతో శక్తిమంతంగా చేశారు శాస్త్రిగారు. నర్సుగా పనిచేస్తున్న విమలను బంగారయ్యగారు చివరి ఇతివృత్తంలో మొదటిసారిగా చూసినప్పుడు ఆమె సౌందర్యానికి అతడు ముగ్ధుడవుతాడు. అప్పుడతడనుభవించిన సౌందర్యానుభూతిని శాస్త్రిగారు అనితరసాధ్యంగా, అత్యంత రమణీయంగా వర్ణిస్తారు.

"అహో! అందమా, నువ్వు శరత్కాలపు చల్లచల్లని పూర్ణచంద్రుని రేఖవే! ఓహో అందమా! నువ్వు మాఘమాసపు ఉదయ కాలపు సూర్యకిరణ శోభవే! అవునందమా, నువ్వు ఎండవేళల పంచ రంగుల మంచుకొండల వన్నెవన్నెల వెలుగువే! అందమా నువ్వు వేయి రాత్రుల నీలివెన్నెల మంచుసోనల జల్లువే! అవునందమా, పొంగిపొర్లే నువ్వు ఎర్రనెర్రని గోదావరి ఎర్రనీటి వరదవే వరదవే! అందమా అందమా, నువ్వు పూలకోటి తోటవే. కోటితోటల పూలవే! ఓ అందమా, నువ్వు చీకటికి కాంతినిచ్చే కంటి కాటిక రేఖవే! అవును, అవునవును, ఔనౌహో, ఓ అందమా అందమా, అవును సుమా, నువ్వు నీలాల నింగిని కూడా వెక్కిరించి ధిక్కరించే నీలి మహా సముద్రానివే! ఓహో అందమా, ఓ అందమా..." [పు. 178]

ఆమె అందంగా ఉందని మాత్రమే కాదీ వర్ణన అర్థం. ఆమెలోని అందమూ-ఆమే- ఒక్కటే. అందం వేరూ, ఆమె వేరూ కాదనడం- దాన్తోపాటుగా ప్రకృతిలోని ఏయే శోభావంతమైన విషయాలతో దానికి 'తాదాత్మ్యం' ఉందో చెప్పారు కవి ఒక్కొక్క అలంకృత వాక్యం విమలలోని ఒక్కొక్క అంశాన్ని తలపింపజేస్తుంది. ముఖమూ, శరీర తేజమూ, శరీర లావణ్యం, హాసం, యౌవనం, కోమలత్వం, కన్నులకాంతి, కురులూ-వీటన్నిటినీ క్రమంగా ఒక్కొక్క వాక్యం తెల్పుతుంది. అందాన్ని ఇంత అందంగా వర్ణించకపోతే పూర్వాలంకారికుల "సౌందర్యమలఙ్కారః — కావ్యం గ్రాహ్యమలఙ్కారాత్" అన్న సూత్రీకరణలు వచ్చేవే కావు! ఇంత అందాన్ని మొదటిసారిగా చూస్తున్నప్పుడు బంగారయ్యకిలా స్ఫురించింది.

"అర్ధరాత్రి పున్నమిచంద్రుణ్ని అకస్మాత్తుగా నిద్రలేచి చూసినట్టు, ఉదయించే సూర్యుణ్ని జీవితంలో మొదటిసారి చూసినట్టు, డార్జిలింగ్ ఎండలో మంచుకొండల్ని చూసినట్టు, వరద గోదావర్ని రాజమండ్రి గట్టుమీంచి చూసినట్టు, ఏరాడకొండమీంచి సాగరతీరాలని చూసినట్టు నేను ఆమెని నివ్వెరపోయి నిర్భ్రాంతపడిపోయి చూసేను." [పు. 178.]

సౌందర్యవర్ణన చేసినప్పుడెక్కడా శాస్త్రిగారు అంగాంగవర్ణన చేయలేదు. తన కాబోయే ప్రేయసి, భార్యను - పైవిధంగా, ఆవేశపూరితంగా వర్ణించగా, తన ముద్దులచెల్లెల్ని ఎంత నింపాదిగా, నిబ్బరంగా వర్ణించారో చూడండి.

"(మా చెల్లి కూడా చాలా అందంగా ఉండేది) గొల్లకృష్ణుడు తెల్లపిల్లగా మారినట్టు జిగజిగలాడుతూ ఉండేది. గాజూ, బంగారం, వెన్నముద్దలూ, మల్లెపువ్వులూ, నల్లమబ్బులూ, అన్నింటినీ తీసుకొచ్చి చేసిన మాయబొమ్మలా ఎంతో మనోహరంగా ఉండేది." [పు. 58]

తన చెల్లెలి సౌందర్యాన్ని తారతమ్యదృష్టితో వర్ణించాల్సి వచ్చినప్పుడు ఆమె సౌందర్యం ఎలా గొప్పదో తెల్పుతూ

"ఆ తండ్రీ తల్లీ ఆ కొడుకూ కూతుర్ల మధ్యకి (కామూగాడి ఇంట్లోనన్న మాట) మా చెల్లి వచ్చి పడింది. పనసపళ్ళ మధ్యకి కమలాపండు వచ్చినట్టు, సున్నుండల మధ్యకి రసగుల్లా చేరినట్టు, మైన గోర్ల మధ్యని రామచిలుక వాలినట్టు వాళ్ళింటికి వచ్చింది మా చెల్లి." [పు. 70]

అని సాదృశ్యపూర్వకంగా రాశారు రావిశాస్త్రిగారు. ఆ చెల్లీ, కామూగాడి కుటుంబ సభ్యులూ అన్న రెండువర్గాలూ సుందరమైనవే. ఐతే తారతమ్య వివక్ష చేస్తే మాత్రం బంగారుబాబు చెల్లెలు ఎక్కువ సుందరమైనది. దాన్ని అందంగా తెల్పడానికే ఈ రకమైన అలంకారిక రచన. వానలో గొడుగు పట్టుకొని వెళ్తున్న అత్యంత సుందరమూర్తి విమల వెళ్తుండడాన్ని శాస్త్రిగారెట్లా సంభావించారో చూడండి.

"కాళ్లూ చేతులూ ఉన్న గులాబీపువ్వు పనసాకు నెత్తికి అడ్డు పెట్టుకొని గునగున నడుచుకు వెళిపోతూన్నట్టు వెళ్ళిపోతోంది వర్షంలో వియత్నాం విమల". [పు. 240]

ఇక్కడ విమలతో గులాబీపువ్వుకి అభేదారోపం. తలమీది ఆ గొడుగుకు పనసాకుతో అభేదారోపం. కాళ్ళూ చేతులూ ఉన్న గులాబీ పువ్వుగా గోచరించడమే విషయి(గులాబి), విషయి(విమల), రూపంగా అవభాసించడం. ఎంతో చక్కని ఆలంకారికశైలి ఇది. విమల బంగారయ్య ఆసుపత్రిలో ఉన్న గదికి వచ్చింది. ఆమె సౌందర్యానికెంతో ముగ్ధుడై

"పంజరంలోకి చిలక వచ్చినట్టు, పెరట్లో మొక్కలకి గులాబీలు వచ్చినట్టు, మామిడిమొక్కకి పూత వచ్చినట్టు, లైట్ హౌస్‌కి దీపం వచ్చినట్టు, పీటలమీద కూర్చున్న అమ్మాయి బుగ్గ మీదికి పెళ్ళికూతురి కళ వచ్చినట్టు, నీలాకాశంలోకి నిండుచంద్రుడు వచ్చినట్టు నా గదిలోకి వచ్చింది విమల" [పు. 250-1]

అని అంటాడు. సౌందర్యవర్ణన చేస్తున్నప్పుడు రావిశాస్త్రిగారి రచన అలంకార విరహితంగా ఉండదు. ఆ అలంకారాలు కూడా చాలా సహజంగానూ, ప్రతిభా స్ఫోరకంగానూ ఉంటాయి. చచ్చిపోబోతున్న సుందరమైన విమల ముఖాన్ని వర్ణిస్తూ "ఉదయం ఆరుగంటలకి అస్తమించబోయే చంద్రబింబంలా ఉంది విమల ముఖం [పు. 321] అని రాశారంటే సౌందర్య వర్ణనాఘట్టాల్లో శాస్త్రిగారెంతో పట్టుదలగా అలంకృత రచన చేశారనే నిర్ణయించవచ్చును.

తన బావగారికి తక్షణం వైద్యసహాయం చేయించడం కోసం నర్స్ విమలముందు వేల రూపాయల నోట్లకట్టను పెట్టినప్పుడు— సుందర విషయాలను వర్ణిస్తున్నప్పుడు శాస్త్రిగారెంత సుందరంగా వర్ణించారో - దాన్ని అంత జుగుప్సాకరంగా వర్ణించారు.

"ఆమె, పట్టుతివాసీమీద పడ్డ పిల్లి పెంటని చూసినట్టు ఆ డబ్బువైపు అసహ్యంగానూ, ఆ పిల్లిని చూసినట్టు నావైపు కోపంగానూ చూసింది." [పు. 181]

పాపభీతిని వర్ణిస్తూ బంగారయ్య "నేను ఆమెముందు దేముడి గుళ్ళోకి ప్రవేశించిన దొంగదెయ్యంలా నిల్చున్నాను." [పు. 208] అని అంటాడు. విమల అనే ధర్మమూర్తి ముందు పరమ పాపాత్ముడైన బంగారయ్యను చూపడానికే ఆలంకారిక రచన ఎంత సౌలభ్యాన్ని కల్గిస్తోంది?! కారుణ్యానుభూతిని వర్ణించేచోట్ల శాస్త్రిగారి రచన అత్యంత సుందరంగా ఉంది. ఉదయవేళలో సముద్రంలోంచి కొట్టుకొచ్చి దొరికిన చెల్లి శవాన్ని బంగారుబాబు చూసినప్పుడు

"తోటలోని ఆకులకీ కొమ్మలకీ సూర్యుడు తెగిపోయి తెగిపోయి మా చెల్లిని తాకడానికి చేతుల్లేకుండా అయిపోయాడు" [పు. 85]

అని రాస్తాడు రచయిత. ఈ జరిగిన పాపానికి, దురన్యాయానికి సూర్యుడికి కూడా తేజం లేకుండా పోయిందనీ — ముఖం లేకుండా పోయిందనీ— చెప్పడం ఇది. బావిలోపడి చచ్చిపోయిన తల్లి శవాన్ని చూసి — "బతికి ఉన్నప్పుడు కళ్ళంటే నీరు కార్చేది కాని చనిపోయిన తరవాత ఆ నడవలో మా అమ్మ వళ్ళంతా నీరు కార్చింది." అని రాస్తారు శాస్త్రిగారు. ఈ ఉక్తివైచిత్ర్యమే అనేకవిధాల అలంకారాలుగా రూపొంది పాఠకులను ఆకర్షించుకొంది. శ్లేష, తర్కమూలకమైన అలంకారాలు నవలల్లాంటి ప్రక్రియలలో ఇముడకపోవచ్చును. శాస్త్రిగారు సాదృశ్యమూలకమైన ఉపమాలంకారాన్నే ఎక్కువగా వాడారు. ప్రకృతిలోని అనేక వస్తువులతో, విషయాలతో తన పాత్రలకూ, వాటి జీవితాలకూ సాదృశ్యాలను వారు దర్శించగలిగారు కాబట్టే వారి అలంకార రచన ఎంతో సహజంగా ఉన్నది. ఇతివృత్తంలో వారు పొందిన తాదాత్మ్యమే ఈ సహజ అలంకారసృష్టికి కారణం. ఈ మూడు కథల బంగారం నవలలో 'బంగారం' అన్నది మూలం. దాన్ని కేవల వస్తుమాత్రంగా వారు దర్శించలేదు. మనిషిలోని ధర్మాధర్మాలకి 'అది' గీటురాయిగా నిలుస్తున్నది. బంగారుబాబు పతనానికి అదే కారణం. 'దానికి' లొంగకుండా నిల్చిన విమల ఔన్నత్యానికి పరోక్షంగా అదే కేంద్రం. ఇహ మళ్ళీ పాపమయమైన జీవితాన్ని గడపవద్దని నిర్ణయించుకొని తిరుపతికివెళ్తున్న బంగారిగాడికి రైల్లో ఒక పెళ్ళి పార్టీ వాళ్ల బంగారం దాచుకున్న పెట్టెలు కన్పించి, దాన్ని దొంగిలించి ఆ బంగారాన్ని వాడు చూసినప్పుడు రావిశాస్త్రిగారి అలంకారిక రచన మకుటాయమానమైంది.

"గాని బంగారం ఆ సజ్జలో సుట్టుసుట్టుకొని పాంవులు పాంవులుగ వుంది. ఒజ్జిరాల్తొ ఒయిడూరాల్తొ సుక్కలు సుక్కలుగ వుంది. రంగురంగుల లతల్లాగ తీగెలు తీగెలుగ వుంది. సెందమాంవని ముక్క ముక్కలు సేసినట్టు సల్లసల్లగుంది. ఆడోళ్ళ గుండెల్లాగ్గ బరూబరూగ్గ వుంది. పొదలంట పులికళ్లు దాగున్నట్టు ఆ బంగరంవంత ఆ సజ్జలో మాటేసుకు కూకుంది." [పు. 168]

ఈ నవలలోని మొత్తం పాత్రలు — బావ రామచంద్రయ్య, భారతి విమల, బంగారిగాడి మూడవతారాయీ, సూర్రావు హెడ్డూ-ఇత్యాదులు- అందరూ ఈ ఆలంకారిక వాక్యాల్లో సూచింపబడింది.

కేవల సౌందర్యమే కాదు - రచన పాఠకులపై అత్యంత ప్రభావాన్ని వేయడంలో కూడా ఈ రకమైన రచనావిధానం ఎంతో

తోడ్పడుతుంది. రావిశాస్త్రిగారి రచనకున్న శక్తులలో ఇది కూడా ఒక్కటి. ఈ రకమైన రచనకు అంధానుకరణలు సైతం ఇంతవరకు తెలుగు సాహిత్యంలో రాకపోవడం శాస్త్రిగారికి శాస్త్రిగారే సాటి అని నిరూపిస్తోంది.

"అలంకారం మనిషిని జెనెటిక్‌గా ప్రభావితుణ్ని చేసి నాగరికత ఉద్భవానికి మార్గం వేస్తుంది."5

అనిన యుగకవి గుంటూరు శేషేంద్రశర్మగారి మాటలు చిరస్మరణీయాలు.

## పాదసూచికలు

1. వామన విరచిత కావ్యాలంకార సూత్రాణి.
2. చూడండి - ఈ వ్యాసరచయితే రాసిన 'వేయిపడగలు - ఒక పరిశీలన' అనే పుస్తకంలోని కావ్యస్థాయి వర్ణనలు-[53-61 పుటలు]
3. దండి-కావ్యాదర్శః - 2-1. ఈనాటికీ కూడా ఆ అలంకారాలు కొత్తకొత్తవి కల్పించబడుతున్నాయి. ఇహ వాటినెవ్వడు పూర్తిగా చెప్పగల్గుతాడు? - చూడు. పుల్లెల శ్రీరామచంద్రుడిగారి వ్యాఖ్యాన గ్రంథంలో పు. 51.

3ఎ. శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు రాసిన 'రాచకొండ రచనల్లో సిమిలీ' జులై 30 అన్న రావిశాస్త్రిగారికి పుట్టినరోజు కానుకగా వచ్చిన గ్రంథంలోని వ్యాసం తప్పక జిజ్ఞాసువులు చదవాల్సిన వ్యాసం - [పుటలు 179 నుండి 191 వరకు]

4. ఈ నవల అంతానికి విమల హత్య చేయబడినప్పుడు ఒక కర్ర పట్టుకొని దానిమీద తన బరువంతా మోపి ఒక ముసలివాడు "ఏటి బాబూ తగువు? బంగారవేనా?" [పు-322] అని అడుగుతాడు. "అతను చాలా ముసలివాడు, చాలా నీరసంగా ఉన్నాడు. కట్టుకున్న పంచె పీలికలై పోయింది. చొక్కా లేదు. పీలికలే అయినప్పటికీ తలకి పగిడీ ఉంది. అతను చెడిపోయిన చక్రవర్తిలా ఉన్నాడు. అతణ్ని ఎక్కడో ఎప్పుడో చూసినట్టు గుర్తు" [పు. 322-3] ఇది బైరాగి నాయుడి వర్ణనే - అతనికి బంగారిగాడు చేసిన పాపం స్మరణకు రచయిత ఇట్లా తెస్తున్నాడు.

5. శ్రీ శేషేంద్ర శర్మగారి రచయితకు 21-8-86 నాడు రాసిన ఒక సాహిత్య లేఖనుండి.

# కనికరింపుము జనని ! ఓ కనకదుర్గ ! !

### ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

పరువు లెత్తును మనసు పాపము లొనర్ప;
పుణ్యముల పైకి ప్రసరింప బోదొకింత
నరుడ జన్మముచేత, వానరుడ లోన;
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

ఆలు బిడ్డల కొరకు నల్లాడిపోదు
ఇహ సుఖమ్ములకై తహతహలు పడుదు
క్షణము నిను గూర్చి చింతింప మనసురాదు
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

కామ కాంచనముల మీది కాంక్ష ప్రబలి
చింత చేసెద నిన్ను తత్సిద్ధి కొరకు
ముక్తి నిమ్మని నిను గోర బుద్ధి రాదు
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

పదవు లిప్పింతువని నిన్ను భజన సేతు
సిద్ధు లొనగూర్తువని నిన్ను చేరి కొలుతు
ముక్తి చేకూర్పు మనెడి ప్రసక్తి రాదు
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

భక్తి నిను గొల్చునట్టి యాసక్తి నున్న
ముదిమి ముదిరిన నీ మాట మదిని చొరదు
దీపముండగ నిలు తీర్చి దిద్ద వలదె?
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

అలకింపదు పల్కు లిల్లా లొకింత
కన్న బిడ్డల కెప్పుడు చిన్న చూపె
అయిన మనలదు మనసు నీకై యొకింత
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

కాస్త నీ నామ సంస్మరణాస్త కుదుర
వికల మొనరించి మనసు వేవేగ పారు
కలదె మార్గమ్ము దీని నాకట్టు కొనగ?
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

ముగ్గుబుట్టైన తలజుట్టు ముదిత మీది
వాంఛ తరగ దదేమొ! రవ్వంత గూడ
పాశవిక బుద్ధి రూపుమాపంగ లేవా!
కనికరింపుము జనని! ఓ కనకదుర్గ!!

పిల్లవానిగ నీ యొడి నల్లజేరి
ఆట పాటల నానంద మనుభవించు
భావన మొసంగు మదియ నా పాలి వరము
కనికరింపుము జనని! యో కనకదుర్గ!!

ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# అర్థశాస్త్రంలో నోబెల్ బహుమతి గ్రహీత

# ప్రొఫెసర్ రాబర్ట్ మెర్టాన్ సోలో

మిల్టన్ హెన్రీ సోలో అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన బ్రూక్‌లిన్‌లో ఉన్ని వ్యాపారానికి సంబంధించిన క్రయవిక్రయ పత్రాల పని చూస్తూవుండేవాడు. ఆయన భార్య హన్నా గెర్ట్రూడ్‌సార్నే. ఈ సంవత్సరం, అర్థశాస్త్రవిజ్ఞానాన్ని పెంపొందించినందుకు నోబెల్ బహుమతి పొందిన, డాక్టర్ రాబర్ట్ మెర్టాన్‌సోలో వారి కుమారుడే.

ఒకరోజు, తనతోపాటు మెస్ససూట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో పనిచేస్తున్న, మరొక నోబెల్ బహుమతి గ్రహీత, ప్రొఫెసర్ పాల్ సామ్యూల్‌సన్‌తో టెలిఫోనులో మాట్లాడుతూ "ఆ నేనేనండీ, ప్రధానంగా మీ జ్యూజాతికి చెందిన కుర్రవాణ్ణి" అని చెప్పాడు. నిజానికి యూదులు మేధావులు. వారిని హింసించినవారు రాజకీయ కిరాతకులు

నోబెల్ బహుమతి గ్రహీత రాబర్ట్ మెర్టాన్‌సోలో 1924 ఆగస్టు 23న జన్మించాడు. అయిదు సంఖ్యక్రింద జన్మించినవారు గొప్ప అర్థశాస్త్రవేత్తలు కావడం గమనించదగ్గ విషయం. కారల్ మార్క్సుకూడా అంతే, ఆగస్టు 8 కావడంవల్ల శ్రమకు, 2 4 ఆరు కావడంవల్ల సంపదకు కారకాలుకాగా, మొత్తం సంఖ్య 29 అనగా రెండుకాగా అతని పరిశోధనలోని ఆలోచన "ఆర్థికవృద్ధిపై సాంకేతిక జ్ఞానప్రభావం" అనే విషయంపై జరిగింది. ఇందుకు వృత్తి సంఖ్య 24లోని 4 (యురేనస్-విద్యుచ్ఛక్తి కారకము) బాగా తోడ్పడింది, నోబెల్ బహుమతి గ్రహణ విజయానికి మొత్తం అంకెల వెరశి పందొమ్మిది బాగా తోడ్పడింది. పందొమ్మిది వచ్చిందంటే అగ్రాసనాధిపత్యము విజయము లభించక తప్పదు. నమ్మకాలతో పనేమిటి? అనుభవంలో జరుగుతున్నదింతే.

డాక్టర్ రాబర్ట్‌సోలో వయస్సు యిప్పుడు 62 సంవత్సరాలు ఇంకా మెస్సషూసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో అర్థశాస్త్రాచార్యుడుగా పరిశోధనలో నిమగ్నమై వున్నాడు. నిజమైన ఆచార్యత్వానికి బోధనా పరిశోధనలలో నిరంతరం నిమగ్నమై విజయాలు సాధిస్తూ సెహబాష్ అనిపించుకోవడం గీటురాయి. పదవి రాగానే పచారలుచేస్తూ బజారులవెంట బడుద్ధాయిల్లాగే తిరిగేవారికి ఆచార్యపదవి అందినా ప్రయోజనం ఎవరికి?

**ఆశయానికి అంకితం :** డాక్టర్ సోలోకు సమకాలిక అధ్యాపకులలో శ్రేష్ఠుడుగా మన్నన అందుతూనేవుంది. వాక్కులో జాజ్వల్యమానంగావుండే హాస్యాన్ని వదులుతూ లోకప్రియత్వం పొందుతూ వుంటాడు. అనేక ఉత్తమ గ్రంథాలపైనా, ఆలోచనలమీద ప్రశంసాపాత్రమైన సమీక్షా రచనలు ప్రచురించాడు. దైనందిన ఆర్థిక సమస్యల పరిష్కారానికి ఆర్థిక విధానాన్ని ఏర్పాటుచేసే ప్రయత్నాలను అత్యధికంగా పటిష్టం చేయడానికి, డాక్టర్ సోలో, తన జీవితాన్ని అంకితం చేసాడు.

1942లో రాబర్ట్‌సోలో అండర్‌గ్రాట్యుయేట్ విద్యకు అంతరాయం కల్గింది. అప్పుడు 18 సంవత్సరాల వయస్సతనది. ఆరోజుల్లో "ఆర్మీ సిగ్నల్‌కార్ప్స్"లో సైనిక కార్యనిర్వహణలో చేరాడు. ఆఫ్రికా, సిసిలీ, ఇటలీలలో యుద్ధకార్యనిర్వహణకు తోడ్పడ్డాడు. రెండవ ప్రపంచయుద్ధం ముగియగానే హార్వర్డ్‌కు తిరిగివచ్చాడు.

అప్పటికే వివాహమయ్యింది. భార్య పేరు మార్తా అర్థశాస్త్రంలో ఆమెకు మంచి జ్ఞానం వుంది. ఉన్నత అర్థశాస్త్ర అధ్యయనంలో రాబర్ట్‌సోలో ప్రవేశించడానికి ఆమె చక్కటి సలహాయే కారణం.

సోలో గురువు : ప్రొఫెసర్ లియంటాఫ్‌కూడా నోబెల్ బహుమతి గ్రహీతే డాక్టర్ సోలో, నోబెల్ బహుమతి గ్రహణాదృష్టానికి నోచుకున్న ప్రొఫెసర్ లియంటాఫ్ విద్యార్థులలో ప్రథముడు. అందుకు సోలో గర్వపడుతూ చెప్పుకుంటాడు. యధాగురూ, తధాశిష్యః. వల్ల బుద్ధివిహీనులవద్దగాక; సుబుద్ధులవద్ద చదువుకుంటేనే విద్యారంగంలో రాణించగలరని విదితమౌతోంది. నక్కలు, తోడేళ్ళు విద్యారంగానికి అపకారం చేస్తాయనేది జగద్విదితంకదా?!

ఎక్కువ కాలం ఉన్నత శ్రేణి ఉపాధ్యాయుడుగా, మెస్సచూసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలోనే పని చేసినా, ప్రపంచ ప్రఖ్యాతిగన్న బ్రిటిష విశ్వవిద్యాలయాలైన కేంబ్రిడ్జిలో 1963-64లో మార్షల్ లెక్చరర్‌గాను; 1968-69లో ఈస్ట్‌మన్ విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఆక్స్‌ఫర్డ్‌లోను పనిచేసి, ఆ ప్రతిష్టాకర పదవుల్లో గొప్పగా భాసించాడు. సోలో భార్య మార్తాకూడా యిలాగే ఒకటికంటె ఎక్కువ పదవుల్ని చక్కగా నిర్వహించింది. ఆమె అర్థశాస్త్ర చరిత్రలో మంచి దిట్ట. బోస్టన్, హార్వర్డ్ విశ్వవిద్యాలయాల్లో శ్రీమతి రాబర్ట్‌సోలోమార్తా అర్థశాస్త్ర చరిత్ర సంబంధిత ఉద్యోగాన్నే గొప్పగా నిర్వహించి మంచి పేరుప్రతిష్టలు ఆర్జించింది.

1961లో అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రధాన నగరం వాషింగ్‌టన్ చేరినప్పటినుండి డాక్టర్. సోలో అర్థశాస్త్ర జగత్తులో-తన రచనలపై చర్చలు జరగడంవల్ల - జాజ్వల్యమానంగా విద్వత్ జనులకు తన ప్రకాశాన్ని అందిస్తూనేవున్నాడు. ఆ సంవత్సరంలో కీర్తిశేషులైన వాల్టర్ డబ్ల్యు. హెల్లర్ నాయకత్వాన పనిచేస్తున్న "కౌన్సిల్ ఆఫ్ ఎకనామిక్ ఎడ్వయిజర్స్" ఉద్యోగవర్గంలో "సీనియర్ ఎకానమిస్టుగా పనిచేసాడు అప్పుడే డాక్టర్ సోలోకు, డాక్టర్ జేమ్స్‌టాబిన్, డాక్టర్ కెర్మిట్‌గార్డాన్. డాక్టర్ గార్డ్‌నర్‌ఆక్లే, డాక్టర్ ఆర్థర్‌జీకున్‌లతో కలసి పనిచేసే అవకాశం లభ్యమయ్యింది. ఆ సందర్భంలోనే కీన్సియ ఆర్థిక విధాన చట్టాన్ని రచించేందుకు తోడ్పడ్డాడు. ఆ విధానమే కెన్నడీ, జాన్సన్ అధ్యక్షుల పరిపాలనాకాలంలో అమెరికా ఆర్థికరంగాన్ని, రాజకీయరంగాన్ని ఆవరించి పనిచేసింది

1962లో డాక్టర్ సోలో మరల విద్యారంగానికి మరలి ఆర్థిక శాస్త్రాలోచన గట్టిగా చేయసాగాడు. ప్రభుత్వ విధానాల ప్రభావాన్ని అధ్యయనం చేయడంలో మంచి అభిరుచితో పని చేసాడు. ఇట్టి అధ్యయనం విద్యారంగంలోని కొంతమందికి రుచించకపోవచ్చు, నేతితో కలిసిన పప్పు రుచి బ్రాహ్మణునకే ఎరుక! మరెవరికైనా ఎలా తెలుస్తుందంటారు? సోలోకు అనేక అభిరుచులున్నై. అతని ఆలోచన విశాల ఆర్థిక విద్యారంగాన్ని, తత్సంబంధిత రంగాలన్నింటిని బాగా తరచి చూచింది. ఇది వైశాల్యము, లోతు గల మేధాశక్తికి, బహుముఖ ప్రజ్ఞకు సంకేతము-30 సంవత్సరాలకు పైగా డాక్టర్ సోలోను ఎరిగిన మరొక నోబెల్ బహుమతి గ్రహీత, స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ అర్థశాస్త్రాచార్యుడు డాక్టర్ కెన్నెత్‌యారో స్పష్టంగా చెప్పిన అభిప్రాయం. డాక్టర్ సోలో వివేకాన్ని, తమకు, సలహా అందించవలసిందిగా అనేక కమిటీలు కోరినాయని కూడా డాక్టర్ యారో చెప్పారు.

ప్రభుత్వ "ఎకనామిక్ ఎడ్వయిజర్స్ కమిటి" సభ్యుడుగా వున్న తర్వాత రెండు సంవత్సరాల్లో డాక్టర్ సోలో అనేక ప్రభుత్వ సంస్థల్లో పనిచేసాడు. 1975-1980 కాలవ్యవధిలో బోస్టన్ ఫెడరల్ రిజర్వ్‌బ్యాంకు డైరెక్టరుగాను, ఆ కాలవ్యవధి చివరి సంవత్సరంలో ఆ బ్యాంకు బోర్డుకు ఛైర్మన్‌గాను పనిచేసాడు. ఇంకా జాన్సన్ అధ్యక్షుడు ఏర్పాటు చేసిన టెక్నాలజీ, ఆటోమేషన్, ఆర్థిక పురోగతి కమిటీలో 1964, 1965 లో సభ్యుడుగాను, నిక్సన్ అధ్యక్షుడు నియమించిన 'ఇన్‌కమ్ మెయింట్‌నెన్స్' కమిటీలో 1968 నుండి 1970 దాకా సభ్యుడుగాను పనిచేసారు.

అర్థశాస్త్రరంగంలో కూడా డాక్టర్ సోలో అనేక పదవులాక్రమించి ఆ పదవుల గౌరవాన్ని గొప్పగా యినుమడింపచేసాడు. 1980 లో అమెరికన్ ఎకనామిక్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా ఎన్నుకోబడి గౌరవించబడ్డారు. అమెరికా ఎకనామిక్స్ ఎసోసియేషన్, డాక్టర్ సోలోకు, ప్రతిష్ఠాకరమైన ప్రొఫెసర్ జాన్‌బేట్స్‌క్లార్స్ మెడల్ యిచ్చి, 1961 లో గౌరవించింది.

నిజానికి బ్రూక్‌లిన్ కాలేజి చదువుతో రాబర్ట్ సోలో తన విద్యాభ్యాసాన్ని ఆపివేసేవాడే. కాని జేమ్స్ మాడిసన్ హైస్కూలులో సారస్వత ఉపాధ్యాయినిగా పనిచేస్తున్న శ్రీమతి టీస్టర్, సోలోకు హార్వర్ట్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసే మేధాశక్తి, అర్హత వున్నయ్యని ప్రోత్సహించడంవల్ల సోలో హార్వర్ట్ వెళ్ళి ఉన్నత విద్యాభ్యాసం చేసి అర్థశాస్త్రంలో అమోఘమైన జ్ఞానాన్ని సంపాదించి, ఈ సంవత్సరం అర్థశాస్త్ర నోబుల్ బహుమతితో సత్కరించబడి ప్రపంచ మేధావులమధ్య అప్రతిహతమాన ప్రకాశశక్తిగల మహామేధావిగా భాసిల్లుతున్నాడు. కొంతమంది జీవితాలకు దక్కిన మంచి

మలుపు మహిళామణుల ద్వారా కావడం చరిత్రలో చూస్తూనే వున్నాం.

**బహుమతి వస్తుందనుకోలేదు :**

నిజానికి ఈ సంవత్సరం అర్థశాస్త్ర నోబెల్ బహుమతి తన కొస్తుందని డాక్టర్ సోలో నిరీక్షించలేదు. "తగినంతకాలం నేను జీవిస్తే, నాకు అర్థశాస్త్ర నోబెల్ బహుమతి దక్కుతుందని నా మిత్రులు నాతో అంటూనే వున్నారు" అని చెప్పిన డాక్టర్ రాబర్ట్ మోర్టాన్‌సోలో, ఈ సంవత్సరమే తనను అర్థశాస్త్ర నోబెల్ బహుమతితో సత్కరించినపుడు ఆశ్చర్యపడలేదు నిజమైన మేధావికి, సమర్థత, నిజాయితీ గల మేధావికి ఆత్మవిశ్వాసం వుండటంలో సందేహ మేముంటుంది?

ప్రజాసంక్షేమం :

ఈనాడు ప్రపంచానికి కావలసింది శాంతితోపాటు సంక్షేమము. సమాన పంపిణీ సంక్షేమమిస్తుంది. కాని పంపిణీకి ఆర్థికవృద్ధి కావాలి. వృద్ధినిచ్చేది సాంకేతిక జ్ఞానపరిజ్ఞానాలు. అందుచేత ఆర్థికవృద్ధిపై సాంకేతిక జ్ఞానం ప్రభావం అనే సోలో పరిశోధన విషయం ప్రజా సంక్షేమానికి బాగా తోడ్పడుతుంది. పరిశోధన ఉపయోగపడాలంటే యిటువంటి విషయాలపైననే జరగాలి. అంతేగాక చక్కటి పరిశోధనా సిద్ధాంతాన్ని సోలో సృష్టించడం అంతకంటె ముదావహమైన విషయం.

పరిశోధకులు, పండితులు, ఉపాధ్యాయులు నిరంతరం ప్రజల కుపయోగపడే పరిశోధనలో నిమగ్నమైతే వారిపై చేసే పెట్టుబడికి సార్థకత, అర్థము ఉంటుంది. సదా దైవిక ప్రజాసమస్యలపై ఆలోచిస్తూ, చెబుతూ, వ్రాసి ప్రకటిస్తూ వుండవలసిన కర్తవ్యం ఉపాధ్యాయునికున్నది. ప్రతిఫలాన్ని గురించి ఆలోచించకుండా కర్తవ్యాన్ని నిర్వహించమని, పనివెంట ప్రతిఫలం వస్తుందని, పనిచేయడం విద్యుక్తధర్మమేగాని, ప్రతిఫలాన్ని గురించి ఆలోచించి కాదని, పని వెంట వచ్చే ప్రతిఫలం పనిచేసిన వానిదేనని శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పాడు. సోషల్ సైన్సెస్ అనే తన గ్రంథంలో హ్యారీ చార్లెస్‌కేరే కూడా అలాగే చెప్పాడు.

ప్రతిఫలం పొందుతూ పనిచేయకపోవడం తప్పు. దురభ్యాసాల దుశ్శీలంలోను మునిగితేలడం అంతకంటె తప్పు. సంఘంలో సభ్యులైన మనకు సంఘమే శరణ్యం బుద్ధి మన ఆయుధం. కార్యసాధనకు బుద్ధినుపయోగించి ధర్మనిర్వహణ చేయుటే మనకు శరణ్యము. అందువల్ల సర్వజన శ్రేయస్సుకు, జగత్కల్యాణానికి ధర్మనిర్వహణ చేయుట కర్తవ్యము. ముఖ్యంగా విద్యావంతుడు, జ్ఞాని, ప్రబోధకుడైన ఉపాధ్యాయుడు వివేకం కల్గి యీ ధర్మాచరణకు పూనుకొనక తప్పదు.

ఈ ధర్మాలను (కర్తవ్యాలను) డాక్టర్ మెర్టాన్ సోలో చక్కగా నిర్వహించి లోకానికి ప్రీతిపాత్రుడు, ఆదరణీయుడు కల్యాణకారకుడు కాగల్గాడు. అందుచేత ఉపాధ్యాయులంతా— ముఖ్యంగా-ముఖ్యంగా అర్థశాస్త్ర ఉపాధ్యాయులంతా-దుష్కార్యాలను దూరంగా నెట్టి-సత్కార్యాలు చేస్తూ లోకకళ్యాణానికి తోడ్పడితే ఏదో ఒక మంచి ప్రతిఫలం లభ్యమౌతుంది.

ప్రజాస్వామ్య దేశాలలో మంచిపనికి తగిన ప్రతిఫలాలు లభ్యం చేయబడుతున్నవి. వెనుకబడిన దేశాల్లో విద్యారంగంలోని పరిపాలకులు, యాజమాన్య నిర్వాహకులు, రాజకీయాధికారులు, తగినట్లు ప్రతిఫలాలు అందించడంలో తమ కర్తవ్యాన్ని ఉచితరీతిని నిర్వహించకపోవడమేగాక, తగినరీతిని కర్తవ్యనిర్వహణ చేసేవారిని నానా తిప్పలు పెట్టడమేగాక, అపకారాలు కూడా చేస్తున్నారు. బెస్టుటీచరు అవార్డు లివ్వడంలో జరుగుతున్న అన్యాయం ప్రపంచానికి తెలియంది కాదు.

ఈ దుష్ఫలితాలనుండి దుష్యంతుని కుమారుని దేశాన్ని భగవంతుడైనా రక్షిస్తాడా? ఓపికపడితే దుష్టశిక్షణ, శిష్టరక్షణ మనము తప్పకుండా చూడకపోము.

ఏం జరిగినా జరగనివ్వండి. ఉపాధ్యాయులు మాత్రం డాక్టర్ రాబర్ట్ మెర్టాన్ సోలో వలె తమ విధ్యుక్తధర్మాలను చక్కగా నిర్వహించి ఆదర్శప్రాయులు కావాలి.



# "ఆధునిక భారతీయ భాషల్లో సంస్కృతం - తులనాత్మకానుశీలనం

ప్రవేశిక :

ఆధునిక భారతీయ భాషల్లో ముఖ్యంగా రెండు విభాగా లున్నాయి. ద్రావిడభాషా కుటుంబానికి చెందిన తమిళాది భాషలొక వర్గం. ఇవి దక్షిణ భారతంలో వ్యవహృతాలవుతున్నాయి. మిగిలిన భాషలు ఉత్తర భారతంలో ప్రచారంలో ఉన్నాయి. ఇవి ఆర్యభాషా కుటుంబానికి చెందినవి. ఈ భాషలన్నింటిలోనూ ద్రావిడ మరియు ఆర్యభాషా సంస్కృత ప్రభావం ఉంది. ఈ భాషలకు గల వ్యాప్తిని అందున్న మాండలిక భేదాలను పరిశీలించిన గ్రంథం. "లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా" అనేది. దీని సంపాదకుడయిన గ్రియర్సన్ ఈ బృహద్గ్రంథంలో అక్కడక్కడ ఈ భాషల్లో సంస్కృత ప్రభావం గలదని యాదృచ్ఛికంగా సూచించాడు.

ఉపేక్ష :

తెలుగుకు సమగ్రమైన నిఘంటువును నిర్మించాలనే బృహత్కార్యక్రమానికి పూర్వరంగంగా తెలుగు సాహిత్య అకాడమీవారు నన్నయాది మహాకవుల గ్రంథాలకు పదప్రయోగ కోశాలను నిర్మింపజేశారు. ఇందు తత్సమ ధాతువులను పరిగణించారే కాని తక్కిన సంస్కృత పదాలను గూర్చిన వివరాలను గ్రహించియుండలేదు.

ద్రావిడ భాషలలోగల సామ్యాలను వివరించే గ్రంథాలు కొన్ని ప్రకటితాలయినాయి ఆర్యభాషా కుటుంబానికి చెందిన భాషల తులనాత్మక పరిశీలన కొంత సాగింది. ద్రావిడ భాషల్లోకి వచ్చిన సంస్కృత పదాలకు అర్థధ్వ విషయాల్లో వచ్చిన మార్పులను కొంత చర్చించారు. ఈ విషయమై కొన్ని వ్యాసాలు ప్రకటితాలయినాయి.

నేటి భారతీయ భాషలలోగల సంస్కృత భాషయందలి ప్రత్యేకతను పరిశీలించిన వారెవ్వరైనా ఇంతవరకు లేరని నా కనిపించుచున్నది. నేనీ విషయమై పెక్కు పండితులతో చర్చలు సాగించియు ఉత్తర ప్రత్యుత్తరముల వలన గ్రహించియు ఈ నిర్ణయమునకు వచ్చియున్నాను.

ఉపయోగం :

తెలుగు కవుల సంస్కృత ప్రయోగములనే అంశంపై నేను కొన్ని వ్యాసములనేగాక రెండు గ్రంథములను ప్రచురించితిని. నా యీ పరిశీలనమునందు ఎన్నో విశేషాంశములు వెలుగులోనికి వచ్చాయి. ఈ మార్గంలోనే తక్కిన భారతీయ భాషలను పరిశీలించి తులనాత్మకంగా ఈ పరిశీలనా ఫలితములను చర్చ గావించుట చాలా ముఖ్యమని నా తలంపు. తమ తమ మాతృభాషలందున్న సంస్కృత ప్రయోగ విశేషములను గుర్తించినచో తన భాషను తాను సులువుగ నర్థము చేసికొనుట సాధ్యమగును. ఇరుగు పొరుగు భాషలలోగల సంస్కృత ప్రయోగ విశేషములను తన భాషలోగల స్వతంత్ర ప్రయోగములతో తులనాత్మకముగా పరిశీలన గావిస్తే ఆ భాషపై కొంత ప్రవేశం గలగటమేగాక విషయికంగా సామరస్యభావం పెంపొందుతుంది.

సంస్కృత ప్రభావం :

నిత్య వ్యవహారంలో భారతీయ భాషలన్నింటిలో సంస్కృతానికి స్థానం గలదనటం నిర్వివాదాంశం. నూత్న భావ ప్రకటనకు ఆంగ్లాది భాషలనుండి వచ్చే పారిభాషిక పదాలకు సమానార్థకాలను నిర్మించటంలో నేటి భారతీయ భాషలన్నీ సంస్కృతాన్నే వాడుకు చేస్తున్నాయి. పాత్రికేయులు వినూత్న భావ ప్రకటనకు సంస్కృతాన్నాశ్రయిస్తున్నారు. నవ సంఘర్షణ సమితి, సమ సంఘర్షణ సమితి మొదలగు తెలుగు పత్రికల్లో ఈ నడుమ కల్పితాలై ప్రయుక్తాలయినాయి. కాంగ్రెసేతర మొదలగు పదబంధాల్లో సంస్కృత భాషకు చెందిన గుణసంధిని వాడుతున్నా తెలుగు పాత్రికేయులు పూర్వపదం అకారాంతము కానందున ఇచ్చట గుణసంధికి ప్రసక్తి లేదు. ఈ సంధి యొక్క ముద్ర సుద్రుఢంగా ఉన్నందున దాన్ని అనుచిత సందర్భాలందు కూడా వాడారు. అంతర్ + రాష్ట్ర అనే సంస్కృత పదాల నడుమ లోపదీర్ఘత రావలసియుండగా దాన్ని నివారించి ప్రయోగించటం హిందీ పాత్రికేయుల్లో గలదు. ఇది తక్కిన భాషలకు గూడా వ్యాపించింది.

విశేషసంధి :

సంస్కృత పదాలను ఈ భాషల్లో వాడుతున్నా సంస్కృత వ్యాకరణ నియమిత సంధినెవరు పాటించకపోగా క్రొత్త సంధిని ప్రవర్తింపజేశారు. మరాఠీవారు ప్రయోగించిన ఈ క్రింది పదబంధాలలో పూర్వ పదాంత స్వరం దీర్ఘం. పరపదాది అచ్చుకు లోపం గన్పిస్తుంది. జనశ్రుతీనుసార్ (జనశ్రుతి + అనుసార్) మృత్యు + అనంతర (మృత్యూనంతర) పృథివేపేక్షా (పృథివి + అపేక్షా) మొదలగు ఉదాహరణలు. హిందీలో గనబడే ఉపరోక అనే ప్రయోగంలో (ఉపరి + ఉక) పూర్వపదము ఇకారాంత మయినందున యణాదేశం

రావాలి. దాన్ని బాధించి గుణసంధి ప్రవర్తించింది. బెంగాలీలోగల ఉపరసు (ఉపరి + అసు) ఇలాంటిదే. తెలుగులోగల భానోదయ (భాను + ఉదయ) ఈ వర్గానికి చెందిందే.

విభిన్న భాషలకు చెందిన పదాల కలయికను చాలా భాషలు నిషేధించాయి. అయినా వాని కలయిక లేదనలేం. అట్టి సందర్భాలలో తెలుగు కవులు కొన్ని నియమాలకు లోనైనారు. సంస్కృతాంధ్ర పదాల కలయికలో పరపదం సంస్కృతమైతే సంస్కృత సంధి వస్తుందని పరిశీలనవల్ల వ్యక్తమవుతుంది. పంటాన్వయ, పాలాభిషేక, తెప్పోత్సవ మొదలగు ఉదాహరణలు. పరపదం తెలుగైతే తెలుగుసంధి వస్తుంది. గంగను తిష్ఠతనుచు, అమృత రూపాయం మొదలగు ఉదాహరణలు.

ఈ యంశాన్నింత వరకు వ్యాకరణ కర్త లెవ్వరు చెప్పినట్లు తెలియదు.

వి సంధి :

సంధి సంహితలో గలిగేమార్పు సంధి. సంస్కృత నియమాను సారంగా సంధి నిత్యం. మిగిలిన వ్యాకరణాంశాల్లో వలెనే ఇందులో గూడ తెలుగు సంస్కృత విధేయం. అంటే సంస్కృత పదాలను కలిపి పదబంధాలను తెలుగువారు గల్పిస్తే ఆ సందర్భాల్లో నియతంగా సంస్కృత వ్యాకరణ ప్రతిపాదిత సంధి నియమాలను సమన్వయం చేస్తారు.

సంస్కృత పదాలను యథేచ్ఛగా అర్థసిద్ధికోసం సమసింప చేసి నప్పటికీ హిందీ, మరాఠీ, బెంగాలీ భాషలలో వి సంధిని ఆదరిస్తారు. కొన్ని సందర్భాలలో సంధించిన సంస్కృత సమస్త పదాలను విడదీసి ప్రయోగించడం ఈ భాషలలో గలదు.

వేద ఉపనిషద్ (వేదోపనిషద్) శీత ఉష్ణ (శీతోష్ణ) హర్ష ఆతురతా (హర్షాతురతా) మొదలగు హిందీ ప్రయోగా లీ కోవకు చెందినవి. హిందీలో సంస్కృత భూయిష్ఠ సమాస బహుళ రచనను కొందరాదరించారని మరికొందరు సరళ సుబోధ స్వతంత్ర పద్ధతిని ఆదరించారని చెబుతారు. పై విసంధి ప్రయోగాలు స్వతంత్ర పద్ధతి నాదరించిన వారి కింపు నింపుతాయని గ్రహింపనగును. అతి ఉత్తమ, అతి ఆనంద, వర్షాఋతూ వ్యాపార, ఉద్యోగ, అనార్య అసంస్కృత మొదలగు మరాఠీ ప్రయోగాలలో వి సంధికి ఉదాహరణలు.

ఈ క్రింది పదబంధాలు వంగ భాషలో ప్రయుక్తాలు, ఇందు పూర్వోత్తర పదాలు సంస్కృతాలు. అయినా ఆ భాషలో వచ్చేసంధి నివారితమయినది. నానారుప, అశ్రవ్య, అపూర్వ అభిమాన వర్షా అంతే, గృహ అభిముఖే, అల్ప అవశిష్ట, అభావే అనటనే, హృదయ ఉద్బోధన, నూతన ఆలాపే, అనాస్వాదిత అమృత ఆచార అనుష్ఠానే మొదలగునవి.

సంధి :

సంస్కృత సకారాంత పదాలలో తుది సకారలోపం హిందీ మొదలగు భాషలలో గద్దు. కాబట్టి సమాసాల్లో యశ్‌పాన్ ఇత్యాదిగ రూపాలుంటాయి. అనేక వయస పర్యంత అనే బెంగాలీ రూపంలో తుది 'స్' నిలిచిఉందిగాని రావలసిన సంధి మాత్రం రాలేదు. సంధి వస్తే వయః పర్యంత అని కావాలి. ధనుష్టంకార, భ్రాతుష్పుత్ర మొదలైన బెంగాలీ పదబంధాల్లో సంస్కృత వ్యాకరణ ప్రతిపాదిత సంధి ప్రవర్తించింది.

సకారాంతాలలో సంధి వచ్చిన యశోధరా మొదలగు రూపాలు హిందీలో ఉన్నాయి.

శ్రేయసాధక్ చంద విషయక మొదలైన పదబంధాలలో పదాంత సకారానికి మరాఠీ రచయితలు లోపాన్ని విపక్షించారు. మనోవినోదన, మనోరంజన మొదలైన ప్రయోగాలను మరాఠీ రచయితలు సంస్కృత విధేయంగా ప్రయోగించారని తెలుస్తుంది.

రేఫకు రేఫ పరంగా ఉండే లోపదీర్ఘత వస్తుందని వ్యాకరణ నియమము. పునర్ + రమతే పునారమతే మొ॥ ఉదాహరణలు. ఈ సందర్భంలో బెంగాలీలో లోపదీర్ఘత కలిగిన నీరవ (నిర్ + రవ) మొదలగు రూపాలనేగాక అంతరరుద్ధ ఇత్యాదిగ లోపదీర్ఘత రాని రూపాలుగూడ ఉన్నాయి. అంతర్రాష్ట్రీ, అనేది హిందీ మరియు మరాఠీ భాషలలో ఉంది. ఇది తెలుగు ప్రాతికేయుల భాషవరకు వ్యాప్తి గాంచింది.

స్త్రీలింగ బోధకత :

చరాచరమయిన ఈ జగత్తంతా స్త్రీ పుం యోగోద్భవం. లింగ భేదాన్ని ఆదికాలంలో ఎలా తెలియజేసేవారో తెలియదు. సంస్కరింపబడిన భాషలో మాత్రం ఈ క్రింది విధానాలను లింగ బోధకతకై పాటించినట్లు తెలుస్తుంది.

దీర్ఘాంతత :

సంస్కృత నామాలు చాలావరకు దీర్ఘాంతాలే. రమా, స్త్రీ, వధూ మొదలుగునవి ఉదాహరణలు. క్తిన్ననే కృదంతాలన్నీ నియత స్త్రీలింగాలని వ్యాకరణం నిర్దేశించింది. గత మత, యతి రతి మొదలుగునవి హ్రస్వాంతాలయినా స్త్రీలింగాలే. ఆ, ఈ, ఊ మరియు 'తి' అనేవాటిని స్త్రీ ప్రత్యయాలుగా పరిగణించారు. ఆ, ఊ అనేవి అకార ఉకారాంతాల పైన మాత్రం చేరుతాయి. అంటే అంత్య స్వర దీర్ఘంవల్ల స్త్రీ లింగ బోధకతను ప్రాచీనులు సాధించారనిపిస్తుంది. అశ్వ < అశ్వా; పంగు < పంగూ మొదలుగునవి ఈ సందర్భంలో గుర్తింపదగినవి. ఈ అనేది అన్ని అచ్చులపైన మాత్రమేగాక నకార తకారాది హలంతాలపైన గూడా చేరుతుంది. అకారాంతాలకు

అంత్య స్వరదీర్ఘం వచ్చిన తరువాత (వరుణ<వరుణా) మరల **'ఈ'** చేరగా సంధిని నివారింప 'న్' చేరి (న్ + ఈ) వరుణానీ మొదలైన రూపాలేర్పడినాయి. స్త్రీ ప్రత్యయాంతాలలో **'ఈ'** అనేదానికి కొంత వైశిష్ట్యం గలదనటం నిర్వివాదాంశం.

స్త్రీలింగ రూప నిష్పాదనలో నేటి భారతీయ భాషలు సంస్కృత విధేయాలు. ఆ, ఈ మొదలైనవాటిని చేర్చి బెంగాలీవారు స్త్రీ లింగ రూపనిష్పత్తి గావించారని. సంకోచపీడితా, మృణ్మయీ, అభినేత్రీ, కులత్యాగినీ, గర్భవతీ మొదలైనవి ఈ సందర్భంలో గుర్తింపదగిన బెంగాలీ ఉదాహరణలు.

సాగలీ, సుగంధీ మొదలగునవి మరాఠీ భాషలో కనబడే స్త్రీలింగ ప్రత్యయాలు. క్తిన్నంతాలు హ్రస్వాంతాలయినా స్త్రీ లింగ బోధకాలు. వీని తుది స్వరానికి దీర్ఘాన్నాదేశం గావించటం మరాఠీ భాషలో గమనింపదగిన ప్రత్యేక పద్ధతీ, పరిస్థితీ, రాత్రీ మొదలైనవి ఈ సందర్భంలో గుర్తింపదగిన మరాఠీ రూపాలు.

హిందీభాష ఈ విషయంలో సంస్కృత విధేయంగా ఉండటం గమనించాలి. యాచికా, నాయికా, శిక్షికా మొదలైనవి హిందీలో ప్రయుక్తాలయిన స్త్రీ లింగ రూపాలు. ఆంగ్లపదాలైన మిస్టర్, ఫిల్మ్ మొదలైన పదాలపై **'ఈ'** అనే ప్రత్యయం స్త్రీ లింగ వివక్షలో హిందీలో చేరిందని మాస్టరిణీ, ఫిల్మీ మొదలైన రూపాల వలన వ్యక్తమవుతుంది.

తెలుగువారి వాడుకలో వున్న భాగవతారిణి అనే స్త్రీ లింగ బోధకం. భాగవతారిణి అనే ఈ ప్రత్యయాంతం. భాగవతార్ సంస్కృత పదం కాదు. అయినా ఈ చేరటం గుర్తించాలి. హిందీలో గల మాష్టరిణీవంటిదే ఈ భాగవతారిణి కూడా.

అమ్మ, ఆలు మొదలైన స్వతంత్ర పదాలు తెలుగులో స్త్రీలింగ బోధకత గలిగిఉన్నాయి. రాజమ్మ (రాజ + అమ్మ) జవరాలు (జవ + ఆలు) మొదలైనవీ వర్గానికి చెందినవి. బెంగాలీలో యువరాజ, యువరాజ మహిషీ అనే రూపంలోగల 'మహిషి' స్వతంత్రపదం. ఇది ఈ సందర్భంలో కేవలం లింగబోధకంగా ప్రయుక్తం గావటం గమనార్హం.

ఈ విధంగా సంస్కృత భాషకు చెందిన పద ప్రత్యయాలే గాక ప్రాతిపదికలు, ధాతురూపాలు వివిధ రూపాల్లో భారతీయభాషల్లో ప్రయుక్తం గావటం సంస్కృతం దిన దినం ప్రవర్థమాన మవుతుందని చెప్పగలం. తారకాది గణపఠితాలపై 'ఇతచ్' అనే ప్రత్యయం వస్తుందని పాణిని కాశికా వృత్తిలోగల తారకాదుల్లో 27 పదాలు మాత్రమే పరిగణితాలు. తరువాత కాలంలో వచ్చిన వైయాకరణ సిద్ధాంత కౌముదిలో వీటి సంఖ్య తొంభై వరకు పెరిగింది. పాతగణంలో గల పదాలు కొన్ని కొత్తగణంలో లేవు. ఇదంతా భాష దిన దిన ప్రవర్థమాన మనటానికి నిదర్శనం. తెలుగుకవులు తారకాది గణపఠితాలుగాని రెండు వందలకు పైగా పదాలపై ఇతచ్ అనే ప్రత్యయాన్ని వాడారు. నేడు వ్యాకరణం వ్రాస్తే తారకాది గణాలను ఆధునీకరించాలి. పై విశేష విసంధి రూపాలన్నీ నూత్నంగా సంస్కృత వ్యాకరణం రాస్తే చోటుచేసుకోవాలని మనం నిరూపించాలి.

సమాసాలు :

తెలుగులోవలె భారతీయ భాషలలో వంగ భాషలో మాత్రం సమాసా లధికసంఖ్యలో ప్రయుక్తాలయినాయని పరిశీలనవల్ల చెప్ప గలం. నేను రవీంద్రుని వాఙ్మయాన్ని వెయ్యి పుటలకు మించకుండా పరిశీలించాను. అంతమాత్రంలో అయిదు వందలకు తక్కువకాని సమాసాలను గుర్తించాను. ద్వంద్వ సమాసం వంగ భాషలోని నా పరిశీలనలో ద్విశతాధికంగా ఉండటం గుర్తించాలి. అత్యంత కుతూహలంగా పురాతన హాస్యాలాప, ఆసన్న నైసర్గిక ఉపద్రవ, ఆవేగతీ ప్రవేదనా పూర్ణ ఆగ్రహ కటాక్ష పాత, శిశిరస్నాత స్వర్ణశీర్ష స్నిగ్ధ శ్యామల, మొదలైన అపురూప బంధాలకు గలి బెంగాలివారి భాష.

తెలుగులో గాంగేయుడంటానికి వివిధ సంస్కృత పదాల కూర్పుతో పది రకాలైన సమాసాలను కల్పించి తిక్కన ప్రయోగించాడు. శివ పర్యాయులుగా తెలుగు కవులు నూరు విధాలైన సమాసాలను వాడారు. నిటలస్తనంధయ సీహారకరుడు. ద్వాదశార్ధార్ధనయనడు మొదలైనవీ సందర్భంలో గుర్తింపదగినవి. సాంబ నిఘంటువులలోని పద్యాలలో చతుర్థ పాదం శివసంబోధనాత్మకం. ఇందులో ఎనిమిది పదులకు తక్కువగా శివపర్యాయ సమాసాలు కల్పితాలయినాయని పరిశీలనవల్ల తెలుస్తుంది.

ద్వంద్వాలు :

హిందీ రచయితల్లో ఒక వర్గంవారు సమాస బాహుళ్యశైలి నాదరించి యుండలేదు. హిందీలో సమాసాలంతగా లేకుండుటకీ మార్గం కారణమై ఉంటుంది. చాలావరకు ద్విపద ఘటితాలైన ద్వంద్వ సమాసాలు హిందీలోనూ, మరాఠీ, బెంగాలీ భాషలలోనూ ప్రయుక్తాలయినాయి. పూర్వవిరుద్ధార్థాన్ని పరపదం ఇస్తుండుట ఇందులో ఒక వర్గం. కృత్యాకృత్య మొదలైనవీ వర్గానికి చెందినాయి. వంగ భాషలో సమానార్థక ఘటిత ద్వంద్వాలు కొన్నిగలవు, సతీ సాధ్వీ మొదలగునవి ఈ సందర్భంలో గుర్తించాలి. బహుపద ఘటిత ద్వంద్వ సమాసా లధికంగా వంగభాషలోను విరళంగా మరాఠీ లోను ఉన్నవి. హిందీలో కూడా బహుపదఘటిత ద్వంద్వాల ప్రయోగం లేకపోలేదు.

ఈ సమాసాలన్నీ (అన్ని భాషల్లోను) వచన బోధకతా విహీనాలై ఉండటం గుర్తించాలి. సంస్కృత ద్వంద్వసమాసం వచన బోధకతా విహీనంగా కానరాదు. ఈ విషయంలో తెలుగు సర్వదా సంస్కృత మార్గానికి విధేయంగా ఉన్నట్లు చెప్పగలం.

అవ్యయీభావాలు :

సుబంతాలు కలసి అవ్యయాలుగా మారటం సంస్కృతంలో ఉంది. ఈ వర్గానికిచెందిన సమాసాల నవ్యయీభావ సమాసాలంటారు సంస్కృత వ్యాకరణవేత్తలు. ఇవి తెలుగులో చాలా విరళంగా ప్రయుక్తాలయినాయి. ఇవి క్రియా విశేషణాలుగా మాత్రం ప్రయుక్తాలవుతాయి. దీని కవ్యయత్వం లోపింపజేసిన ప్రయోగాలు వంగ భాషలో అక్కడక్కడ కనబడుతుంది. యథోచితం అనేది సంస్కృతంలో అవ్యయీభావం. దీనిలో తుది 'మ్'ను లోపింపజేసి దీనిని సాధారణ విశేషంగా యథోచితయత్న, అనేరీతిని వంగ భాషలలో ప్రయోగించటం గుర్తించాలి. క్త్వన్నంతాల్లో తుది స్వరానికి దీర్ఘాన్నాదేశం గావించి మతిరతి ఇత్యాది రూపాలను మరాఠీవారు ప్రయోగించటమే గాక యథాశక్తి మొదలగు సంస్కృత అవ్యయీభావ సమాసాలలో అంత్యస్వరాన్ని దీర్ఘతను గల్పించి 'యథాశక్తీ' అని ప్రయోగించటం మరాఠీ భాషలో గలదు. హిందీలో అవ్యయీభావ సమాసాల ప్రయోగం చాలా విరళంగా గలదని పరిశీలన వలన తెలుస్తుంది.

సమాసాలలో విభక్త్యంతం :

సంస్కృత సమాసాలలో ప్రాతిపదికలే ప్రయుక్తాలవుతాయి. విగ్రహదశలో విభక్త్యంతాలయిన పదాలు సమాసదశలో (విభక్తి లోపించినందున) ప్రాతిపదిక లవుతాయి. ఈ యంశాన్ని సంస్కృత వ్యాకరణం స్పష్టం గావించింది. హిందీ మొదలైన ఆధునికభాషలలో ప్రాతిపదికగాక విభక్త్యంతం (చాలా సందర్భాలలో) ప్రథమాంతం మొదటి అవయవంగా (సమాసాలలో) నిలిచి ఉండటం గమనార్హం. ఈ సందర్భంలో పరిగణింపదగిన వంగ భాషా ప్రయోగాలు - పక్షచ్యుత, స్వామీ పుత్ర, యువాపురుష మొదలగునవి, హిందీలోని ధనీ, మనీ, గృహీ మొదలైనవి. మరాఠీలోని శిల్పకళా స్థాపత్యకలా మొదలైనవి ఈ వర్గానికి చెందినవే. ప్రథమేతర విభక్త్యంతాలు (ముఖ్యంగా తృతీయా, పంచమీ, షష్ఠ్యంతాలు) సమాసాలలో నిలిచి ఉండటం అక్కడక్కడ సంస్కృతంలో లేకపోలేదు. అట్టివాటిని అలుక్సమాసాలని వారు గుర్తించారు.

షష్ఠ్యంతం సమాసాలలో తొలిపదంగా ఉండటం ఈ భాషలలో గలదు. ఈ విధానం సకారాంత ప్రాతిపదికలకు పరిమితం.

భ్రాతుష్పుత్ర అనే బెంగాలీ సమాసంలో పూర్వపద షష్ఠ్యంతం. భ్రాతుః అనేది భ్రాతు శబ్దానికి సంస్కృతంలో ఏర్పడే షష్ఠ్యంతం. ఈ విసర్గలు షకారమై షత్వం రాగా భ్రాతుష్పుత్ర అనే రూపం ఏర్పడిందని చెప్పగలం. 'ధనుస్' అనే సంస్కృత ప్రాతిపదిక షష్ఠీ ఏకవచనంలో ఏర్పడే ధనుషః అనేదానిలో తుది విసర్గలకు లోపం వచ్చినందున ఏర్పడినదే. ధనష భంగ, ఇంద్రధనుషాకార్ మొ॥ హిందీ సమాసాలలో ఆద్యవయవాలనటం వాస్తవం. మాతుః పితుః అనేవి మాతృ పితృ ఋకారాంతాలకు షష్ఠీ ఏకవచన రూపాలు. ఇందలి తుది విసర్గలకు లోపాన్ని గల్గించి సమసింపజేసినందున సిద్ధించినవే మాతు, పితు, మాతుపితా మొదలైన హిందీ సమాసాలు.

విగ్రహ ప్రయోగం :

పంచవృత్తుల్లో ఒకటి సమాసం. వృత్తుల అర్థాన్ని వివరించటానికి ఉద్దిష్టమైన వాక్యం విగ్రహం. అంటే వృత్తి ముందు విగ్రహం తరువాత. సమాసవృత్తికి విగ్రహం అనంతరకాలీనం. సమాసాన్నిగానీ దాని వివరణ కుద్దిష్టమైన విగ్రహాన్నిగానీ, కవి ప్రయోగించవచ్చు. నన్నయ యయాతి చరిత్రలో "ఉష్ణమయూఖః" అనే బహువ్రీహి సమాసంయొక్క విగ్రహంగా గుర్తింపదగిన వాడి మయూఖ ముల్లుగువాడు, అనేదాన్ని సూర్యపద పర్యాయంగా ప్రయోగించాడు.

వంగ భాషలో శ్రేష్ఠకవిగా పేరుగాంచిన రవీంద్రుడు యథాపూర్వం, అనే అవ్యయీభావ సమాసానికి విగ్రహంగా గుర్తింపదగిన పూర్వవత్, అనేదాన్ని ప్రయోగించటం గుర్తింపదగిన యంశం. సంస్కృతాంధ్రాల్లో వాది ప్రతివాది, వాద ప్రతివాదాలనే పదద్వయం ఉంది. ఈ సందర్భంలో ప్రతి అనే ఉపసర్గకు మారుగ వంగభాషలో అను అనే ఉపసర్గను ప్రయోగించటం గలదు. వాదానువాద అనే బెంగాలీవారి ప్రయోగానికి వాదప్రతివాద, అనేదానికున్న అర్థం, అనువాదం అనే సంస్కృతపదం తెలుగులో భాషాంతరీకరణమనే అర్థంలో ప్రయుక్తమవుతుంది. ఈ పదబంధానికి సమానార్థకమైన మరాఠీ పదం "భాషాంతరణ్" అనేది.

సంస్కృత పదఘటితాలైన ఈ క్రింది ప్రయోగాలు వేర్వేరు భాషలలో విభిన్నార్థాలలో ప్రయోగించటం గలదు. ఆయస్ అనే సంస్కృతపదం వయస్సుకు పర్యాయపదంగా హిందీలో వాడుతున్నారు. సంస్కృతాంధ్రాల్లో ఈ పదానికి జీవన పరిమాణమని అర్థం. ముండ అనే సంస్కృత పదానికి హిందీ సంస్కృతాలలో పురై అని అర్థం. తెలుగు వితంతువని అర్థం. సంస్కృతాంధ్రాల్లో గల మధురభక్తి అనే పదబంధానికి తుల్యార్థంలో మరాఠీవారు ప్రేమలక్షణ భక్తి అని వ్యవహరిస్తారు. సంస్కృతాంధ్రాల్లో గల విశ్లేష లేదా ద్వ్యర్థికావ్యాన్ని మరాఠీవారు 'ద్వ్యాశ్రయకావ్య' అని పేర్కొనటం గలదు. మరాఠీవారి వ్యవహారంలో 'శోకాంతిక' అనే పదబంధం విషాదాంతం అనటానికి బదులుగా ప్రయుక్తమవుతుంది. ఉత్తమ, అధమ అశుకవులను మరాఠీవారు శ్రేష్ఠ, కనిష్ఠ, శీఘ్ర కవులని పేర్కొంటారు. దరిద్ర అనేదానికి మరాఠీలోని పర్యాయ పదం 'దరిద్రీ' అనేది.

నావీన్య పూర్ణ, పాశ్చిమాత్య, నిమ్నవర్గీయ మొదలగు విశేష సంస్కృత ప్రయోగాలు మరాఠీ భాషలో గలవు.

చర స్థిరాస్తులంటానికి చల్ వ అచల్ అని వ్యవహరిస్తారు.

నేటి భారతీయ భాషలలో సంస్కృతభాష దినదిన వర్ధమానమౌతుంది. భాషను బట్టి దేశకాలాలను బట్టి ఈ పెరుగుదలలో వైవిధ్యాన్ని సహృదయ పాఠకులకు నివేదించటమే నా ప్రయత్నం.

**ఆచార్య జాస్తి సూర్యనారాయణ**

# రంగుల విహంగం- శేషేంద్ర భావకవిత్వం

రచనలో విలక్షణత, వస్తువుకు ఆపాదించిన భావవిశిష్టత, శిల్పంను తీర్చిన విశేషధ్వని ఉన్న కవిత్వం వెలుగును చూస్తుంది. ఆ కవితాగీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించగలుగుతుంది.

తెలుగు వచన కవితా వికాసంలో, భావకవిత, ఆత్మాశ్రయ రీతిని, ఆపాదించుకుని, కాల్పనికతకు అభిముఖముగా వస్తువు విషయంలో వినూత్నముగా సాగింది. అందుకనే కొంత కవి హృదయం చదవకపోతే కవిత ఎందుకు వ్రాసిందో అర్ధముకాక, ఆ కవి జనాల్ని మోసం చేస్తున్నాడని, సాహిత్యానికి ద్రోహం చేస్తున్నాడని అనుకోవడం జరుగుతుంది. అది తొందరపాటు అనక తప్పదు. ఎవరూ చీకటినే వెలుతురుగా మార్చలేరు. చీకటిలోనికి దివ్వెను తీసుకు రాగలగాలి లేదా వెలుతురుకు దగ్గరగా పయనము సాగించాలి. భావ కవిత్వములో తనదొక విశిష్టస్థాయి అని ప్రకటించుకున్న కవి గుంటూరు శేషేంద్రశర్మ. అక్షరాలను అస్త్రాలుగా ప్రయోగించి, ప్రయోజనము సాధించగల కవి, పలాయన వాదాన్ని ప్రస్తుతించని కవి, ప్రగతిశీల కవి, అద్దంలో అద్రిలా, క్లుప్తతలో విశేషభావాన్ని ఇమిడించే శేషేంద్రపు భావకవిత్వపు వెలుగులు చాలామందికి దూరముగా ఉండి ఉండవచ్చు. అనుభూతిని, శబ్దార్ధాలను రసధ్వనితో భావ కవితగా వండడంలో అనిర్వచనీయత ఉండవచ్చు లేదా అస్పష్టత మరీ రంగులు పులుముకోవచ్చు. ఆ అస్పష్టత, అయోమయం కాసంత వరకూ కవికి ప్రమాదము లేదు, పాఠకునికి సమస్యా ఉండదు. వంకాయకూర ఒకళ్ళ వంటలో అసలు లక్షణాలను మార్చుకుని ఉండచ్చు. అలాని ఆ వస్తువు వంకాయ కాదని, అది కూర కాదని అనడం శుష్కవాదమవుతుంది.

విశాల దృక్పథంతో శేషేంద్రను పరిశీలిస్తే-"ఋతుఘోష"తో సంప్రదాయక కవిత్వానికి స్వస్తి చెప్పి, వినూత్న పద్ధతిలో భావ కవిత్వాన్ని అందించిన ప్రయత్నము కనిపిస్తుంది. పక్షులు, శేష జ్యోత్స్న కావ్యాలలో భావ కవిత్వానికి ధ్వని ప్రాచుర్యం ఇస్తూ రమ్య కవితారీతుల్ని అందించే తపన కనిపిస్తుంది.

"ఆనందాన్ని, సత్యంతో మిళితంచేసే కళ కవిత్వం." అని డా. జాన్సన్ కవితాతత్వాన్ని నిర్వచించడం రసానుభూతి అయితే- 'కవిత్వం ఒక తియ్యటి అబద్ధం' అన్నది ఒక భావానుభూతి అయితే "నా కవిత్వం ఏ జెండాను ఎగరేయదు, కాని నా చేతులు నా దేశపు ఖడ్గాలు, నా కవిత్వం మనిషికి డిఫెన్సు" అనే విశిష్టభావంతో రసానుభూతి, స్పందనల సమ్మిళితంతో తనదైన శైలిలో గద్యకవితా ప్రక్రియను ముందుకు కదిలించిన కవి, దేశానికి సందేశమిచ్చిన విశేష కవి శేషేంద్ర.

నా దేశం - నా ప్రజలు అన్న పుస్తకంలోని "గుప్పెడు వెలుతురు" కోసం గుడిసెల్లోని గుండెల ఘోషను వర్ణిస్తూ... "ఏ గుడిసెల్లో పగలు మనుష్యుల్లేరో, ఏ గుడిసెల్లో రాత్రి వెలుతుర్లేదో, ఆ గుడిసెల్లో నడచిపోతున్నా" అంటూ కష్టజీవుల పక్షాన నిలబడాలన్న ప్రయత్నం కన్పిస్తుంది.

మంచి చెడ్డల ఆలోచనతో సమాజంలో మార్పుకు సాహిత్యం తోడ్పడితే ప్రయోజనము సిద్ధించినట్లే.

శేషేంద్రలో కూడా వ్యక్తిస్వేచ్ఛను కబళించే శక్తిపై తిరుగుబాటును ప్రబోధించే కవిత్వం 'గొర్రిల్లా'లో కన్పిస్తుంది. గొర్రిల్లాను ఆహ్వానించడంలో, మార్పుకై నూతన విప్లవాన్ని ఆహ్వానించడంలో దేశ ఔన్నత్యానికి చిహ్నమైన జెండాను తన కవితా ప్రక్రియలో ప్రతీకగా వాడడంలో శేషేంద్రలో మార్క్సు సిద్ధాంత అవగాహన, పీడితప్రజలపై అభిమానము, ప్రగతిశీల కవిత్వంపై నమ్మకం పరిపూర్ణముగా ఉన్నాయని తెలుస్తుంది.

"రైతుల్లారా రాజకీయ వర్షం పడుతోంది, మోసపోయి మీ విత్తనాలు చల్లకండి" అని గొరిల్లాను ఒక కర్మయోగిగా చిత్రించిన శేషేంద్రభావము అద్భుతము. "వ్యభిచారులైన దేవుళ్ళను పూజిస్తారు, నీతిపరులైన మనుష్యుల్ని చంపుతారు. గాలిని దేశాలుగా, నీళ్ళను జిల్లాలుగా, తాలూకాలుగా విభజించి పంచుకుంటారు. నేలను బట్టలా కొలిచి పెట్టెలో పెట్టుకుంటున్నారు మూర్ఖులు." అంటూ గొరిల్లాలో గర్జించిన శేషేంద్ర కలం పూర్తిగా ప్రజాపరం.

"ఎక్కడ తిండిలేని పనివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో,ఎక్కడ పసితనం కూడా బతకడానికి పనిచేయాలో, అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి". (నా దేశం-నా ప్రజలు" అంటూ కవి ఏ పక్షానికీ చెందకుండా పెంపొందించుకోవలసిన నాయకత్వ అవసరాన్ని ప్రబోధించేడు శేషేంద్ర.

జాబిల్లి అనే ఖండకావ్యంలో—

"ఆకాశపు నీలి నికుంజం వెండిపూలు పూచింది
మల్లెపూల బాటల్లో మబ్బుల బిబ్బో కవతులు
వెకలెను అతిషోకుగా వెన్నెల తిరునాళ్ళకు

వెళ్ళిపోకు జాబిల్లీ నా ఊహల పాలవెల్లీ" అనే వాచ్యార్ధ ప్రధాన ధ్వని నందించిన శేషేంద్ర 'గొర్రిల్లా' 'మండే సూర్యుడు' కవితా సంపుటిల్లో క్లిష్ట అన్వయం, అస్పష్టతతో కూడ విశిష్ట భావ కవిత్వాన్ని ఆవిష్కరించారు. ఆ కవితా సంపుటాల్లో ఉన్నట్లుండి

మెరుపులా మెరిసిన ఒక భావం మొత్తం గీతాన్ని రసవంతం చేయడం కనిపిస్తుంది.

"షోరాబ్, ఋతుఘోష, పక్షులు సంప్రదాయకంగా వ్రాసిన తర్వాత, వచన కవితలో వస్తువు రీతిలో, శిల్పంలోను రావలసిన మార్పును గుర్తించి, సమకాలిక సమాజ సమస్యల అవగాహనతో తన కొత్త కవిత్వాన్ని ప్రారంభించారు.

"శేషజ్యోత్స్న" ఉషస్ అనే గీతంలో

"ఎన్నాళ్ళకు మా అతిథిగా వచ్చావు
ఈ శిథిల కుటీరానికింత వెలుతురు తెచ్చావు
గగనానికి నీలిమ పూశావు, గాలికి పుప్పొడి రాశావు
కన్నీటి తెరల మాటున కదలే పేద చూపులు
కవిత కావాలని చెప్పావు, అంగూరు చితకందే ఆసవం రాదని
చెఱుకు నలగందే శీధువు వెలువడదనీ,
చితికిన బతుకు లోతు ఆవిష్కరించావు
వ్యధను కళ్ళ కద్దుకున్న మనిషి
బతుకు తనకు బానిసైన వాడని తెలిపావు"

అంటూ ఉషోదయాన్ని ఆహ్వానించడంలోను, కష్టాల వెనుకనున్న కమనీయతను అందించడంలోను శేషేంద్ర కవిత్వము స్పష్టమవుతుంది.

'శేషజ్యోత్స్న'లోని "గాలుల"లో...

"మానవత నగ్నంగా, ఉద్విగ్నంగా...నూతన వ్యక్తీకరణం కోసం చూస్తోంది" అన్నదాంట్లో భావ వ్యక్తీకరణ నూతనత్వాన్ని ఆపాదించుతుంది. కొద్దిపాళ్ళ అన్వయ క్లిష్టత తప్పిస్తే "నీరై పారిపోయింది" ఉత్తమ పద్యకావ్యమే.

"మండే సూర్యుడు" లోని "వాన" అన్న కవితలో...

"వాన వస్తే - భూమిలో ఉన్న ...చిన్నారిగింజ
మెడ బయటపెట్టి - మొదట వచ్చిన రెండాకుల్ని
చేతులుగా జోడించింది...కృతజ్ఞతతో"

అన్నదాంట్లో విత్తనం మొలకెత్తడం అన్న పాత వస్తువును అనన్య భావ వ్యక్తీకరణలో రసవత్తరం గావించడం కనిపిస్తుంది.

"జైళ్ళ కటకటాలకే... ఖర్చవుతోంది, దేశంలో ఇనుమంతా
రైళ్ళపట్టాలకు మిగలడం లేదు...రవంత"

అన్న "మండే సూర్యుడు" లోని మరో దేవుడులోని కవితలో విప్లవ ఉద్యమాలపై సానుభూతి, కవుల నాయకత్వానికి ఆహ్వానం కనిపిస్తుంది.

"సముద్రం నా పేరు", నీరై పారిపోయింది, గొర్రిల్లా, ప్రేమలేఖలు కావ్యాలులో శేషేంద్ర ఊహల్లోని ప్రకృతి కవితా సౌందర్యం, కవితాశైలి అందం...పాఠకుల్ని కనువిందు చేస్తాయి.

సాహిత్యం "ఇజాల్లో ఇన్‌ప్రిజన్" కారాదని, రాజకీయ నాయకులను అనుసరించే వారు కవులు కారని, కవులందే కొత్త విప్లవ నాయకులని, కలం వీరులని...' ఉద్దేశ్యంతో "కవిసేన"ను స్థాపించారు శేషేంద్ర. సమకాలిక రాజకీయ పక్షాలను, కవులను, సాహిత్యోద్యమాలను తూలనాడడంలో 'కవిసేన'వారు సంయమాన్ని కోల్పోతున్నారు. కవిసేన కావ్యవస్తువుపై కంటే శిల్పంపై చర్చ నాహ్వానించడం...ఆలోచించదగ్గ విషయమే. నా దృష్టిలో ఔచిత్య శోభితమైన కవిత్వం రాణించడానికి 'కవిసేన' ఇతర కవుల్ని, సమాఖ్యల్ని నిందించక్కర్లేదు.

మర్రిచెట్టు ఊడల్లా విస్తరించుకున్న శేషేంద్ర కవితావైచిత్రి నీడక్రింద, మల్లెతీగల్ని మత్తుగాలిపి...ఆ వూడలకై వూగిసలాడించాలనే ఆయన 'కవిసేన' ప్రచారం, అభ్యుదయ కవి, ఉన్నత ఊహల శ్రీ సోమసుందర్ "శేషేంద్రజాలం" లో మరే అర్థం కోసమో వ్యర్థంగా సాగిందని చెప్పక తప్పదు.

వైచిత్రికోసం...భావాలు కలగలుపై, అస్పష్టతను పులుము కోవడం శేషేంద్ర కవిత్వంలో కన్పించడంవలన యువతరంలో కొద్దిమంది తప్ప ప్రసిద్ధ కవులెవ్వరూ ఆయనను అనుసరించడంగాని, 'కవిసేన'కు మద్దతు నివ్వడంగాని జరుగదు.

శేషేంద్ర వచన కవిత ఎక్కువ ఉపన్యాస ధోరణిలో సాగినా, రసవత్తర భావం, నూతన కవితాశిల్పం ఆయన సాహిత్యానికి ఒక విశిష్ట స్థానాన్ని ఆపాదిస్తాయి.

తనదైన విశేషభావనాస్రవంతి కలిగిన శేషేంద్ర... భావ క్లిష్టతను, భాషా తీవ్రతను తగ్గిస్తే ప్రజాకవిత ప్రతినిధి కాగలరన్నది నిజం. శేషేంద్ర ఆ విషయాన్ని అర్థం చేసుకుని, భవిష్యత్ భావాల్ని వ్యర్థం కానీయరని ఆశిద్దాం. అలాగే అంతర్జాతీయఖ్యాతినొందిన ఆయన భావనా లహరికి తోడుగా 'చంపూవినోదిని', 'పక్షులు' ఇంగ్లీషు టెక్ట్స్‌ను సంతరించుకోవాలని కోరుకుందాం.

వి. యస్. ఆర్. శర్మ

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, ఒళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా ఉపశమింపజేయగలదు!

## మేలుపరచబడిన

# అమృతాంజన్

మీ మోముపై చిరునవ్వులను శీఘ్రంగా తిరిగి వికసింపజేయగలదు!

rutanjan Limited



OBM 149 TG R

# గ్రంథ విమర్శలు

## పాంచజన్యము - దేవదత్తము, శ్లోకాలు - శ్లోకాలు

[రచయిత - శ్రీ వఝ్ఝల కాళిదాసు. 12 + 84 + 8 + 30 పుటలు. వెల రూ. 5-50. ప్రకాశకులు - ఆంధ్ర విజ్ఞాన సమితి, జెంషెడ్‌పూర్. ప్రతులకు చిరునామా - ఆంధ్ర విజ్ఞాన సమితి, నెం. 68, 'O' రోడ్, బిష్టుపూర్, జంషెడ్‌పూర్-1. (బీహార్)

యుద్ధభూమికి వచ్చి, శత్రువులతో పోరుటకు వెనుదీయు అర్జునునికి శ్రీకృష్ణ భగవానుడు గీతోపదేశం చేసి, స్వధర్మ నిర్వహణకు పూనుకొన్న సంగతి అభిజ్ఞులకు తెలిసినదే! ఆ భగవద్గీత ఆధ్యాత్మి కాంశాలను ప్రభోధిస్తూ ఉండగా, దానిని అనుకరించి నేటి ప్రాపంచిక తత్త్వాన్ని "పాంచజన్యం - దేవదత్తం" ప్రబోధిస్తున్నది. పాంచజన్యం శ్రీకృష్ణుని శంఖమనీ, దేవదత్తం అర్జునుని శంఖమనీ అందరికీ తెలుసు. ఇందులో పాంచజన్యం ఉపదేష్ట. దేవదత్తం శ్రోత.

భగవద్గీత - లో అర్జున విషాదయోగం మొదలుకొని మోక్ష సన్న్యాసయోగం వరకు - 18 అధ్యాయాలున్నవి. ఆ పద్ధతిని అనుకరిస్తూ ఇందులోనూ కనిషాదయోగం మొదలుకొని మోక్ష విన్యాస యోగం వరకూ 18 అధ్యాయాలు ఉన్నాయి. గీతాలలో భక్తి జ్ఞాన కర్మ యోగాలను గురించి వివరించబడగా ఇందులో అధునాతన యుగం లోని వివిధాంశాలను గురించి విమర్శపూర్వకంగానూ, సంగ్రహంగానూ చెప్పటం జరిగింది. సులభమైన వ్యావహారిక భాషలో హ్రస్వ గీతికలతో రచన యింపుగా సాగినది. దీని చివర, భగవద్గీతలోని

"పరిత్రాణాయ లోకానాం  
వినాశాయ చ దుష్కృతామ్।  
ధర్మసంస్థాపనార్థాయ  
సంభవామి యుగే యుగే"

అనే శ్లోకాన్ననుసరించి

"యుగధర్మం నడుస్తూంది  
యుగాంతానికి నాందిగా,  
ధర్మాన్ని పునఃస్థాపించే  
అవతారం జనించును!"

అని సూక్ష్మంగా తెలుపబడింది.

ఆధ్యాత్మిక తత్త్వాన్ని బోధించే భగవద్గీత అందరికీ అర్థం కాదు. కాని, యిది వయో విచక్షణ లేకుండా అందరికీ అర్థమయే సంగ్రహ గ్రంథం, అధునిక యుగానికి ప్రతిబింబం.

దీనిని సుప్రసిద్ధ విద్వాంసులు, విద్వాన్ దివాకర్ల రామమూర్తి (ఎం. ఏ) గారు "పరిచయం" చేస్తున్నారు. ఆయన కాళిదాస కవిగారి ప్రత్యేకతను, గ్రంథ వైశిష్ట్యాన్నీ వివరిస్తూ అనేక విషయాలు వివరించారు. దానిని చదివితే కవి హృదయం బాగా అర్థమవుతుంది.

రెండవ కృతి "శ్లోకాలు - శ్లోకాలు". వాల్మీకి మహర్షి కి క్రౌంచ పక్షి శోకం వల్లనే 'మానిషాద ప్రతిష్ఠాంత్వం' అనే శ్లోకం ఆవిర్భవించి ఆదికావ్యానికి కారణమయింది. ఈ కవి దాన్ని అనుసరించే "శ్లోకాలు-శ్లోకాలు" రచించినట్లున్నది

"శోకం కల్గితేనే శ్లోకం  
రసస్ఫూర్తి చిందించును,  
శ్రీపాద తాడితా శోకం  
గంధిలమై పుష్పించును"

అని యాయన అభాణకం! ఇందులో కవి పరితాపం వివిధ దృక్కోణాలలో వెలువడుతున్నది. ఆంధ్రుల ప్రాచీన వైభవం ఇప్పటి స్థితి

"మగధపై మధురపై  
తెలుగు జెండా ఎప్పుడో  
ఎగిరుంటే ఎగిరిందోయ్,  
నేడేమిటి నీ స్థానం"

అని ప్రశ్న పూర్వకంగా వ్యక్తపరుపబడింది. ఇలా అనుష్టుప్పుల వంటి చిన్న గీతికలు నూటపదారింట లోక పరిస్థితిని తెలుపుతూ కవి చివరకు

"మూడనీ, పధ్నాలుగనీ  
అభిప్రాయా లనేకముల్,  
కవిశ్రీ శ్లోకాలోకంలో  
నూటపదారు లోకముల్"

అని ముగించారు.

లోకం తీరు తెన్నులను సంగ్రహముగా ఈ "శ్లోకాల" వల్ల తెలుసుకోవచ్చు.

బులుసు వేంకట రమణయ్య

# భువన మోహినీ విలాసము

[రచన : పెదలూరి వెంకటాద్రి, సంపాదకుడు : శ్రీ కపిలవాయి లింగమూర్తి. ప్రతులకు : కె. కిశోరుబాబు, 15-34, వాణీ సదనం, విద్యానగర్ కాలనీ, నాగర్‌కర్నూల్, మహబూబ్‌నగర్‌జిల్లా, వెల : రూ. 12-00.]

'ప్రబంధం పేరు వినగానే విసుగూ అసహ్యభావం కలిగేట్టు చేశారు చాలామంది ప్రబంధకవులు. ఇది నామాట కాదు. అలా వింటూ ఉంటారు. ఆ నోటా ఈ నోటా వినవచ్చే మాటా... అక్కరమాలిన వర్ణనలు! ఎందుకన్ని? యీ మాట నిజమే అనిపిస్తుంది. అందుకే ప్రబంధం (శృంగార ప్రధానం) వ్రాయడానికి నేను సంకల్పించలేక పోయాను. ఎప్పుడో చిన్నప్పుడు కళాశాలలో విద్యార్థిగా ఉన్న కాలంలో 'ఉషానిరుద్ధ' ఏకశ్చ సపద్యకావ్యం వ్రాసి ఒకనాడు నిదానంగ చదివి 'దీనినెవరూ అసహ్యించుకోరు' - అని తృప్తి పడ్డానే కాని ఇంతవరకు దానిని ముద్రించి నలుగురికీ అందించడానికి ప్రయత్నించలేదు ....

అలాటి ప్రబంధ ధోరణిలో అవతరించు యీ భువన మోహినీ విలాసం - అంత అసహ్య పద్ధతిని లేదని చెప్పవచ్చు. వర్ణనలు లేకపోలేదు. కాని కాస్త ముచ్చటగానే ఉన్నాయి. వెర్రెత్తించేవిగా లేవు. భాషకూడా అందుబాటులో ఉంది అక్కడక్కడ కొన్ని చిన్న చిన్న మారుమూల పదాలుగా అర్థం చేసుకోవచ్చు. సవరించవలసేవిన్నీ ఉన్నాయి. 'ఎద' - 'యద' గా ఉన్నది. 'దీపకంబము' ప్రయోగం వీరశైవ వాఙ్మయంలో తిష్ఠవేసినదే. 'పుష్పపొడి' ఎలా దిద్దాలో తెలియలేదు. శ్లేష చమత్కారం నిండుగా ఉన్నది.

కథ కూడా రుచిరంగానే ఉంది. తొలి జన్మలో పెండ్లికాని వధూవరులు మలి జన్మలో వధూవరులౌతారు. దీనికి కర్తలిద్దరు. ఒకడు గురువు. ఇంకొకడు బ్రహ్మరాక్షసుడు.

కావ్యమంతా ద్విపదం. ఏడుకొండల స్వామికి అంకితం. కవి కాలం తెలియదన్నారు సంపాదకులు. అవుగాక! ఇంతకాలానికి ఉత్తమ శ్రేణిలో చేర్చదగిన కావ్యాన్ని లింగమూర్తిగారు వెలుగులోకి తెచ్చి సత్కృతులయ్యారు.

దాని ముద్రణకు ఆర్థికంగా చేయూతనిచ్చిన తిరుమల-తిరుపతి దేవస్థానం యాజమాన్యమును కూడ అభినందించాలి.

# కాదంబరి

[సాహిత్య వ్యాస సంపుటి. డా॥ పోచిరాజు శేషగిరిరావు రామారావుపేట, పెద్దాపురం - 533 437, తూర్పుగోదావరిజిల్లా, మూల్యం : రూ. 15.]

ఇది - రెండు భాగాల వ్యాససంపుటి. మొదటిభాగం శ్రీనాథుని గ్రంథసమితి - వాని వాగ్వైభవం, శ్రీనాథుని వ్యక్తిత్వం, జీవిత విశేషాలు నిర్మలమైన అద్దంలో ప్రతికృతిలాగ చూపుతుంది.

రెండవ భాగంలో ఆంధ్ర సాహిత్యంలో గ్రామ కరణాలు, మీసాల 'కవిత', సాహిత్య నందనంలో చారు (నారి) కేళాలు, జీవితము కళ, 'సాహిత్య'ము : విలువలు, పొగ్రకోవి : కవితారసపు జల్లులు, పెద్దాపుర సంస్థానము : సాహిత్యపోషణ - అనే వ్యాసాలు ఉన్నాయి.

శ్రీనాథుని రచనలు, ఆశ్రయం వర్ణనవైభవం - వగైరా వివరించి చెప్పడం రావుగారి సాహిత్యహృదయ శక్తికి ప్రతిబింబముగా కనిపిస్తుంది. రెండవ భాగంలో వ్యాసాల్లో మీసాల 'కవిత' - ఓర్పుగా చదవవలసేది. ఈ వ్యాసంలో కూడా శ్రీనాథుడిదే అగ్రపీఠం. ఆయా కవుల గ్రంథాలలో ఉన్న మీసాల ప్రసక్తికి సోదాహరణంగా చూపుతూ ఆధునిక కవుల చాటువుల్ను చూపుతూ పౌరుషానికి ప్రశంశిస్తూ వ్రాసిన వ్యాసం.

దానివంటిదే 'పొగ్రకోవి' వ్యాసం - పొగ త్రాగనివాడు దున్నపోతై పుట్టున్ - వంటి చాటువులు గుదికూర్చి వ్రాసిన వ్యాసం ఇదే ఈనాడు నిత్యాగ్నిహోత్రంగా చలామణి అవుతూంది.

చివరి వ్యాసం పెద్దాపుర సంస్థానాధీశులూ వారిలో కొందరు కవులూ ఆ సంస్థాధీశుల ఆశ్రయం పొందిన ఏనుగు లక్ష్మణకవి వంటి సుప్రసిద్ధులు కవులూ ఆ వ్యాసం వల్ల తెలుస్తారు.

శేషగిరిరావుగారు ఈ వ్యాస సంపుటిలో ఉపయోగించిన భాష చాలవరకు గ్రాంథికమే యైనా సుకుమారంగా ఉండి సర్వజనామోదకరం అయింది.

శ్రీనాథుణ్ణి గురించి తెలుసుకోవాలంటే ఆశ గలవారికి బాగా (క్షుణ్ణంగా) ఉపయోగించే వ్యాసాలున్నాయి. యువతరం భాషాభిమానులకు ఎంతో ఉపకారి యీ గ్రంథం.

దీని అచ్చుకి ఆర్థిక సహాయం చేకూర్చిన ఆంధ్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారశాఖను అభినందించవచ్చు.

# కైలాస దర్శనం

బ్రహ్మ మానస సరోవర యాత్ర

[రచన : శ్రీ పి. వి. మనోహరరావు. ప్రతులకు : రచయిత పేర - 6-4-108, బ్రాహ్మణవీధి, హనుమకొండ - 506 011, వరంగల్, ఆం. ప్ర మూల్యము : మేలుప్రతి : రు. 150/-, సాదా ప్రతి : రు. 120/-]

తీర్థయాత్రలూ, పుణ్యక్షేత్ర దర్శనం అనేవి సంకల్పించినంత మాత్రాన జరుగవు. వాటికి ప్రాక్తన సుకృతం అంగరక్షగా ఉండాలి. చేత చిల్లిగవ్వ లేని వ్యక్తికి శ్రీశైల దర్శనం ఆకస్మికంగా జరుగుతుంది. కోటి రూపాయలున్నవాడు కోటిపల్లి వెళ్ళలేడు. ఇక కైలాస దర్శనం ఎలా అవుతుంది. ఇరవై తొమ్మిది దినాలలో కైలాసం, మానససరోవరం వరకు ఉత్తర దిగ్యానం చేసివచ్చిన ధన్యాత్ముడు శ్రీ మనోహరరావు. తాను చూసినవి చూసినట్టుగా వాటికి సనాతన గ్రంథాల నుంచి ఆవశ్యక విషయం ప్రమాణసూత్రంగా ఎత్తిచూపుతూ రచించిన యీ గ్రంథం ఆ యాత్ర చెయ్యనివానికి చెయ్యాలనే ఆవేశం కలిగిస్తుంది. చేయలేనివానికి మానసికంగా ఆశ్చర్యానందానుభూతిని కలిగిస్తుంది.

ఈ గ్రంథం శృంగేరి కామకోటి సిద్ధేశ్వర పీఠాధిపతుల ఆశీః కుసుమాలంకృతమై పరమ పవిత్రభావ గ్రంథి అయింది. అందునా సిద్ధేశ్వర పీఠాధిపతుల (కుర్తాళం) అభిప్రాయం ఈ గ్రంథ విషయమును అధ్యాయ క్రమణికలో మహాభాష్య రూపాన వివరించింది. దానినిమించి ఎవ్వరూ దీనికి సమీక్ష వ్రాయనక్కరలేదు.

అన్నగారు, భారతప్రభుత్వామాత్యమణి శ్రీ నరసింహారావుగారు "తొలిపలుకు"లో ఆయా మతాచార సంపత్తిని వివరిస్తూ చెప్పిన విషయం ఈ కృషికి దివ్య రత్నాలంకృతి

ఆయా స్థలాలకు సంబంధించిన రంగురంగుల చిత్రాలు కనుల పండువుగా ఉన్నాయి. ముద్రణ మరీ ముద్దుగా ఉంది.

గ్రంథ విషయం అమూల్యమేగాని గ్రంథమూల్యం కొంచెం అమితంగా ఉంది.

# వేటూరివారి సారస్వత పరివస్య

[రచన : డా॥ పోచిరాజు శేషగిరిరావు. రామారావుపేట, పెద్దాపురం, తూ॥ గో॥ జిల్లా. వెల : రు. 75/-]

కొందరు కొన్నిమాత్రమే తెలుసుకుంటారు. అందరూ అన్నీ తెలుసుకోలేరు. కొందరు కొన్నిమాత్రమే చేస్తారు. అన్నీ అందరూ చెయ్యలేరు. కొందరినీ అందరినీ ఒప్పించి మెప్పించే పనులు నూటికి కోటికి ఒక్కరు చేస్తారు. మన తరంలో అలా చేసిన మహా కర్మయోగి సారస్వత యోగి, పరిశోధన యోగి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. మాటాడుతున్నట్లు అలవోకగా చక్కని కవిత చెప్పడం ఆయనకి ఆజన్మసిద్ధం. దానికి తగిన పాండిత్యం అదృష్టవశాత్తు అబ్బింది. ఈ రెండిటినీ మించిన శక్తి పరిశోధన. ఇది సారస్వతానికే కాదు వ్యక్తిత్వ పరిశోధనకి కూడా ఆయనను సానపట్టిన రాయిని చేసింది. అది క్రమంగా యోగిని చేసిందని నా అభిప్రాయం. ఆయనతో నాకు గల పరిచయం చాలా స్వల్పం. ఆయన నాకు అన్న అవుతాడు. మా యిరువురుకున్నూ కవితా గురువులు కిం కవీంద్ర ఘటాపంచాననులు. అదే మా చుట్టరికం. మా అన్న బసవపురాణ పీఠిక నాకు ఆప్యాయంగా ఇచ్చి తద్ద్వారేణ వీరశైవ వాఙ్మయం మీద ఆదరం కలిగించారు. ఆ తరువాతనే నేను పాల్కురికి కావ్యంపై వ్యాసాలు వ్రాయడం, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక వాటిని ప్రచురించడం జరిగింది. ఏబది సంవత్సరాల క్రిందటి సంఘటన ఇది.

'గాటంపుతమి తోట నాటుకొన్నారు

నిండారపండెనె జహంగీరు మావి' - అనే పద్యం గురువు గారికి వ్రాసిన ఉత్తరంలోది ఇప్పటికీ ఈ చరణం నా జ్ఞప్తిలో ఉంది.

'అన్నమాచార్యుడు' ఈనాడు అందరికీ కనిపించడానికి కారణం మా అన్న. శృంగార శ్రీనాథంలో శ్రీనాథుడు దర్శనమిస్తాడు.

ఆయన సంకలన గ్రంథం 'చాటుపద్య మణిమంజరి' ఎన్నో విధాల ఉపకరిస్తుంది.

ఆంధ్ర సారస్వత పరిశోధన దివ్య సరస్వతీ నాట్యరంగ భూమిగా ఆయన పునర్జన్మ.

శ్రీ శేషగిరిరావు గురువుకి తగిన శిష్యుడుగా యీ సిద్ధాంత వ్యాసపీఠం సంతరించి ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో ఒక రతనాల సింగపు గద్దెను రూపొందించి చరితార్థుడయాడు.

ఈ గ్రంథం శ్రీ ప్రభాకర సారస్వతప్రభను వేయి అంచులతో చూపుతూ ఆనాడు తెలిసినవారికీ యీనాడు తెలియనివారికిన్నీ 'తెలుగు పలుకుల రాణి చిరునవ్వు వెన్నెల' ప్రభాకరశాస్త్రి రూపుదిద్దుకున్నదనే ఆనందానుభూతిని కలిగిస్తుంది.

యామిజాల పద్మనాభస్వామి

## తెలుగు జ్యోత్స్న

[దామోదరం రంగయ్య, వెల: రు. 2-00, ప్రతులకు: రచయిత: 1-10-11/1, అశోక్‌నగర్, హైదరాబాద్.]

ఇటీవలి కాలంలో 'తెలుగు' శబ్దం విరివిగా వాడుకలోకి వచ్చింది. అతి అయినప్పుడు ఏదైనా వెగటు పుడుతుంది. రాష్ట్రాభిమానం, భాషాభిమానం మంచిదే. మేరమీరిన అభిమానం మనిషిని అంధుణ్ణి చేస్తుంది. రంగయ్యగారె ఈ కవిత్వం అట్లాంటి ఆధత్వానికి బలికాలేదు. తెలుగుతల్లి సమగ్ర సంస్కృతికి ఈ సంకలనంలో రంగయ్యగారు నీరాజనం పట్టారు.

తెలుగు విప్లవగీతాల తోరణంబు
తెలుగు మార్పుల తీర్పుల కోవెలేను
తెలుగు శాంతికి ప్రాణము తీర్చిదిద్దు
దేశభావలందును జూడ తెలుగు లెస్స!

ఇదీ వీరి కవిత్వ పద్ధతి.

## అణువు పగిలింది

[తాతా రమేష్ బాబు, వెల: రు. 4-00లు, ప్రతులకు: డి. రమేష్‌బాబు, ఎస్/ఆఫ్ డి. బసవలింగం, డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్, గుడివాడ.]

ఇది ఈ కవి తొలి కవితా సంకలనమని ముందుమాట రాసిన డా॥ వెలగా వెంకటప్పయ్యగారు చెప్పారు. "అన్నీ గొప్ప కవితలుంటేనే పుస్తకాన్ని ముద్రించాలి; లేకుంటేలేదు అని కొందరు విమర్శించబూనటం నేను అంగీకరించను. కవితల గొప్పదనం ఎవడో ఒక విమర్శకుడు నిర్ణయించి చెప్పేదికాదు. సహృదయులైన పాఠకులు చెయాల్సినపని అది." అని రావి రంగారావుగారు చెబుతున్నారు. ఎవరు చెప్పినా కళంకంలేని కాగితాన్ని ఖరాబుచెయ్యటం ఎందుకు! అనేగాని అసూయతోకాదు. పుస్తకం వెయ్యటం ఉబలాటం లాంటిది.

దీంట్లో కవితలన్నీ మినీ కవితలే. కవికి రావి రంగారావుగారు చెప్పినట్టు సామాజికస్పృహ ఉంది. అది ఇవ్వాళ కవిత్వానికి పెద్ద క్వాలిఫికేషన్. ఏదిఉన్నా లేకపోయినా సామాజిక స్పృహఉంటే సంఘంలో సభ్యుడే.

మా నాయకులు
మా గొప్ప కాపరులు-
మా సమాజం
మా చక్కని గొర్రెలు-
గొర్రె కోరింది పచ్చ మేత!
కాపరి కోరింది పచ్చనోటు!

మన రాజ్యాంగాన్ని గురించి ఒక గేయం రాశాతీయన.

మేధావులు కొందరు
మతులు చెడగొట్టుకొని
ఈ లెఖ్ఖ చేయడానికి
చాలా సూత్రాలు రాశాట్టారు
ఎన్ని సూత్రాలయితేనేమిటి?
వీళ్ళందరుకు వచ్చిన అన్సరు
'దోపిడే' కదా!

ఇది వీరి దృక్పథం, కవిత్వం. రావి రంగారావుగారు ఆశించి నట్టు భవిష్యత్తులో ఈ కవి మంచి కవిత్వం రాస్తారని ఆశిద్దాం!

## కరుణా శతకము

[చలివేంద్ర రామమూర్తి, వెల: రు. 2-00లు, ప్రతులకు: రచయిత: జూనియర్ లెక్చరర్ (ఇంగ్లీషు) ప్రభుత్వ జూనియర్ కాలేజీ, పొదలకూరు, నెల్లూరుజిల్లా.]

ఈ శతకంలో నీతులు, సూక్తులు, ప్రస్తుత పరిస్థితులమీద ఏవగింపు కనబడతై. రచయిత ఉత్తమ నడవడికను ప్రోత్సహిస్తున్నారు.

ధన సంపాదన సేయుట
యొనరంగా మానవునకు నొప్పుగుచున్నన్
చిన చేపను పెద చేపపై
తినుమానవ ధర్మహాని తెలివియె కరుణా

ఈ రకంగా వీరి కందపద్య శతకం సాగుతుంది.

## విశ్వ శతకము

[వేదాటి రఘుపతి, వెల: రు. 3-00లు, ప్రతులకు: కాకతి పబ్లికేషన్స్, నారాయణగూడ, హైదరాబాద్, 2) ప్రజాభారతి సాహిత్య సాంస్కృతి సంస్థ, 10/3 విజ్ఞానపురి, హైదరాబాద్.]

ఆట వెలదుల్లో లోక వృత్తాన్ని ఆదిలో అనితర సాధ్యంగా చెప్పిన కవి వేమన. సాంఘిక అక్రమాలను దుయ్యబట్టడానికి ఆటవెలది వేమనకు ఆయుధమైంది. ఆధునిక కాలంలో చాలమంది కవులు ఆటవెలదిని చేపట్టి సంఘాన్ని దుయ్యబట్టడం మొదలుపెట్టారు.

ఈ కవి అనేక అంశాలపై ఈ శతకం రాశారు.

మండుటెండలోన మాడిపోయె నొకడు
చలువరాతి నీడ కులికెనొకడు
చాకిరొకరిదైన, సౌఖ్యమింకొకరిదా?
విశ్వవినుతన్నామ వినుర రామ

అని లోకం పోకడను గమనించిన కవి-

వెర్రికేక తోడ పిడికెలి బిగియించి
ఇజము పేర అసలు నిజము మరచి
వెళ్ళుచున్న యువత కళ్ళను తెరవాలి

అంటున్నారు. అంటే వీరికికూడా ఇంకా నిజం తెలియలేదన్న మాట. మొత్తంమీద ఈ శతకం ఈ కాలానికి సంబంధించినది.

## శ్రీ సాయీ మననము

[కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావు, వెల: రు. 10-00లు ప్రతులకు: బాపట్ల పార్థసారథి, శ్రీసాయీ నిలయమ్, చెరువు (పోస్టు) 522113.]

ఈ గ్రంథం 1958లో ప్రథమ ముద్రణపొంది ఇప్పుడు ద్వితీయ ముద్రణ పొందింది. ఈ రచనకు ప్రేరణ తనకు వచ్చిన ఒక స్వప్నమని, ఆ స్వప్నములో సాయిబాబా తనకు ధైర్యమును ఇచ్చాడని, కనుక ఈ రచన సాయిబాబా పలికించిన ఫలితమేనని హనుమంతరావుగారు పేర్కొన్నారు. ఈ గ్రంథం మూడు సర్గలుగా విభజింపబడింది. "సమర్థసద్గురుదేవు- శ్రీ సాయీ ప్రభు నామస్మరణ మననములకంటె జీవికి తరుణోపాయములేదు. కావున నా యథాశక్తిని ఆ సాయినాథుడు పలికించిన విధమున ఈ కృతిని బలికి సోదర భక్తులకు సమర్పించితిని" ఇది కవిగారి రచనా పరమార్థానికి మూలం. ఇట్లాంటి రచనలు చదివేటప్పుడు సాధారణంగా కవిత్వంకోసం ఎవరూ చూడరు. ఇది ప్రధానంగా భక్తి రచన కనుక ఆ భక్తిలో తన్మయం చెందుతారు.

దురభిమానము సిగ్గును దొలగజేసి
సతము, శ్రీసాయి నామావళి సంస్మరించు
నతడు, తన తోటి కులజులు ననుసరింప
బొందుబరమేశు నవ్వ యానంద పదము
వ్యర్థముగ గాలమెందు ద్రోయంగ దగదు
ఆయువు క్షణ క్షణంబు క్షయంబునొందు
గాలు డొక యించుకేనియు గరుణ గనడు
సాయినామ సంకీర్తనల్ సలుప మేలు

అని జీవిత కర్తవ్యాన్ని బోధించారు. భక్తులంతా చదవవలసిన రచన ఇది.

ఓ. స



Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247.